శ్రీ

# దురాశాభంగము.

లేక,

# సునందనీపరిణయము.

నూతనమగు,

తెలుఁగునాటకము.

ఇది,


బళ్లారిజిల్లా బళ్లారిడిస్ట్రిక్టు మునసఫ్‌కోర్టు వకీలు

కోలాచలం శ్రీనివాసరావుచే


రచియింపఁబడినది.




మొదటికూర్పు.

మద్రాసు

ఆనందముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1895



*All rights reserved.*

ఈ గ్రంథము ''దురాశ భంగమును గలిగించును.'' అనునీతిం దెలియఁ జేయుం గావున దురాశాభంగమనియు, సునందనియొక్క పరిణయ వృత్తాంతమును దెలుపుటచే సునందనీపరిణయ మనియుఁ బేర్కొనంబడియె. గ్రంథశీర్షికయందు కథాప్రారంభమునకుఁ బూర్వమున మొదటిపేరును, కథాప్రవేశ మయినపిదప గ్రంథాంతమువఱకును రెండవపేరును జూడఁగలరు. కావున నారెండు నీగ్రంథమునకుఁ బర్యాయనామము లని తెలియవలయును.

## ఈనాటకమునందలి ముఖ్యపాత్రలు.

| | | |
|---|---|---|
| ప్రతాపుఁడు | = | కళింగదేశపురాజు. |
| జయదేవి | = | ప్రతాపునిభార్య. |
| సునందని | = | ప్రతాపునికూఁతురు. |
| జయపాలుఁడు | = | ప్రతాపునికొమారుఁడు. |
| ఉగ్రసేనుఁడు | = | ప్రతాపునిసేనాధిపతి. |
| కుబేరుఁడు | = | సుమతికుమారుఁడు. |
| జయమాలి | = | సుమతికూఁతురు. |
| కలకంఠి | = | సునందనిచెలికత్తె. |
| మంగళాంగుఁడు | = | అంగదేశపురాజు. |
| సుదేవుఁడు | = | మంగుళాంగునికొమారుఁడు. |
| మణికంధరుఁడు | = | మంగళాంగునిమంత్రి. |
| వామనాచార్యులు | = | పురోహితుఁడు. |

చండోడు
రాముగాడు
కోసిగాడు
} ఎఱుకదొంగలు.

చంచోడు
వెఱ్ఱోడు
పిచ్చోడు
} ఘాతకులు.

జీవాజిసింగు
రామసింగు
లక్ష్మణసింగు
ప్రతాపసింగు
} భటులు.

## దైవప్రార్థనము.

మ॥ అజరు, ల్రాత్రిచరు, ల్విరించిహరు, లాహార్యాదిసత్త్వాధికుల్,
నిజ మాభక్తి నినుం దలంచి వినుతి న్సేవించి మే లందఁగా,
గజరాజానన! నీదుపూజలు సదా గావింపఁగా లేక, యే
విజయంబు న్గైన శక్యమే, జగతిలోఁ విఘ్నేశ్వరా! ప్రోవరా.

---

## చంపకమాలిక.

---

సరసరసానుభూతు లగుశాస్త్రవిచారులఁ జేరి, పెక్కు వా
సరములు విద్యల న్గఱచి, సారము లెల్ల గ్రహించి మించి, వా
క్సరణి సరాళభంగిఁ గనుసాధనసంపద లున్నఁ గాని, మీ
సరముగ నిన్ను హృత్సరసిజంబున నిల్పి, నిరంతరంబు వే
సరక భజింప కున్నఁ, గొనసాగదు గ్రంథ మటన్న, భారతీ!
సరవిని శాస్త్రము ల్చదువ, సజ్జనసంగతి సున్న, నైన, నే
సరసులు మానసంబునను సై యనఁ జేయఁ దొడంగితిం గృతిన్;
సరసిజగర్భురాణి! నిను సన్నుతి సేసెద, సత్కృపామతిన్
సరగున వచ్చి, నాదుఘనసత్క్రియ లందుచు హెచ్చరించుచున్
సరసనె యుండి, సంతతము సన్మతి నిచ్చుచు నన్నుఁ గాచి, కి
సరఖిలవర్గవాగ్విశిఖజాలము లంటఁగ నీక మాన్పవే;
సరససుధారసం బొలుక, సారెకు నారసనాగ్రసీమ వా
క్సరణులు వచ్చులాగు, నవసారసలోచన! వాణి! నిల్పవే;
సరళసువర్ణసంకలితశబ్దము లిచ్చుచు నన్నుఁ బ్రోవవే;
సరసమతి న్నినుం దలఁతు, శారద! నీతివిశారదా! సదా.

# సునందనీ పరిణయము.



## ప్రథమాంకము.

### నాంది.

శా. శ్రీరాగాంచితపాదపద్మముల నే సేవించి, గౌరీశునిన్
గారా మొప్పఁగఁ గొల్చి, వాక్పతి హృదాగారంబున న్నిల్పి, నే
ధారాళంబుగ సంస్కృతాంధ్రకవుల న్ధ్యానించి, సద్భక్తిచే
నీరాత్రి న్సమ్ముఁ గారవించువిబుధానీకంబుఁ బూజించెదన్ ౧౧



నాంద్యంతమున సూత్రధారుఁడు.

గీ॥ భాగవతము గాదు, భారతనైపుణి గాదు రామువార్తగాదు మునులచిత్ర
చరితగాదు చెవులొగ్గి వినవల దనుచుఁ ద్రోయఁబోకుఁ డయ్య దీని॥ ౧౧

ఏమి యిది వేళ మీఱినను నటి రాక యున్నది? దాని తెలివి దాసీమంద యానమునొద్ద శుశ్రూష సేయుచున్నది కాఁబోలు. స్త్రీలు జడమతులు గదా?

నటి. నాయకా! వచ్చితి. కోపము వలదు ఆంగ్లేయదొరలంబలె ఘటికార్థకాలవిళంబ మయినను సైప నోపవే? ఇప్పటిమగవారాదొరలను జూచి వారి సుగుణంబులను సరకుసేయక దుర్గుణంబులను మాత్రము శ్రమపడి యవలంబించెదరు. కాలదోష మే మన నగు?

సూత్రధారుఁడు. ఓసీ! నా కెప్పటికైనను నీపైఁ గోపంబు గలుగునా?

నటి. అది కోపంబు గా దేని మగవారిపిచ్చి. మంచిది, న న్నేల రప్పించితిరి?

సూత్రధారుఁడు. మఱచితివా? మగువా! నేఁ డొకనవీననాటకంబు ప్రదర్శింపఁ బండితులు మనలఁ గోరరే?

నటి. నిజము. నిజము. నవీననాటకం బెచ్చటినుండి తెచ్చెదము? వినినకథ వినుట కెవ రోపుదురు? మనవా రున్నకథలను దలక్రిందు సేయనే సమర్థు

లుగాఁగ నవీనకథలను గల్పింప వారి కెక్కడ లేనిసంకటంబు సంభవించు. అది యేలనో తెలియదు. శబ్దసంపద లేనివా రందమా? జంఝామారుతం బునకుం జిక్కి భంగపడెడుసముద్ర భంగములభంగిఁ బదములపైఁ బద ములు పైఁబడి వారివదనంబున వెడలుచుండును. అలంకారవేత్తలా గా రందమా? ప్రపంచంబున నలయుపమానోత్ప్రేక్షా ద్యలంకారంబులకు వారిగ్రంథంబులు పుట్టినిండ్లై యుండు.

సూత్ర. ఇంతీ! ఎంతటిమతియుతు లయినను మనవారు నూతనవిషయంబు విషప్రాయం బని యెంతురు. అది నీ వెఱుఁగవే?

నటి. నిజము. అర్థకామంబులవిషయం బెంతనూతనం బై యున్నను మాని తం బని దానిం బూనుదురు. ఆమాట లిపు డేల? ప్రస్తుతము సేయం దగినకార్యం బేద్ది? ఏనాటకంబు ప్రదర్శింపం బూనితిరి? అది నూతనం బై యుండవలయుం గదా?

సూత్ర. నూతనం బగు "సునందనీపరిణయ" మనఁబడు "దురాశాభంగము" ప్రదర్శింపం బూనితిని.

నటి. ఆకథ నూతనంబు గదా.

సూత్ర. అందునకు సందియం బేమి? నూతనం బనుటకు నాగ్రంథంబులోని యొకపద్యంబుం జదివెదను విను.

ఉ॥ పన్నిరి యున్నతోరుతరుపత్రములంబలె గాథ లెన్ని యో
మున్ను కవు ల్పురాణగతపూర్వమహీశులఁగూర్చి నేఁడు నే
నున్నవి ముట్ట నేల యని యొప్పగుచిత్రచరిత్ర మొక్కటిన్
బన్నితిఁ బద్యగద్యములఁ బండితపామరసంతసంబు గన్. ౧

నటి. అటు లయిన నది నూతనంబుగా నుండును. ఐన నీనాటకంబునకు దురా శాభంగం బనునామం బేల కలిగెనో?

సూత్ర. ఆకథయందు "సుమతి" యనుమంత్రి యన్వర్థకనామధేయుండు కాక దురాశచేఁ బెక్కుద్రోహంబులు దన్నేలువానికిఁ గావించి తుదకు భంగ పడెను గావున దానికి దురాశాభంగం బని నామంబు వచ్చెను.

నటి. అయిన నీనాటకం బేనీతిని జనులకు బోధించును?

సూత్ర. మానవుఁడు దనకుం దగనిపదవు లాశింపం జెడు ననియును, బ్రపంచంబున నన్నిబలంబులకంటెను దైవబలంబు హెచ్చనియును, దానియందు నగుపడును.

నటి. అయ్యా! యీకొత్తనాటకం బెవరు రచించినది.

సూత్ర. గీ. కాస్యపసగోత్రజుఁడు తెలుఁగాణ్యద్విజుఁడు
భాసురుం డగుసేతూపతీసుతుండు
కలఁడు కోలాచలాంచితకులములోన
శ్రీనివాసుండు సదధీనమానసుండు.

ఆకవి. దీనిని రచియించెను. ౧౩

నటి. అయ్యా, యిది మంచినీతి ఇప్పటివా రందఱుం దమకు దేహబలం బున్న దనియును, బుద్ధిబలం బున్న దనియును విఱ్ఱవీఁగి దైవబలం బనునది మిథ్యయనిదూపించుచుందురు. అట్టివారి కిది మంచినీతి గా నుండును. మంచిది. కాలవిళంబ మేల? నాటకంబునకుం బ్రారంభింతము.

సూత్ర. నటీ! నాటకారంభమునకు ఋతుగానం బావశ్యకంబు గదా. ఈవసంతఋతువును వర్ణించుచు నీగానకళాప్రవీణతం జూపుము.

నటి. అయ్యా చిత్తము.

ఝుంఝూటిరాగము. అటతాళము.

భాసురంబులు మధు-వాసరంబులు బలు-మాసరంబులు-సిరుల మీసరంబులు॥
విషమశరాగ్ని చే - విరహనిదాఘము - కుసుమరసంబులఁ - గురిసెను వర్షము॥
సరసాననపద్మ - సంపద శరతాయె - విరహిణికంపము - వింతశిశిర మాయె॥
మరు కేళిశ్రమబిందు - మహిమ హిమం బయ్యె - తెరుణులయలకల - తఱు లవి
వెను కాయె. 1

సూత్ర. బళే! నీగానం బతిరమణీయంబు.

సరసిజవృత్తము॥ సారసమృదుగాత్రీ! చారుసరసగానం
బారయ వినినంతన్। నారదుఁ డెద మెచ్చున్॥ ౧౪.

నటీ నీగ్గానంబు వినం బూనినమనుజుఁడు దనయునికియే మఱచు నన నషయంబుపై జ్ఞానం బుండు టెట్టులు? ఆంగ్లేయవిద్యావేత్త లిపుడే మః

వారికిం గాలజ్ఞానంబు లే దనియును, జా మనునది రెండుజాములు సేయు దు రనియు హేళనంబు సేయుచున్నారు. నే నేల యట్టినిందలకుం బాత్రుఁడను గావలయును? సకాలమున కారంభించి జయ మాలిం బరిగ్రహింంచెదం జూడుము (తెఱలో)

ఓరీ! యెవ్వఁడవురా! రేయింబవళులు నిద్రాహారములు లేక తన్నిమిత్తమె యధికోత్సాహంబున యత్నించుచుండు సేనాధ్యక్షుం డుగ్రసేనుం డూపిరితో నుండ జయమాలిం బరిగ్రహింతు ననుచున్న వాఁడవు? చూడు నీభరతము పట్టించెద.

నటి. (భయముచేత వడఁకుచు) ఆర్యపుత్ర! రక్షింపుము రక్షింపుము. ఎవ్వఁడో మనభరతము పట్టింతు ననుచున్న వాఁడు.

సూత్ర. (వెన్నుచఱచుచు) ప్రియా! వెఱవకు వెఱవకుము. సుమంత్రి పుత్రిక యగు జయమాలికొఱకుఁ దపించుచున్న సేనాని యగు నుగ్రసేనుండు "జయమాలిం బరిగ్రహింతు" నను నామాట విని 'జయమాలిం బరిగ్రహింతు"నంటి నని యర్థము చేసికొని యిట్టికాఱులు కూయుచున్న వాఁడు. మదోన్మత్తుల కొడలు తెలియదుగదా! ఇఁక మన మిచట నుండఁ దగదు, పోదము పద. (ఇరువురును నిష్క్రమించిరి.) —ఇది ప్రస్తావన.

ఉగ్రసేనుఁడు. ఎవఁడురా! జయమాలిం బరిగ్రహించువాఁడు (నలువలకులం బాఱఁజూచి) యెవ్వఁడును లేఁడె. కానిమ్ము, నిన్నటిదిన మాస్థానగోష్ఠియందు సందర్భానుసారంబుగ సత్వమునుగుఱించి వాదంబు జరిగెను గదా. ప్రతాపమహీపాలుండు తిక్కప్రభు వనుటకు సందియంబు లేదు. ఎద్దియు విధివశం బని సిద్ధాంతీకరించుచున్న వాఁడు. అటు లయినచోఁ దనరాష్ట్రంబు రక్షించుటకు వాహిను లేల? వాహినీనాథుండ నే నేల? అంతటికిని దనవిధి తన్నుఁ గాఁపాడుం గాదే?. . . . . . . . . . . . . .
అవి యన్నియు వెలిమాటలు. హృదయంబున భుజగోహరియే సత్వతమం బని నమ్మినవాఁడు. ఇఁక మంత్రి యొకవెఱ్ఱి యని నే నెంచెద. ఎకార్యంబునకును బుద్ధియే కారణం బని నిర్ధారణముసేయుచున్న వాఁడు. అటు లయిన నొకభయంకరఘోరాహవంబుఁ దొడరనిమ్ము. చట్రాయి

యొకటి మోఱియనిమ్ము. అప్పుడుకదా వానిబుద్ధిబలిమి తెల్లమగు.
తిమం బగుదోర్బలప్రతాపాగ్ని ప్రజ్వలించుచుండ బుద్ధిసత్వం బనుశల
ణం బాకీలలం బడి పెద్దనిష్ఠుర ఘోషవును గాని ప్రాణంబున వచ్చుట మృ
వువాతి మొత్తి వచ్చుట కాదే? ఇది యీసుమతి యెఱుఁగకున్నవాఁడా?
ఊఁగియు నీకువాదంబు లేల చేయునో తెలియరాదు. దోర్బలంబే
చ్చని నే నుచ్చరించిన నాధారాళవచస్సమితికి వారిహృదయంబు లీఁకొన్న
జిహ్వా లోడంబడ వయ్యె. బుద్ధిబలిమియే హెచ్చని నిజంబుగ నిశ్చయి
నమ్మి యుండినచో నామంత్రి నన్నేల యనుసరించెడు. . . ఆ! ఇఁక నే
యిటీవల వాని ననుసరించి నడచెద నన్ననో దాని కొకమహాకార
బున్నది. ఆనాఁ డాయుపవనంబున నాయుడుపాననను జూచినతటినుండి
బడుపాటంతయు దైవం బెఱుంగు. దానిం జూచినయది గోల నాధై
పరాక్రమంబు లేలనో నీటికంటెనుఁ బలుచనై పఱచెను. విధిబలం
నది వెఱ్ఱి; బుద్ధిబలం బనునది పిచ్చి; భుజబలం బనునది తిక్క. బలం బన
నబలలరూపబలమే బలము. ఆబింబోష్ఠి కవతి నా కబ్బు టెటులు?
దెట్టులు? నాకుల మెంచునా? కులమునఁ దక్కువైనను బౌరుషమునం
పరాక్రమమునం దేమి, విద్యయం దేమి, నాకుం జో డెవ్వఁడు?
దంగా! . . సమ్మతింపనిచో రాక్షసవివాహంబు లేదే? ఆవిధిని శా
బుననుండి యిప్పటికళాకోవిదులు తుడిచివేయుదురే? ఆజయమా
ఆసౌందర్యశాలి! దానియంగసౌష్టవం బెంతని కొనియాడినం దీరును!

చ ॥ నెలఁత మొగంబుతీరు నెలనిద్దము మీఱును, జిన్నినవ్వులా
వెలవెలఁబాఱఁజేయు వెలివెన్నెలచాలును; గల్కిగుబ్బలా
'వెలఁ గనుఁ బైఁడిగిన్నె' లని వెత్తిగ దూఱును; జెక్కునిగ్గులా
'చెలి! కళఁ దేఱు సానల నిసీ ముకురా' లని గేలి సేసెడిన్.

క ॥ ఘనజఘన మేలుఁ జక్రము, ఘనకుచయుగ మేలుఁ జక్రఘనత, స్తన
ఘనచక్ర మేలు నాభియు, ఘనచక్రధరంబు నేలు ఘనవేణి రహిన్.

చ ॥ హరిణదృగక్షిచారుతరహారివళు ల్లహరీవిహారముల్,
హరులమనోహరంబు లవు నౌర! సఖీసుఖవాగ్ఘరీరుచుల్,

హారుల హరించు నిం బడరునారు, భళీ! హరిమధ్య కే తగున్
హరిలపనాంగకాంతి తళుకారుమనోహరహారి యై చనున్. ౧౭

క || అంభోరుహనేత్రను గని రంభోరు వటంచుఁ గవులు రహిఁ వర్ణింపన్
గుంభినులు తపముఁ గొని యా కుంభ స్తనితొడలనడలకున్ సరి పోలెన్. ౧౮

మధురగతిరగడ

నెఱికురు లిరు లని - నీలపుసరు లని । శరదనికర మని - షట్పదగణ మని
కామినికీల్జడ - కాలోరగ మని । భామినియలకలు - బంభరకుల మని
బాలశశాంకుఁడు-బాలనిటల మని । వాలుకనుబొమలు-వా లగువిం డ్లని
చెలికనుఁగవసిరి - చెన్ను కలువ లని । వెలిదామర లని- వీనులు మే రని
యతివకనీనిక - లళిబి త్తరు లని । సతివాల్చూపులు - స్మరునిశరము లని
హరిణచపల మని - హరువులగని యని । కరుణారసభర - కాసారం బని
తీ రగునాసిక - తిలపుష్పం బని । చాగుతిరం బగు - సంపఁగసుమ మని
అధర మమృత మని-యలబింబం బని। మధురిముఁ బూనిన- మావులచివురని
మరుతాపములను-మాన్పెడుమం దని।పరిమళములు గల - పద్మాకర మని
కప్పురగని యని - కాంతిఁబగడ మని । దప్పులఁ దీర్చెడు- తావిజలము లని
తరుణిరదనములు - తారలచా లని । మురువుల మొల్లల - మొగ్గలతీ రని
చిఱుచిన్నెలు గల-చిఱుతనగవుఁ గని । విగులసరము లని - వెన్నెలబా అని
కాంతికపోలము-కాంతిముకుర మని । సంతత ముదురా- ట్ఫలకసమం బని
నెలఁతకు వీనులు-నెగడెడుశ్రీ లని । నలు వగునవములు- నవశష్కులు లని
వెలఁదివదన మహా - విధుబింబం బని । జలజాతం బని - సరసనదన మని
మానినిమోమును-మానితముగఁ గని। పూనిక సుకవులు- పొగడుదు రవనిని
కలకంఠికిఁ గల - గళ మబ్జం బని । కలనాదంబులు - గలవేణువె యని
మదనుం డుంచిన - మంగళనిధికిని । గదలనిరేఖలఁ - గట్టినక ట్టని
బాహామూలలు-బంగరుపస లని । యూహకు మీఱిన-యురగపుఫణు లని
పడఁతిభుజములను-బగడపుగుము లని।యడరెడుబాహుల నమరశాఖ లని
జలజముతూం డ్లని-జాళ్వాలత లని। చెలిపాణులు సిరి - చెలిసదనము లని
కిసములనన లని - గీ ర్తికిసిధు లని । యసమానాంగుళు - లబ్దదళము లని
కరరుహములు రిక్కలు నూసము లని।తిర నుగురుచిమా- క్తికములచా లని

సతిచనుఁగవఁ గన-జక్కవకవ యని। మతికి హితం బగు-మాలూరము లని
లికుచము లని సిరి - లిబ్బులు గిరు లని। చకచకలాఁడెడు - జాళ్వాగిం డ్లని
పుత్తడిబంతులె- ప్రాగుత్తులె యని। మత్తేభంబుల - మదకుంభము లని
చెలియారును గని-చీమలబా అని। కలుములు గాఁచెడు-కాలోరగ మని
లావణ్యార్ణవ - లహరులు వళు లని। యావట మగుభా - గ్యావహకళ లని
పొలఁతికిఁబొక్కిలి-పొన్నకుసుమ మని। తెలిదామర యని-తీరగుగుహా యని
పరిమళరసయుత - పద్మాకర మని। తరుణినడుము లే-దని మఱి కల దని
హరిపద మని మఱి-హరిరూపం బని। యరయఁగ నాటక-మని మఱి యసదని
పరిపరివిధములఁ-బండితు లిమ్మహి। సరసిజముఖిఁ గని- సారెకు నెంతురు
శుభవతి కిరవగు-శ్రోణి యచల మని। యభిరామంబగు-నమృతపుఁబ్రోలని
బలుపులినము లని-బంగరునిధు లని-యలసగమనతొడ-లనఁటులసిరులని
కర మరు దగుకరికరములశ్రీ లని। మురిపెము గులికెడు-మోకాళ్లనుగని
సరసోరుద్యుతి - సంపద లొలుకని। బిరుదులబింకపుబిరడబిగువు లని
తరుణికి జంఘులు-తనరుశరధు లని। పరికింపఁగ సతి-ప్రపదము దులు లని
పదములు పంకజ-పదములరుచు లని-మధువ్యాసంబులమావుల్చివు రని
పరిపరివిధములఁ బడఁతిసొబగుఁ గని। నరవరు లెన్నెడునతిశయములు వ్విని
కన్నులలరఁగను- గన్నెను గంటిని। సన్నుతగుణముల - సతి కీయవనిని
సరి లే దంటిని-సరి యిదె యంటిని। తరుణులలో మే- ల్తర మిది యంటిని
తపసుల నైనను - తహతహ పెట్టుర। చపలత లెఱుఁగని - చపలారేఖర
సౌరభ మొందిన - జంత్రపుబొమ్మర। పరిమళ మొందిన - పసిఁడిసలాకర
జీవకళలు గల - చిత్రపుపతిమర। వాగ్విభవము గల - వన్నెలచిలుకర
వెన్నెలపులుగుల - విం దగుమోముర। వన్నెలకేకుల - వాఁపిరివేణిర
కోకిల యాఁకలికూఁ డగునధరి ర,। కోకము లుబ్బెడుగుబ్బలతరుణి ర
ఒయ్యారము గలయొప్పులకుప్పర। సయ్యాటములకు సరి యగుసరసి ర
వెయ్యాఱులలో వెతకిన లేదు ర। అయ్యారే! భళి! యంగనసవతు ర
ఇంతిసొబగు నే నెంత నుతింతు ర। ఎంతనుతించిన నింతికి వెల్తి ర. ౧

తనుమధ్యావృత్తము. ఈమానినియందం బీమానినిచందం
బేమానిని కైనన్ సామాన్యమె యెన్నన్.

వసుధావృత్తము. మును జేసిననా । ఘనపుణ్యమునన్
తనుమధ్యను వ । ర్ణన చేసితి నేన్. ౨౧

ఈపద్యములతో దానిశరీరసౌందర్యసంపత్ప్రదవులు వర్ణింప నాకు సిగ్గయ్యెడు. ఈపదము లీయుపమ లుపయోగించుట చర్వితచర్వణంబు సేయుట కాదే. ఇవి యన్నియుఁ బ్రాచీనకవులవలన ననుభవింపంబడి వృద్ధ వేశ్యమాతలంబలె నిస్సారము లైనవి. భాషాదేవి ముసలి యై కాన్పుడిగినకతంబున నవీనపదంబు లుద్భవించుటకు దారి లేకున్నది. వాల్మీకాదిసంస్కృతమహాకవు లేమి, నన్నయ మొదలగునాంధ్రకవు లేమి, వస్తువు లన్నియుఁ బోగుఁ గూర్చి యీవస్తువున కిదియే యుపమానం బని యిచ్ఛానుసారంబుగ గ్రంథంబు లేర్పఱచిరి. నూతనకవులను నిర్బంధోపమ యనుచెఱయందుంచిరి. నవీనపదము లాభాషలో లేవు. నవీనోపమ లాకవిసమ్మతములు గావు. ఇంక నీతరుణీమణి కన్యం బగువర్ణన నవీనంబుగా నెటుల సృజియించువాఁడను. అటు లొకవేళ కల్పింత మన్న నో దీని యంగములకు సరి పోలువస్తువు లెవ్వియుఁ జరాచరసృష్టిలోఁ బ్రపంచంబున నాకుఁ గనుపడవు. కావున నీవస్తువుల కుపమఁ గట్టి వర్ణించుట నాకు సాధ్యంబు గాదు. కాన నీచాన యీసామజయాన యీసారసనయన యీపూర్ణేందునిభాసన యంగసౌందర్యవర్ణన దాని సృజియించినబ్రహ్మయే సేయ నోపుఁ గాని మానవులకు వశంబు గాదు. ఇట్టికలికికిలయికకై గుటకలు మ్రింగుచు నెన్నిదినంబులు గాఁచి యుండ నగును. ఎన్నటికైన నొక్కదినంబు ధైర్యంబు సేయక తీరదు కదా. నాఁ డుండెడుగుండెయ నేఁడు లేదా? ధైర్యంబు సర్వకార్యసాధకంబు. కాన ధైర్యంబునఁ బోయి యామతియుతునకు సుమతికి నామతిఁ దెలిపెద. వాఁ డొడంబడనిచో నాసాహసంబుఁ జూపెద. ఇపుడె పోయివచ్చెద.

(నిష్క్రమించెను.)

---

## ద్వితీయరంగము.

జయదేవి, ప్రతాపుఁడు, సునంద, సుమతియుఁ బ్రవేశించుచున్నారు.

జయదే. సరసిజవృత్తము.

ప్రాణాధారం బౌనుతు నయ్యా! పలువిధములఁ గని, ఫలుకుచు నగుచున్,
నానాసౌఖ్యంబు ల్గని వానిన్, నరహరి నగధర నగతలములలో,

బోనోఁడం గా నోఁపుదు నే, హా! భుజగశయన! హరి! భువిఁ బ్రతు కిటులన్,
నే నెట్లోర్తుం? బాపి! విధీ! యీనిగుడువ్యసనమును నిలుపఁగఁ దగునే. ౨౨

అకటకటా? పుత్రవియోగపటుతరచింతాక్రాంత మైననాశరీరము దుర్భ
రము-దుర్భరము. అయ్యో? నాప్రాణపదక మై నాప్రాణానిల మైనాప్రాణ
మైరాణించుచిన్నెలచిన్నెలాని, వన్నెలవగలకాని, చెన్నారుసొబగులవానిఁ,
గ్రొన్నెలమోమువాని, వెన్నెలఁ బోలుదరహాసంబు వాని, నున్నతభుజము
లవాని, సన్ననినడుమువాని, నాకన్నులపండువును, నాకన్నకొమరుని, నా
మన్ననవాని, నేకటికి లక్కటికము మాని, కఠినముఁ బూని, కాననంబులో
నేచిక్కులఁ బెట్టితో? హా! పుత్రా! రాజీవదళనేత్రా! రంజితశుభగాత్రా!
సుపుత్రా ని న్నెటు నే మఱతు? నీవియోగంబు నే నెటు సైతు? ఈ
సంతతసంతాపంబు నే నెటు సహింతు? ఈశరీర మెటు భరింతు? అంత
కంతకు మితి మీఱువంత లెటు సైరింతు? నీగుణశీలంబు లెంతని నే
నెంతు? ఎంతని విలపింతు? తనయా! నీవు లేనినాబ్రతుకు మావి లేని
యుపవనంబు గాదే? ఈవి లేనిభాగ్యంబు గాదే? తావి లేనికుసుమంబు
గాదే? రేవి లేనిరాజ్యంబు గాదె? అకటా! పుత్రుఁడు లేనినాజీవనము
చంద్రుఁడు లేనిరాత్రిరీతి, సారసములు లేనిసరోవరముమాడ్కి, కలకంఠం
బులు లేనియుపవనంబుభంగి, తాలిమి లేనితపసిగతి, వర్థ్యంబు గదా.
కటకటా! నవమాసంబులు గర్భంబున భరించి, దుస్సహప్రసవవేదనలు
సహించి, పడరానియిడుమలం బడి, కని, పెంచి, యెత్తి, ముద్దిడి, కడుప్రే
మతో రేయింబవలుఁ గాఁచి, కరుణించి, యిన్నివత్సరంబులు రక్షించియు,
నిర్భాగ్యురాల నగుట నాకాళరాత్రికి నీపైఁ గరుణ లేదాయె. పాడు
నిదుర బల మాయె. తెలివి మాసి పోయె. అజ్ఞానంబు మూసికొని
పోయె. నిద్రాపిశాచం బావేశం బాయె. బలుమోస మాయె. నే నేమి
సేయుదు? అయ్యో! తనయా! బహుప్రయాసలభ్యాశనప్రాశను లగుని
ఱుపేదలకు నీవు జనింపక చక్రవర్తిని నగునాయుదరంబునం బుట్టినం
దునఁ గదా నీ కిన్నికష్టంబులు గలిగె? నే గొడ్రాలనుం గాక, తనయా!
నినుం గనినది పడరానియిడుమల నినుం బడవేయుటకా? నే గురువరుల
నారాధించినది, నే నురుఘోరోపవాసంబులు చేసినది, ని న్నీరీతిఁ బరిత
పింపఁ జేయుటకా? నిన్నీపటుతరఘోరాటవులకు బలి యిచ్చుటకా? పట్టీ!

నీ కిన్నిదినంబు లన్నం బిడినది, నిన్నీపెనుమృత్యువున కాహారంబు వెట్టుటకా? దైవమా! పుత్రులు లేనిమాతాపితరులగతి దుఃఖగతి, నరకగతి, యధోగతి. హా! కరగతకవళంబు గత మైనట్లు, ముష్టిగతభాగ్యంబు నష్ట మైనట్లు, ప్రక్కఁ బండినపసిబాలుఁడు పోయె. వాఁడు కానరాఁడు. కాన లేఁడు. మ్రుక్కడిమృగములబారికిఁ జిక్కెనందునా? వానిజాడ లేదు. ఏద్రోహి, ఏదురాచారుం. డింతటిక్రూరకర్మ మొనరించెనో తెలియ రాదు. హా! పుత్రా! నిదుర లేచి, ఘోరారులం జూచి, నీవారలం గానక, నీజననీజనకులను నీయప్పయ్యను పేరులం బెట్టి చీరి, యెంత దుఃఖించితివో, యెంత తల్లడిల్లెదవో, యెంత తపించెదవోగదా! తనయా! సుగుణసముదయా! సమస్తలోకప్రియా! వినయనయా! దుర్విజయా! విజయా! జయా! (క్రిందఁబడి మూర్ఛపోవుచున్నది.)

ప్రతా. బంధురవృత్తము.

పొలఁతులు శిశువులు నడవులకును రాఁ బోలునె? తోఁచకపోయె నహా!
చెలువులు మురువులు చిలికెడుసుతుఁ డేచేటులపా ల్వడి చిక్కెనొ? యీ
చెలివగ లెటు లని కని మనుసు నిలఁ జేయుదు నేమి? పురాకృత మా
ఫల మిది యని విధి యనుభవమునకై ఫాలతలంబున వ్రాసె నొకో? ౨౩

అలసగతివృ. తనయునివిచార మెటు తాళఁగల నయ్యో!
తనయవ్యసనంబులకు దారిఁ గన? శౌరీ!
వనిత మను టేవిధము వ్రాలె నిలపై, హా!
వనజనయనుం డిటుల వైర మెదఁ బూనెన్. ౨౪

సీ. నాపూర్వసుకృతంబు నాపూర్ణవిభవంబు నాపుత్త్రరత్నంబు నాముదంబు
నాకామితార్థంబు నాకామితఫలంబు నాసుఖాంభోరాశి నాదువాసి
నాగృహదీపంబు నాదునిక్షేపంబు నామాఱురూపంబు నాతపంబు
నావలపులఱేఁడు నాకలుములవీడు నాలీలలకుజోడు నాదుఱేఁడు

గీ. నాదుచిన్నిచిఱుఁత నాదాత నానేత నాయనుంగుజేత నాదుభ్రాత
ఈడు లేనివాఁడు లేఁ డకటా! నేఁడు, కానరాఁడు; వాఁడు కాన లేఁడు. ౨౫

హా! ఎంతటిబుద్ధిజాడ్యుఁడను నేను! కటకటా! ఆటపాటలకుం బలె కుటిలాలకలతోఁ రాజగిరిష్ఠులు నిష్ఠురఘోరాటవులకు వేఁటలకు రాఁ జెల్లునె? నా పూర్వజన్మదుష్కృతఫలం బీవేఁటరూపంబున నాపాలిటఁ బడెం గాఁబోలు! నే నేమిసేయుదు? విధి నానొసట నిట్టివ్రాఁత వ్రాసెను. అకటా! పుట్టరాని మోహంపుంబట్టి వలపులపుట్టి గారాబుపట్టి నట్టడవియందుఁ బోయినందునకు దుఃఖింతునా? కలకాలం బిలువేల్పులఁ గొలువం గలిగినయాబాలునివియోగాగ్ని చేఁ గ్రాలెడునీకలకంఠియకుంఠితవిచారంబునకు శోకింతునా? ఏకాలం బలుగక యెత్తి ముద్దిడి యాటపాటలచే బుజ్జగించి ప్రేమం బెంచినతనసోదరునిఁ గానక కన్నీరు మున్నీరుగాఁ దొరఁగు నానందననీసునందనిం గని విలపింతునా? ఆసుకుమారుని మారసమసుందరాకారుని, గుణహారుని నీతిప్రచారుని నాకులవిస్తారుని కుమారుని వియోగవిచారసాగరమెదురీఁదుదునా? ఇహపరములయం దమందానందంబు నంధించునందనుం డని పరిపూర్ణానందంబు నొంది యందరానిగర్వం బందినమందభాగ్యున కేల యట్టినందనుండు దక్కు? ఏమి సేయుదు? ననుఁ బొందినపటుతరవిచారవహ్నిజ్వాలలు భయంకరదావానలకీలలంబలె నాబుద్ధితరువుం గాల్చెడును. ఈసుదతిదుఃఖకుఠారంబు నాధైర్యతరువుల జీల్చెడు. అకటా! నాపురాకృత దుష్కృతఫలం బే ననుభవింపక వే ఱెవ్వ రాలింతురు?

సుమతి. సుగంధి— చింతసేయ నీసుతుండు చిక్కు నోటు భూవరా!
మంతనంబు గట్టిపఱచి మానవయ్య వంతలన్ ;
గంతుఁ బోలుసూనుఁ డయ్యొ! కానరాఁడు కానలోఁ;
నెంతయోగి యైనఁ బుత్రు నెట్టు మానఁగాఁ దగున్. ౨౬

మహీపాలా! యేల చింతించెదవు. విధివ్రాఁత యలంఘ్యం బని నీ వెల్లకాలములందుఁ బలుకవా? ఈశ్వరాజ్ఞఁ దప్పింప మనతరమా? విధి యే సర్వంబు. పౌరుషంబు వ్యర్థంబు. బుద్ధిబలంబు నిరర్థకంబు. ప్రతాపా! దుఃఖపడకుము. నీదుఃఖం బాజ్యధారయుంబలె నీసుదతులవిచారాగ్నిం బ్రజ్వాలింపం జేయును. హా! వైరాగ్యంబు లె న్నేనియు నవలీలగఁ బలుక నగు. మఱచెద ననినను మఱువం దగినబాలుఁడా వాఁడు? అకటా! ఏకాలంబున

నెవరికి నేనేరంబు సేసి యెఱుంగనియాచిఱుతపాపియపుడుజన్నవాని నెవరేమిసేయుదురు? ఆబాలునివగ గులుకుజిగిబిగినగుమోముఁ గనినఁ బగవాఁడయినం దనబిగువు వదలఁడా? ప్రతాపా! యీమితిమీఱుసంతాపం బేల? పట్టణంబునకుం బోదము పద. హా! హా! నట్టడవికిం బట్టిని బలి పెట్టి పట్టణంబునకుం బో నెట్టు మనసు పుట్టు!

ఉ. అక్కట! దైవ మియ్యెడ మహాకఠినత్వముఁ బూనె నయ్యయో!
యక్కఱ బాలు నేయడవియాకటిముప్పిక్కడిజంతుజాలమే
చిక్కులఁ బెట్టి వానిచిఱుచిన్నెలు వన్నెలు మాపు నొక్కొ? హా!
మక్కవపుత్రుఁ డే! వగలు మానునె? నెమ్మది గల్గునే మదిన్? ౨౭

అకటా! పుత్రవైభవంబు లేనిరాజ్యం బేల? సాంబ్రాజ్యం బేల? హారు లేల? కరు లేల? సిరు లేల? కుమారులు గదా సదా జననీజనకులముదమునకాధారులు? సంతాపాగ్ని శాంతింపం జేయునమృతాసారులు? సంచితపుణ్యఫలాకారులు?

మ. అరయ న్సంచితపూర్వజన్మవరపుణ్యాకారు లై, తండ్రికిం
బరికింప న్సుఖదాత లై, యిహమున న్పాలించుచు, న్పిమ్మటన్
దరి దారి న్దరికొన్న దారుణధునీదావాగ్నులం బాపువా
రు, రహి న్సన్నరకాటవీతరుకుఠారు, ల్పుత్రకు ల్భావరా. ౨౮

హా! హా! అట్టిపుత్రుం డున్నటు లుండి పోయెగా! శ్రీహరీ! ఈఘోరతరపరితాపపారావారంబునం గూలుటకంటెను నీచరణారవిందంబు లారాధించి మీఱీనకైవల్యంబుఁ గోరుట సరి కాదె? అకటా! మితి మీఱెడు దుఃఖంబునం బ్రస్తుతకార్యంబు నా కేమియుం దోచక యున్నది!

ప్రతా. సుమతీ! నీకడపటిపలుకులచే నాకు మితి లేనిజ్ఞానంబు గలిగె. ఈక్షితిహితం బగుమంత్రాలోచన సేయువాఁడ వని కదా సుమతి యనునామంబు నీ కొసంగితి.

చం. మతికి హితంబుగా మఱి సమంచితనీతిగ బోధ సేయుచున్,
వెత లెడఁబాపుచు, న్ఖలుల వేగమె త్రుంచుచు, భీతి మాన్పుచున్
హిత మిది యాను గా దనుచు నేర్పడఁ దెల్పుచు, నెల్లకాలమున్
క్షితిపతిప్రాణబంధు వనఁ జెల్మిఁ జెలంగెడువాఁడు మంత్రి పో. ౨౯

సుమతీ! గాఢాంధకారంబునం దగులువడి దారిం గానని వానికి మెఱపుం దీసేయుం బోలె ఘోరవ్యసనంబునం జిక్కిననాకు నీవచనంబులు బలుహితంబు లయ్యె తన్వీవృత్తము.

మానవుం డీజన్మము నిజ మనుచున్ మాననిమాయల నుడివడి యందున్
మానినిం గూడ న్మద మతిశయమై మారునిక్రీడల మన మలరారన్
సూనులం గాంచు న్సుఖ మని తలంచున్ సౌఖ్యచు నిక్కంచు సరి యెవ రంచున్
గానండు దా నై తనదుపదములన్ గైకొని వేసిననిగళము లంచున్. ౨౦

క. మృష లవి యని యెఱుంగక నరుం
డిషణత్రయములకుం జిక్కి యీర్ష్యాదిమహా
విషయేషువు లెద నాటగ
విషవిషధిని మునుంగుచుండు వెఱ్ఱియ కాండే. ౩౧

సుమతీ! విషయాదులచే శోషిలుచుం ద్రయీషణంబులకుం జిక్కి మిక్కుట మ్మగుకర్ణశనరకంబులపా ల్పడుటకంటెను త్రివిధం బగుయోగంబుచే ఖిం చుపరిపూర్ణసుఖాస్పదం బగుతపంబు మేలు గాదే! పుత్రశోకాగ్నిజ్వా లలు నిలు వెల్ల వ్యాపించి దహించుచుండ రాజ్యపరిపాలనాలోచన యనెడువేఱొకచిచ్చుం దెచ్చుకో నేల? నే నిచ్చటనే యుండి తపం బాచ రించెద

చంద్రిక. దనుజహరణబుద్బుదంబు నేం గని తిర మని నమ్మికొనన నై
తిని గద చల మన్నుం, దీవ్రవేదనలకు గుఱి యైతి ధారుణిన్. ౩౨

శ్రీహరీ సంసారసాగరమునం దు దారాపుత్రాదిసుఖబుద్బుదంబులం జూచి శాశ్వతసుఖం బందితి నని విఱ్ఱవీఁగి వెఱ్ఱి నైతిని. అవి క్షణంభగురము లని యిపుడు గదా తెలిసితి.

మాణవకము. ఆశలు సంసారముపై లేశము లేకుండుట కై
కేశవ! శ్రీశా! హరి! స ర్వేశ! నినుం గోరెద నే. ౩౩

సుమతి మానవేంద్రా! మహీపాలనయందు మనస్కరించక విరాగంబుం బూని తేని రాజ్యంబునం బాపంబులు హెచ్చు. ధర్మంబులు సచ్చు.

కం. భూపాలతిలక! జనులను
గాపాడెడువాఁడు లేక కలిప్రేరణచేఁ,
బాపమును హెచ్చ, మనుజుల
పాపములకు నీవె యగుదు పాత్రుఁడ వనఘా! 38

ప్రతాపా! భూపాలుఁడు లేనిరాజ్యంబు పాపాలయం బగు. ఆపాపంబులకుం బాత్రులు వా రయ్యెదరు పాపం బొకచో హెచ్చుచుండ నీవు దపంబు సేసిన సద్గతి యెట్లు కలుగు? శరీరం బొకచో దహించుచుండ వేఱొకచోఁ బూయుచందనపుఁబూఁత లిం పగునే? రాజ్యం బేలుటకు మఱియొక ని నియమించి లేని మన మిపువురము వనతలంబునందు మునిలీలల నుండ నగును గదా!

ప్రతా. సుమతీ! నీహితవచనంబులు నామదికి సదా సమ్మతంబులు. రాజ్యం బేలుటకు నాసుత సునందని తప్ప వే ఱెరును నాకు దిక్కు లేరు గదా? ఆసునందనిని నాలోకానందనిని నానందనం గొనిపోయి రాజ్యంబునకుం బట్టంబు గట్టి రాజధర్మంబు నిలుపుము. నీ కేల కష్టంబు? నీ విం దుండిన నీయంతటికార్యవిచారాయత్తచిత్తులు, నీయంతటిప్రజ్ఞాధికులు, నా మేలు గోరువా, రచ్చట నింకొక్కరు లేరు గదా! నీ విం దుండం జనదు. ఈసుమకోమలగాత్రిని జయదేవిని, ఈసునందనినిం, దీసికొని పోయి, పట్టణంబ్బుం జేరి, సుఖంబున నుండుము. పసిబాలునిపోకడలు విచారింపుము. సుమతీ! నావలనఁ గదా మీ రిన్నికష్టంబులు గంటిరి.

తే॥ గీ॥ కురువరునిదార్ష్ట్యమునఁ బోయెఁ గురుకులంబు,
అహికులము వ్రాయెఁ దక్షకునవగుణమున,
దశవదనుమౌర్ఖ్యమునఁ బోయె దైత్యకులము,
నాకులసుఖంబు వ్రాయెఁ గా నాకతమున. 39

సుమతీ! పాలవంటికులంబున విషంబుగతి నేఁ బుట్టి నాకులంబునకు నెల్ల నాకులంబు గలిగించితి. సుఖంబున నింట నుండినవారి నుండ నీక యరణ్యంబునకుం దెచ్చితి.

జయదే. ఉ. భూపతి చాలదా సుతునిభూరివియోగవిచారతాప? మే
లా పురి కేగు మన్చు నిటు లాడుచు నేఁచెదు? గోరిచుట్టు దా

నాపద చాలదే? మఱల, నక్కట ఱోకటిపోట దేల? నే
నీపరిచర్య సేయుచును నీకడ నుండెదఁ బ్రోవవే కృపన్. ౩౧

ప్రాణనాథా! పుత్రవియోగదుఃఖంబు మనమున ఘనమ్ముగ నేఁచుచుండఁ బతివియోగం బను వేఱొకదుఃఖసాగరంబున ననుం బడఁద్రోయఁ దలప నేల? మి మ్మెడఁబాసి నే ననుభవించుసుఖం బే మున్నది? తమకన్న నాకన్య దైవంబున్నదే? దేవరసుఖదుఃఖంబులు గావె నాసుఖదుఃఖంబులు? భగవానులకడ నుండి పరిచర్య సేయుచుందుం గాని నేఁ బోవం జాల,

ప్రతా. సీ. తలిరులఁ బోలెడుఁ దరుణి నీపదములు, కంటకకలిత మీకాననంబు,
అతికోమలతఁ బూనులత నీదు దేహంబు, వితతాతపాతప్తవిపిన మిదియు,
మెత్తనిమెత్తల మెచ్చును నీమేను, కర్కశపాషాణగహన మిదియు,
పిచ్చుక లఱచిన జిచ్చువడెదు నీవు, భీషణమృగనాదభీష్మ మిదియు.

గీ. కటకటా! యిట్టికఠినము లెటుల నీవు
సైతువని, పంప నాడితి; సతిరో! నిన్ను
విడువ నాడినకఠినునివిధము గాదు;
కలికి! మన కిట్టికష్టంబుఁ గలిగె నేడు. ౩౨

జయదేవి! సుగుణంబులదీవి నిన్ను విడనాడ నుడివిననుడువులు గావివి. ఎన్నఁడేఁ గష్టంబుఁ గన్నెఱుఁగనినీ కీవనసీమలవాసంబు వాసి యగునే యని యాడితి; అది నీమతికి హితంబు గాకున్న నిచటనే యుండుము.

సుమతి. కం. వ్యసనాగ్నిఁ గ్రాలి యుడికెదు; పసిబాల నిస్నేహ, మకట! ప్రాణం
బెల్లన్ వెస నాత్మసుతకిని నీపస గలుగనిపలుకు లిచ్చుఁ బ్రసరింపుదురే.

పుత్రవియోగదుఃఖపరీతాత్మురా లగునీకోమలగాత్రినిఁ బతివియోగాగ్నిఁ బడవేయ నేల? ఇందయుండనిమ్ము ఈసునందనిం గొని పోయి రాజ్యంబునకుఁ బట్టంబుఁ గట్టి రాష్ట్రపాలన మ్మారయుచుండెద.

సునం. కం. అనవరతముఁ గనికరమున నను బెంచినమిమ్ము వనమునన్ విడి నేఁ బో
మన మొప్పదు, జనకా! యాఘనవిభవము వలదు నాకుఁ గను ప్రేమ ననున్
తండ్రీ! గడియ మి మ్మెడబాయని నను విడనాడఁ గోరెదురే?

ఎల్లకాలంబు నాయుల్లంబు రంజిల్లం జేయుచల్లనినాతల్లిని విడచి నే నెటుల జీవింపఁగలను? పుత్రశోకాతిశయంబున నడలుమిమ్ము విడనాడి పైనము గా నామన మోఁపదు గదా? కా దన్న నాదురదృష్టఫలం బనుభవించు చుం బోయెద.

ప్రతా. కం పరమానందకరం బై। పరమామృతధారఁ బోలెఁ బఱఁగెడు, నౌరా! ముఱువగుచిఱుతలపలుకులె। యరయ న్వ్యసనములమందు లవు నవు నవని౯.

తల్లీ! సునందనీ!

సీ. బృందారకారామమందారతరుబృందగంధబంధుర మిందుఁ గలదె? తనయ! మలయజపరిమళమిళిత మై మైవ్రాలు మలయానిలం బిందుఁ గలదె? తనయ! చెలువులమైతావి కలగి కలయ వచ్చునళిరవసుఖ మిందుఁ గలదె? తనయ! సురుచిరతరుచారుతరతీరరంజితకాసారవర మిందుఁ గలదె? తనయ!

గీ. చటులమృగయూధపటహ మీయటవి,బాల!సహజభీషణ మైన దీగహన,మకట! చెన్ను మీఱెడువన్నెలచిన్నిబాల! యిన్ని యిడుమలు నీ కేల? కన్నతల్లి.! ౪౧

సునందనీ! ఇట్టిఘోరారణ్యంబులందు నీయట్టికుసుమకోమలగాత్రు లుండ నగు నే? వలను. నాహితంబులు గైకొని నను విగతవ్యసనునిఁ జేయఁ జూడవేతల్లీ. (సునందని వ్యసనంబునఁ దల వాంచి యూరక కూర్చున్నది.) అమ్మా! మణిగణఖచితమందిరంబులం దుండి సదా మోదంబు లందుని న్నీ పానమందిరంబుల నె ట్లుంతునే? చెక్కు గీటినఁ బాల్కాఱుబాలవు, బా లేందుఫాలవు, ని న్నీ వనతలమం దుంచఁగలనఁటె? తనయా! మన మందఱ మిం దుండిన మనరాజ్యపరిపాలనం బెట్లు జరుగునే? రాజ్యపాలన లేకు న్న ధర్మాధర్మపరిశీలన గలుగక జనులు కలిప్రేరణచేఁ బాపంబులు సేయ రే? ఆపాపంబులకు నేన కా భాగరి నగుదు? ఇట్టి పాపకూపంబునఁ బడనీక నను రక్షింప, బాలా! నిను బ్రతిమాలి వేఁడెద. నను జరి తార్థునిఁ జేయ నీవు తప్ప, నా కీకాలంబున వే ఱెరు దిక్కు లేరు కదా? సునందనీ! వ్యసనం బేలనే? నాహితంబు గైకొనవే! నా కీమహోపకా రంబు చేసినపుణ్యంబుం గట్టుకొనవె! నను రక్షింపవుగా! తల్లీ! సునందనీ!

జయదే. సీ. ననుఁ గన్నతల్లి నిజజనకునియానలు వినవె చాలునె నీదు విన్నఁబాటు; రాజబింబానన! రాజ్యము నేలుము పూజ్యురాలవు గమ్ము,పుష్కరాక్షి!

మందభాగ్యుల దేల కందురు, నందనీ! బంధుగోద్వాహసంబంధసుఖము?
నందిని విను రాజనందినిధర్మము పొందుగ వరునిఁ దాఁ బొంద నగును,

గీ. పతియె దైవ మిలను; పతికన్న దైవంబు సతికి లే దఁటంచు మతిని నమ్మి,
పతిహితంబు లెఱిఁగి పతిపూజ సల్పుచు, నతివ! యుండఁ గలుగు నతిసుఖంబు.

సునందనీ! ఏలనే కన్నీరు గార్చెదవు? అనుభావ్య మెల్ల ననుభవింపక త ప్పునటే? విధివ్రాఁత యలంఘ్యముకదా! తల్లీ! చింతిల్లకుము. సునంద నీ? నీవు వయోవంతురాలవు. నీవివాహోత్సవంబు కన్నులారం జూచి ముదమందునోము నోవ మైతిమి. కూఁతురా! రాజసుతకు స్వయంవర ధర్మంబు గలదు. కులశీలరూపంబులం బెం పెక్కినరాజకుమారుని వరించి యాపతియే యాపదుద్ధారకుఁ డగుశ్రీపతి యని హితమతిని బూజించి పతివ్రతాశిరోమణి యని ప్రసిద్ధిఁ బొందవే. సుగుణమణీ! ఏల చింతించె దవే? తనయా! నీ వీరీతిఁ జింతిల్లిన నీతండ్రిగారిధైర్యంబు భేదిల్లదఁటే?

సునం. తల్లీ! జననీజనకులవచనంబుల ధిక్కరించుట తగ దనుకొన్నను మిమ్మెడవాసి పోఁ గా ళ్లాడవే? ఏమి సేయుదునే? కటకటా! ద్రోహం బెన్నఁ డేని మనం బునం దలఁచి యెఱుంగనివారికా యీ పాటులు పాటిల్లుట? తల్లీ! శిరీష కుసుమంబుకంటెను మెత్తగ నున్ననామనంబు కఠినపాషాణంబుఁ జేసికొని నేఁ బోయివచ్చెద. నాకన్నీరు మీ కపరిమితదుఃఖవారధి యగును. నావ్య సన నీరధిలో నీఁక నేనే మునింగెద. తల్లీ! పోయి వచ్చెద.

ప్రతా. తనయా! ఇపుడు గదా నామనంబునఁకించుక యూఱట కలిగె. సుమతీ!

సీ. రాజీవదళనేత్ర రంజితశుభగాత్రి రమణీయచారిత్ర రాజపుత్రిఁ
గొనిపోయి నీపట్టి యని యెంచి యీసునందనికిఁ బట్టముఁ గట్టి ధరణి నేలు;
మానిని మర్యాద మాననిధరణీశుసూనున కిచ్చి వే శుభముఁ బెంచు,
సోదరుచింత కృశోదరిమన మంటె నాదరమున దాని ననునయించు;

గీ. దేశకాలంబు గని పెట్టి దేశజనులఁ గాఁచి కరుణించి ధర్మంబుఁ బ్రోచి నాదు
బాల్యసఖ్యంబు మఱవక భావమందు నేనె నీ వని రాజ్యంబు నేలు సుమతి.

సుమతీ! ఈపుత్రిని వరచారిత్రను నీపుత్రింగా నెంచి దానిదుఃఖోపశమనం బు చేసి తగినరాజపుత్రున కిచ్చి పరిణయంబుఁ గావించి ధర్మంబు తొలఁగ కుండ రాజ్యంబు నేలుము. నాబాల్యస్నేహంబు మఱవకుము.

సుమతి. ఉ. పుట్టిననాఁటనుండియును భూవర నీదగుపోష్య మంది, యీ
పట్టునఁ బుత్రశోక మనుపట్టఁగ రానిమహార్ణవార్థిలో
నిట్టటు లేఁడి గట్టు గన కీగతి మగ్నుఁడ వైనవేళ, నీ
పట్టికిఁ గట్టనా ధరకుఁ బట్టము ? సందియ మొంద నేటికిఁ ? ४४

భూపాలా! ఏల నీసేవకుని యెడ నిట్టియుపచారవాక్యంబులు పలికెదవు? చిన్ననాటనుండి యిన్నిదినంబులు నీయనుగ్రహంబు వడసి, నీ శోకసమయంబు తప్పినచో నాభావంబు వే ఱగు నని తలఁచితివా ? అట్టితలంపు నాకుఁ బుట్ట నగునా ? మనంబునం దైనం దగులునా ? కలలో నైనం గలుగునా ? ఏల సందియంబు ? నీనందనికిం బట్టంబు గట్టి రాజ్యం బేలింతు. నీతనయ వ్యసనం బపనయింతు. నీసుతునిపోకడ నే విచారింతు. ఇన్నియుఁ జేయ నోఁపుదును గాని నీవియోగజన్యవ్యసనం బే నోర్వఁ జాల. ఏమి సేయుదు!

ప్రతా. సుమతీ! మతిమంతుఁడ వగుసీ కీవ్యసనం బేల ? ఋణానుబంధం బున్న నీవియోగం బెన్నిదినంబు లుండు ? చింత వలదు. (అనుచుఁ దనయను గౌఁగిలించుకొని వ్యసనము నభినయించుచున్నాఁడు.)

సుమ. రాజేంద్ర! శోక తప్పదుగద ? పట్టీ! సునందనీ! మన ముండువఱకు నీదంపతులవ్యసనవార్ధి యిట్లుప్పొంగుచునే యుండును. మనము చని వీరియారటమునకుఁ గొంతయూరట గలిగింతము రమ్ము (అని సునందనితో వెళ్లుచున్నాఁడు.)

---

ప్రథమాంకము.

తృతీయరంగము.

సుమతి ము. అకలంకం బగునాత్మబుద్ధి యసిశం బత్యూర్జితస్ఫూర్తిచే
సకలార్థాధికసాధనంబులకుఁ దా సాహాయ్య మై యుండఁగా,
వెకలు ల్లోకములోనఁ గార్యఫలము ల్వేగంబ యర్పింతు రి
ట్లకటా! కర్మకు దేహబల్మికిని, నీయన్యాయము న్గంటిరే ? ४५

ఆహా! బుద్ధి కదా బలిమి! బుద్ధి కదా విధి! బుద్ధిహీనునకు దేహబలం బున్న నేమి? దైవబలం బున్న నేమి? సకలార్థసాధనసంపత్తి కీధా-

రణే బుద్ధియే కారణంబు. ప్రతాపునివంటి వేదవిదులు కొందఱు కార్యఫలంబులు కర్మజనితంబు లని పదరుదురు. ఉగ్రసేనునివంటిమఱికొందఱు వికలులు గార్యఫలంబు దేహబలజనితం బని కండకావరమునఁ గూయుదురు. వారిబుద్ధికి నే నేమందు? నాబుద్ధిబలిమిని గదా నే నింతటికార్యం బొనరించితి? సకలకార్యసాధనంబునకు బుద్ధింబలె నిఖిలకార్యార్థభంగమునకు విమోహం బట్టిదియే కదా? అందుఁ బ్రకామకామినీమోహినీమోహంబుం జెప్ప నలవి యగునే? అట్టివిమోహంబునం బడి నీటిసుడిం బడినచిత్తం బోలె నుండెడుం గదా యుగ్రసేనుండు? భళిభళిరే! మోహినీపిశాచమా! మరునివశ మై మానవమానసంబుల నీ వెన్నిమాఱు లురులం దవిలించెదవు!

చం. మరుఁ డనుధీవరుండు, మఱుమాయగఁ బూసుమకర్మనీరధిం
బరగినమానసం బనెడుబారువమీనముఁ బట్టి చూచి, తాఁ
దరుణులవీక్షణాంచలముఁ దప్పనిగాలము సేసి, హాస మ
న్సుమచిరభోజనంబు నిడ సౌఖ్యముఁ జిక్కెడు మోహ మెక్కుడై. ౨౬

అహహా! ఆయుగ్రసేనుండు మోహినీగ్రహపీడితుం డని నాబుద్ధిబలిమిని గదా తెలిసితి! నామమతలతనయ వానిపాలిటిపిశాచావేశమంత్రం బాయె గా! ఆప్రతాపునకుఁ గలియుగకలువాయివేదాంతంబులం గఱపి కాననసీమలఁ గాకాకులు మెసవునటులఁ జేసినది నాబుద్ధిబలిమి కాదే! ఖేదాంతంబు లగువేదాంతంబులు వంచకులవ్యవహారంబులకు సైతము సహాయము లై యుండుం జుమీ! ఈకలికాలంబున నేమి చెప్పను!

కం. సంతతసంతాపాగ్నిని। సంతోషాశ్రువులఁ జల్లి చల్లగఁ జేయున్,
వింత, లహో! కలియుగవేదాంతము లజ్ఞులకు నైన నవనిని జూడన్. ౨౭

సమ్మోదనిశాంతంబు లగువేదాంతంబులం జేసి కదా నామోనములు వాసిగ ఫలించెను! అటు లాడెద నేల? అవనికై కాదె నే నిన్నిపనులు సేయుట? రాజ్యం బార్జించుటకై యెందఱుమహానుభావు లెన్నిమాయోపాయములు సమ్మత మని సేయరైరి?

సీ. అవనికై యనృతంబు లాడి నాడుచు ద్రోణు ననిఁ జంపె ధర్మరాజంతవాఁడు,
అవనికై బలిఁ జేరి యాహవంబున వేఁడి హరియించె సిరి హరియంతవాఁడు,

అవనికై భృగురాముని నడిగి దానముఁ గొని యటు ద్రోహత కశ్యపునంతవాఁడు, అవనికై యాజిలో నటు డాఁగి వాలిని హతుఁ జేసె శ్రీరామునంతవాఁడు,

గీ. ధర్మపారులు ధీరులు దానపరులు సత్యసంధానువర్తులు నిత్యకీర్తు లట్టివారలు దోసము లనక చేసి రిట్టిమోసము లవనికై దిట్ట లగుచు. ౪౭

అట్టిమహానుభావు లవనికై యిట్టిమోసంబులు దోసంబు లనక చేసి రని పురాణంబులు ఘోషించుచుండ నాకార్యం బెటు దోషం బగు? ఇంత ట్టికి నో పెనుగదా నాబుద్ధి! నాదాసానుదాసుం డగునుగ్రసేనుని కుప దేశం బిచ్చి యాకసుకందనిపసిబాలునియసువులు వెస నాఅం జేసినది నాబుద్ధిబలిమి కాదే! భళీ! ఇప్పటిజను లెంతటివెకలులు! శాస్త్రంబులో నివి యని రెండుశ్లోకంబులు చిలుకపలుకులుగా నుడివినమాత్ర నట్టివాని బృహస్పతియే యనియు, వానినోట వెడలుమాట లన్నియు వేదవా క్యంబు లనియు నమ్ముదురు హా! జ్యోతిష్కు లఁట! కాలజ్ఞు లఁట! జను లయాయుఃపరిమాణంబు నిక్కంబుగ వక్కాణింతు రఁట! ఇట్టివి వినుట మూర్ఖత కాదే? ఆరాచకోమరుండు పూర్ణాయు వని కదా లెక్కలేని కాలజ్ఞులు వెవ్వేఅ లెక్కలు వేసి యేకవాక్యతగ వక్కాణించిరి? జనుల ఫాలపట్టికయందు బ్రహ్మ వ్రాసినయక్కరంబులు దుడిచివేయం గలనాకు శాగ్రబుద్ధి నిరాటంకంబుగఁ బ్రజ్వలించుచుండం గానువీసంబులకుంగాఁ గల్లకార్యఫలంబులు వలుకు జ్యోతిష్కులవాక్కులా నిక్కవం బగు? ఇట్టి వారిమాటలు నమ్ముటచే జనులు తమయజ్ఞానంబుఁ వెల్లడిపఱుచుకొను టయ కాదే?

గీ. త్రిజగతీసృష్టి యొనరించునజుఁడు జనుల
ఫాలపట్టిక వ్రాసినపలుకు కల్ల
సేయఁ జాలినశేముషీశ్రేయ లుండ
జ్యోతిషముపల్కులా భువి ఖ్యాతిఁ గనుట! ౪౮

ఇవి యన్నియు నటు లుండ నిమ్ము, కార్యాలోచన సేయవలయు. కొన్ని దినంబులకు నైనను మన మాసునందనికిఁ బట్టంబు గట్టవలయుం గదా? కట్టినం దప్పేమి? నేనుగదా రాజ్యంబునకుఁ గర్త నై యుండెడ? ఆ! కాదు, కాదు. ఎంతటికార్యకర నై నను రాజసేవకుఁ డనునామంబు నాకుఁ దప్ప

దు కాదే? ఆనీచశబ్దంబుం దొలఁగించుకొనుటకుఁ గదా నే నిన్నికడగండ్లు పడుట? ఆసుందరి సునందని ననుం బరిణయం బైన నే ధన్యుండ నౌదుం గదా! ఆవిన్నాణపుఁగన్నె నన్నేల వరించు? జవ్వనులు యౌవనపురుషులను గదా వరింతురు? నాకా ముదిమి మెండాయె. ముదములు దొలఁగి పోయె. ముచ్చట లడఁగి పోయె. ముఖసౌందర్యము మాసి పోయె. చెవులా మూసికొని పోయె. దేహమా కృశ మాయె. కన్నులా సన్నగిల్లె. ఇట్టి జరాభారంబుచేఁ గ్రాలున న్నేల యామించుఁబోడి వరించెడిని?

సీ. ఉదితవయోమదముదితలు మనమున బోయుదు రెయ్యది బోత యనుచు?
ప్రాయంపుదాంపత్యభావంబులను జూచుభావజునకు నెద్ది భయము చూడ?
అఘటనఘటనాప్రయత్నాంబురాశికి బాడబం బెయ్యది వసుధఁ జూడ?
విషమాస్త్రసురుచిరవిషయానుభవులకు నెయ్యది విషమ మై యేఁచుచుండు?

గీ. మురిపెములకును ముసుఁగిడుముదిమి యదియె,
ముచ్చటల కెల్ల నెల్ల యాముదిమి యదియె,
ముఱికిముసలి యనిపించుముదిమి యదియె;
ముదము మూఁడనిముచ్చిచ్చు ముదిమి యదియె, ౫౦

ఇట్టివృద్ధులముదిమి బలసిననన్ను యువతులు వరింతురా? ఏల యీవట్టి భ్రాంతులు? వలదువలదు. ఆసునందని నాకుఁ గోడ లయినను రాజ్యంబు నాదియ యవుం గాదే? నాసుతకు నొకరాజసుతుండు పతి యయ్యెనేని నే నెంతధన్యుండ నయ్యెదనో! ఆదియం దీరాజ్యం బొకటి నాకు దక్కనిమ్ము పిమ్మటఁ జూచికొనియెద ఆసునందని నా సుతునిఁ గుబేరుని వరించు నెటులు? వాఁడు చదువరియే, నిజము. సుందరుఁడే, వాస్తవము. స్త్రీలమనంబులకు నీగుణంబు లెక్కనా? ఎక్కువ చాకచక్యంబు లేనిచదు వేల? సౌందర్యం బేల? కుబేరుఁడు శుద్ధమూర్ఖుఁడు అత్యాతురుఁడు. కార్యసాధనోపాయంబు కలలో నయినఁ దలంపఁడు. మాటలా మెండు. ఇట్టివాని సునందని వరించునా? వరింపకున్న రాజ్యంబు నా కెటు ల దక్కంగలదు? (కొంతసేపు మీదుచూచి) ఇసీ! ఈయాలోచన సరి కాదు. ప్రతాపునివంశంబు నష్టం బయిన జ్ఞాతులు చెలరేఁగి రాజ్యంబుపై దండెత్తి వచ్చెదరు. ఇపుడే యాయోచన తగదు. ఎటు లయినను సునంద

నిని నాకోడలిం జేసికొనుటయే కర్తవ్యము. అందునకు నుపాయము నాకొమారుని సకలకళాకోవిదునిఁ జేయుట తక్క వేఱొక్కండు దోచదు. కఠినపాషాణం బగ్నిచే దహింపంబడి సుత్తెలచే మొత్తంబడి యులులచే నుదుటు చెక్కించుకొని యొకమందసాకారంబుఁ బొందుచుండ నాసుతుండు శిక్షచే నిఖిలకళాప్రవీణుఁ డవుటకేమి సందియంబు? వానికి నేనే యుపదేశకర్త నయ్యెద. ఆ! యేమిది! ఈయోచనలలోఁ బడి కాలంబుం దెలియనైతిని. చేయఁ దగినకార్యంబులు చాలగ నున్నవి పోవలవదే? (వెళ్లి పోవుచున్నాఁడు.)

---

ప్ర థ మా ం క ము.

తృతీయరంగము. రాజమందిరము.

సునందని, స్వగతముగా.

అకటకటా! నాతలిదండ్రులు కడుబడలుచుఁ గొడుకునకై యేడవిం గడగండ్లు వడుచుండ నేఁ బుడమి నేలిన నేమి? యడవిఁ గూలిననేమి? సుఖం బెందును లేదు. అటు లయిన నడవిం జేరుద మన్ననో యలంఘ్య మగుమజ్జనకవాక్యోల్లంఘనంబు సేసినదాన నగుదు. యనుంగుసోదరునకై కదా నా కింతదుఃఖంబు? వానినగుమోముఁ జూచుభాగ్యం బెట్లు కలుగు?

ఉ. తమ్ములదిమ్ముఁ జిమ్ముకనుదమ్ములు శ్రీనవభాగ్యకర్ణముల్,
ఇమ్మగువిండ్ల నమ్మఁ గలమెమ్మెలవాల్కనుబొమ్మ, లయ్యరే!
రమ్మిటు కందు నీమొగము, రాజ! యటం చనుమోముమచ్చు టే
నెమ్మెయిఁ జూచుదాన నిఁక నేమి యుపాయము చిన్నితమ్ముఁడా! ౫౧

ఇట్టిముద్దులసోదరునియందపుమోముఁ జూచు టెన్నఁడో దైవమా!
(ప్ర. సుమతి.)

సుమ. కం. నందిని! సునందనీ! నీయందపుమోమే మేల వాడినది నేఁ? డకటా!
సుందరి! వల దిఁకఁ దెల్పవె; కందమ్ములజలము లేల కాఱెడుఁ గలికీ? ౫౨

సునందనీ! చిఱునగవులతోఁ జెన్నారుసీముఖవిలాసంబు వాడి వన్నె తఱిగె, నది యేల నే? కనుదమ్ము లేల నే వనరాశి న్మునింగినవి?

సునం. సీ. దశదిశాయతతమోదశను బాపెడుభూరిచంద్రిక ల్గాయవే శరధరములఁ?
చవచావకీలలఁ దరికొనుతరు లెటు చిగురుటాకులు పూని జిగిఁ జెలంగు?
రాహువుచేఁ జిక్కి రహిఁ గను టెటులయో రాకానిశాకరురాజ్యలక్ష్మి?
ఉరుభీకరాతతగురుతక్షకవిషంబు పర్విన నిలుచునే ప్రాణ? మకట!

గీ. మన్ననల ముద్దుతమ్ముని మమతఁ బ్రోచి కాననం బనుభూరిరాకాసి కిచ్చి
తల్లిదండ్రులు తప్తులై తల్లడిల్ల సంతసము గల్గునే నాకు సచివవర్య. ౫౩

సుమతీ! కరుణాలవాలు రయిననాతలిదండ్రులు కిన్నకొడుకును గానక కాననంబునఁ గనరానికాఱియలం బడి చింతిలుచుండు రనువంత నాశరీరంబుం దహించుచుండ నాకెటు సంతసంబు గలుగు?

సుమతి. చం. వల దిఁక మాను వంత యణువంతయు, నోయణుమధ్య! యేలనే
చెలఁగి చెలీ! సఖీజనులచెల్మి నమానవికాసమాన నై
కలయవె ముద్దుసోదరునిఁ గన్గొనఁ జారులఁ బంపినాఁడె నే
నెలమి ననుంగుఁదమ్ముకయి యేటికె నీకు విచార మారయఁగా. ౫౪

తనయా? జయపాలునిపోకడలు విచారించుమవంబు నీకింతె నా కధికంబుగా నున్నది. బాలునిసమాచారంబు విచారింప వేఁగరుల ననేకులను మనయుగ్రసేనుండు నేఁడే పసిచెను ఆబాలునికిఁ బ్రాణభయంబు లేదు. చిరాయు వని మనయాచార్యులు పలికినపలుకులు వ్యర్థ మగునా? ఆభరణాపహరణమునకై చోరులు వానిఁ గొనిపోయి యుందురు. కన్యకామణీ! గొంతకాలంబువట్టి నీ వేల సుఖంబులు మాని సఖీజనులచెలిమిఁ బూనక వంతలచేఁ గుందుచుండెదవు? వలదు మాననీ విచారంబు మానుము.

సునం. సుమతీ! నీయట్టికార్యవిచారభారకు లుండిన నేకార్యంబున కేకొఱంతయు నెట్లు కలుగు? సోదరువియోగవ్యసనంబు మనం బగలించుచున్నది కాని వే ఱొకదుఃఖంబు నేఁ గని యెఱుంగను. ఇపుడు నీ వాడినహితవచనంబులు నామనంబునఁ గొంతసంతసంబుఁ గలిగించె. సుమతీ! నాచెలికత్తె లగుజయమాలికలకంతులం గూడి యిఁకఁబ్రొద్దుఁ బుచ్చుకొనియెద. పోయి వచ్చెద. (చెఱియొకప్రక్కగ వెల్లిపోవుచున్నారు.)

# ప్రథమాంకము.

## చతుర్థరంగము-మంత్రిమందిరము.

సుమతి. (స్వగతముగ.)

ఉ. ఎంతటి శేముషీయుతుఁడ! నెంతటిదూరవిచారకారి! నే
నెంతటికార్యసాధకుఁడ! నెంతటిసాహసికుండ! నద్దిరా!
వంతలఁ గుందునీసుదతి వ్యాకులము న్విడనాడఁ జేసితిన్
జింత మ ఱొక్కటే మనముఁ జిందరవందర సేయు నియ్యెడన్. ౫౪

బాలునిశుభోదంతంబులు గొన్ని పలికి యాసునందనిడెందంబున కానందంబుఁ గల్పించితి. బుద్ధిబలమునకు నెద్ది యసాధ్యంబు? ఇఁకఁ జేయందగినకార్యంబు లనేకంబు లున్నవి నాతనయ జయమాలి యతిబుద్ధిశాలి నాకుమారుం డగుకుబేరుని మారుని నధఃకరించురూపసి యనియు, కుమారునిఁ బోలుధీరుం డనియు, సురగురునకుం బ్రతి యగుచదువరి యనియు, నాసునందని యొద్ద, నెడతెగక పొగడుచుండెడులాగు నాతనయకుఁ గఱపితి. నాసుత నేఁ గఱపినంతకంటె నధికంబుగఁ గొనియాడి సునందనిమనం బాకుబేరునియందు లీన మగులాగు సేయక మానదు. అటు లయిన నేఁ దలంచినకార్యం బంతయు సమకూఱును. ఉగ్రసేనునివిచారం బిపు డేల? ఇఁకఁ గొన్నిదినంబు లిటులే యుండనిమ్ము. (ఆలోచించి) నాబుద్ధి నను బొందియుండ, నాబొందిలోఁ బ్రాణంబు లుండ, నా కెద్ది యసాధ్యంబు? బుద్ధికి నసాధ్యం బొకండు గలుగునే?

సీ. అవివేకతిమిరాపహారి యామార్తాండబోధ యీభువిలోన బుద్ధి సూవె;
బహుపాతకవ్రాతవాతోపహారైకభుజగి యీభువిలోన బుద్ధి సూవె;
మదవిభ్రమాబ్ధినిర్మగ్నులౌజనులకు భూరిపోతము భువి బుద్ధి సూవె;
కార్యవిఘ్నం బనుకరికి నంకుశ మగు భువిలోన జనులకు బుద్ధి సూవె,
తే. గీ. భువి నకారణబంధువు బుద్ధిసూవె, భూరితోషణసింధువు బుద్ధి సూవె,
పూఁత వెట్టనిఫల మది బుద్ధి సూవె; పురుషభూషణరత్నంబు బుద్ధి సూవె.

ఇట్టిబుద్ధి మనోహరాకృతిఁ బూని నను సేవించుచుండ నీరాజ్యంబ యేల? సమస్తజగంబుల సాధించెద. మంచిది కుబేరుఁ డేల రాక తడసెను? వాఁ

షు కడుముమూర్ఖుఁడు. వయోవంతుఁ డైనను వనజాక్షులవదనంబుఁ దేఱి చూడ వెఱచును. ప్రస్తుతపుఁగార్యంబున కట్టివిరాగములు పనికి రావు కదా! వానికిఁ జాకచక్యంబు గఱపి విషయాధీనమనస్కునిఁ జేసెద. అటు కానిచో నాకార్యంబు వ్యర్థ మగు వ్యర్థమా? ఏమి! సుమతికా ర్యాలోచన వ్యర్థం బగు ననుట కలలోనివార్త. ఈప్రయత్నంబునకుఁ గొఱంత కలిగె నేని వేఱొకయత్నంబు లేదా? అట్టిక్రూరకృత్యంబులకు నుగ్రసేనుండు చేదోడు వాదోడుగా లేఁడా! నాతలఁచినకార్యంబు ఫలించునంతవఱకు జయమాలివీక్షణమాలలు వానికిఁ గంఠహారములుగా నుండుం గద? దానిదరహాసచంద్రికలు వానిమనఃకుముదవికసనమ్ముం గావించుచుండును. (ప్రవేశము- కుబేరుఁడు.)

కుబే. నాన్నగారూ! నన్నేల పిలిపించితిరి?

సుమ. కుబేరా! ఏమి సేయుచుంటివి?

కుబే. ఊఱక కూర్చుండి యుంటిని.

సుమ. అది యొకపని యఁటరా?

కుబే. అందునకు సందేహ మేమి?

సుమ. కుబేరా! అది పని కాదు. తనయా! నీవు వయోవంతుండ వయ్యు రాజ్యతంత్రములు నేర్చుటయం దేమి, రాజబింబాననలతో సరససల్లాపం బు లాడుటయం దేమి, ప్రొద్దు పుచ్చక, యూఱక ప్రమోఘువడినతఱుమూ లంబుభంగి నుండుట నగుఁబాటు కాదఁటోయీ.

కుబే. నా కేల రాజ్యతంత్రవిధులు?

సుమ కుబేరా! అన్నియుం దెలిసి యుండవలయు. ఒకవేళ నీవే రాజ వైన నేమి సేయుదువు?

కుబే. తండ్రీ! ననుఁ జంపుపగవాని కైనను రాజత్వంబు నేఁ గోరను

సుమ. కుబేరా! అటు లేల పలికెదవు? రాజవు నీ వయిన రాజ్యము నీ దవును, రాష్ట్రములోనిజనులు నీసేవకు లయ్యెదరు. ఎడతెగక నీయిరుదెసల నినుఁ గాచి యుండురు. నీహితునకుఁ బదవి నియ్యను, నీయహితునకు బదవిఁ దియ్యను, నీవు స్వతంత్రుండ వయ్యెదవు. ఎంత యుండిన రాజసేవకుఁ డనునీచశబ్దంబు నీయం దన్వయింపక పోవును.

కుబే. ఉ. రాజితశత్రురాజు లెటు రాజ్యము గొందరో యన్న గోజుచుఁ,
రాజులు, ధారణీజనులరట్టిడి ఘోషము లెల్లకాలముం
రాఁ, జెవి యొగ్గి వాని విని రాష్ట్రపుఁబాపగణంబుఁ గైకొనన్
భాజను లైనవారు, స్థిరభాగ్యము భోగము వారి కెట్లగున్? ౫౮

తండ్రీ! ఎంత యుండినను రాజులకు మది నెమ్మదియు, రాత్రులఁ గంటికి నిదురయు, లేదు కదా? పరరాజభీతు లై పరులపాపంబులందు భాగరు లగునవ్వారికి సుఖం బెటులు గలుగు?

సుమ. కుబేరా! అవి గ్రంథంబులలోనినీతులు. పిచ్చివారివ్రాతలు దుర్బలుల కూఁతలు. వాని ననుసరించిన రాజొకదినం బయినను బ్రతుకుట దుర్లభం బగు లోకులకష్టార్జితద్రవ్యంబు లేనెపంబున నైనను గొని తా నను భవింపఁ జూచుచుండెడువుడమిఱేఁడు కొన్నిదినంబు లయినను రాజ్యం బేలును. కుబేరా! మఱియొకటి విను. నీవు వయోవంతుఁడ వే! వివాహంబు వలదా?

కుబే. నా కది యొకకాలిసంకిలియ కాదే? వివాహంబు నాపగవాని కైన నేఁ గోరను. సుదతులు యమదూత లని నాహితు లనేకులు నాకుఁ దెలిపిరి.

తే. గీ. చెలువ గలిగిన మఱి వేఱుచిలువ వలదు.
ఆలు గలిగిన మఱి వేఱుతేలు వలదు.
నారి గలిగిన మఱి వేఱుమారి వలదు.
నాతి గలిగిన మఱి వేఱుకోఁతి వలదు. ౫౯

తండ్రి! వివాహంబు గావించి నా కిట్టికాఱియలు మేళవించుకోరికెలు నీ కేల కలిగె?

సుమ. కుబేరా! నీ వెంతపిచ్చివాఁడవు. స్త్రీలసహజగుణంబు లని కుజాతితరుణు లదుర్గుణంబులు నీ కెవరో బోధించి యుందురు.

సీ. అతివ గదా భువి నతిసుఖములరేవ, కష్టాంబునిధిఁ దేర్చుగట్టినావ?
అతివ గదా పతి కతిహితములతేవ, జీవ్రోపహతులసంజీవతీవ?
అతివ గదా పతి కావట మగుత్రోవ, నాథులపుణ్యరత్నములకోవ?
అతివ గదా పతిగతులకు నెఱత్రోవ, ధవుధైర్యతరునిబంధనపుఁజేవ?

తే. గీ. అతివ గలిగిన మఱి వేఱుహితు లదేల?
నాతి గలిగిన మఱి వేఱుఖ్యాతి యేల?
ఇంతి గలిగిన మఱి వేఱుచింత లేల?
సతులు గలిగిన మఱి పరగతు లవేల? ౫౯

కుబేరా! నిశ్చయించి చూడ సతులు గదా పతులపుణ్యగతుల కనుకూలవతులు. హితాచారనీతులు. వంశైకపునీతలు. ఇట్టిమాననీయ లగు మానినుల నవమానపుఁబలుకులు పలుకఁ దగునా? కుబేరా! సతులు లేని యెడ సుతులు కలుగరు కదా? సుతులు లేనియెడఁ బితరులకుఁ బరలోకగతులు లేవు కదా? తండ్రీ!

తే. గీ. యుక్తవయసునఁ బెండ్లాడి యువతిఁ గూడి
పరగ గృహధర్మములు సూచుపతికి, ముక్తి,
కొంగుఁ గట్టినబంగారు, రంగుమీఱు
ముంగిటినిధాన మౌ, నౌర! ముదముగాను. ౬౦

కుబేరా! పరిణయసుఖం బింతంత యనియు నిట్టి దట్టి దనియు వివరింప నాతరమా? తండ్రీ! నీనుండి కదా నావంశవృక్షంబున శాఖ లేర్పడవలెను? కావున వివాహం బాడి నను విచారదూరునిఁ జేయు దని నే నిను నమ్మినాఁడను.

కుబే. తండ్రీ! నే వివాహం బాడక యుండునది నీ కొకవిచారంబుగా నుండెనేని నీయిష్టానుసారంబు చేసెద.

సుమ. ఇది కదా సుపుత్రలక్షణంబు. కుబేరా! నా కిపుడు వేఱొకయోచన మనం బంటెను కదా! ఏమి సేయుదు?

కుబే. తండ్రీ! అది యేమి?

సుమ. మనకులంబున నీకుం దగినవయోరూపాతిశయసుందరీమణులు లేరు కాదే!

కుబే. తండ్రీ! పరిణయం బయిన మనసునందనిం బోలుసౌందర్యవతినిఁ బెండ్లి సేసికొనవలయు.

సుమ. (తనలో) వీనికిని సునందనీసౌందర్యంబ మనం బంటినది. (ప్రచురముగా) తండ్రీ! సునందనిం బోలుసుందరీ మణులు వసుంధరయందు లేరుగా! అది యెంతటిసుందరియఁటరా?

కుబే. ఏమితండ్రీ! ఆసునందనిసౌందర్యంబుఁ దెలియనివాఁడవుంబలె నటించె దవు? జగన్మోహిని యని కదా దానిం జనులు కొనియాడెదరు? ఆమా టకు సందియం బేమి?

కేదారగౌళ రాగము చాపు తాళము.

ఎన్నఁ దరమె యాయన్నులమిన్నను-చిన్నెలు గలయావన్నెలకన్నెను ॥ పల్లవి
రాజబింబము బింబరాజము నగు నౌర!-రాజితముఖరివి రంజిల్లుకెమ్మోవి॥౧
మదమృగమును మృగమదమును నగు నౌర!-మదవతికనురీవి మంజులతనుతావి॥
గంధనాగము నాగగంధము నగు నౌర!-మందయానముతీరు సుందరినూగారు॥3

క అమ్ములఁ దమ్ముల రాజీ। వమ్ములఁ గ్రొమ్మెఱుఁగుపసల వమ్మను నౌరా!
యమ్మెలఁతతరళతగనయ। నమ్ములు పేఁలావిలాసనమ్ములు చూడఁగ. ౬౧

తండ్రీ! ఇట్టిది కదా దానియందంబు?

సుమ. అటు లయిన సునందనిఁ బోలువా రీయవనిం గలుగుట దుర్లభంబు. ఏమి సేయవలయు?

కుబే. తండ్రీ! అది నిజము. ఏమి సేయవలయును?

సుమ. కుబేరా! సునందనిం బోలువారు ప్రపంచంబున లేరు కావున సునందని నే పెండ్లియాడుట మే లని నాకుం దోఁచెడు

కుబే. నాన్నగారూ! నన్ను బరిహసించెదరా? సునందని యెక్కడ? నే నెక్కడ? హస్తి మశకాంతరంబు గాదే? సునందని రాజకూఁతురు, నే నామె సేవకుఁడను.

సుమ. కుబేరా! నీవు సకలసాహిత్యగ్రంథంబులుం జదివితివి కాని యందుల తత్వం బెఱుంగ వైతివి. ప్రపంచానుభవం బా బొత్తిగా లే దాయె. బాలకా! స్త్రీలు వలచినవాఁడె వరుఁడు. అందులో. సునందని రాజు కూఁతురు కావనే స్వయంవరధర్మంబు కూడఁ గలదు

కుబే. అట్టిస్వయంవరమ్మున నామె నన్నె వరించు ననుట యేమి సిద్ధాంతంబు?

సుమ. అది సిద్ధాంతము సేయునది నీసాహసము స్వయవరంబునకు దానిం బో నీక స్వయంవరుఁడవు గమ్ము.

కుబే. అ దెటులు సాధ్యం బగు?

సుమ. ఎటు లయినది నీవే యూహించికొనవలెను. వివరములు న న్నడిగెద వేల?

కుబే. తండ్రీ! నను మీఱిన దీయూహ. నా కసాధ్యం బని యే తోఁచెడిని.

సుమ కుబేరా! ఏదియుఁ బ్రపంచంబున నూహకు మీఱదు. అల్పానుభవంబున నీ కన్నియుం దెలియును. అదిని నీయాతురంబునకు స్మితి కల్పింపుము. పిమ్మట నతిహితం బగుచతురమతితో సేవింపుము. తోడన నాసునందనిం జేరి నయవినయంబులు నెఱపి. సమయానుసారం బగుహితవులు గఱపి, యితురునిపై నుండుమమతలు చెఱిపి, కాలక్రమంబున నీమతి దానికిం దెలిపి, దానిమతికి సమ్మతి గావించిన, నీవు దానికిం బతి వయ్యెదవు ఆతురపడితి వేని నీకార్యంబు గ ట్టెక్కదు.

ఉ. భూరివివేకసారతరభూరుహమూలకుఠార మాతురం,
బారయఁ గార్యపూర్ణఫల మార్పెడుమారుత మాతురంబు, దు
ర్వారప్రయత్నవారినిధిబాడబ మాతుర, మెల్లకాల మె
వ్వారికిఁ గూడ దాతుర, మవారితదుఃఖకరంబు ధారణిన్॥ ఉ-౨

సుమ. ఇట్టిదుర్గుణాధికం బగునాతురత వదలి, సునందనికిం దుఃఖోపశమనంబుఁ గావించి, చతురోక్తు లాడి, సత్యము లూని, వలపులు హెచ్చించి, నీమోహంపు వలలకుఁ జిక్కించిన, నీవు కృతకృత్యుండ వయ్యెదవు. మాన్యుండ వయ్యెదవు.

కుబే. నాకు దానిపై నుండునాతురత, నీవు చెప్పినయలసత, యివియే పరస్పరవిరుద్ధంబులై యున్నవి ఆసుందరీమందిరంబున కిపుడే నేఁ బోయి యాయిందుముఖిముఖారవిందంబుం గని యానందంబు నొందెద; పోయి వచ్చెద.

సుమ. ఆతురంబు వలదు. తత్తరపడితి వేని కార్యంబు రిత్తవోవును. తెఱి వేచి యుఱి దీయుము. కార్యప్రయత్నాంబునిధి నింకించుబడబాగ్ని కదా యాతురత. కార్యఫలసూచకతరుకుఠారంబు కదా యాతురత కార్యశేఖరధరాధరవజ్రంబు కదా యాతురత. ఆతురత కదా యనూరునిపాదంబులపాలిటి పెనుమృత్యువు. దితివంశంబుపాలిటిదావాగ్ని యాతురత కదా? ఇవి యన్నియుఁ దెలిసి కాలక్రమంబున సమయంబుఁ గాచి కార్యంబు సాధించుకొమ్ము. పోయి రమ్ము.

కుబే. సెల విచ్చినఁ బోయివచ్చెద. (వెళ్లుచున్నాఁడు.)

సుమ. బళే! ఇప్పటికిఁ గార్యము గట్టెక్కించితి. ఇఁక ముం దాలోచన చూచికొందము. (వెళ్లిపోవుచున్నాఁడు.)

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము - అరణ్యము.

ఎఱుకలు (దొంగలు).

మోహనరాగము - ఆదితాళము.

కడసి వస్తిమి జడియకుఁడి మీరు తడయుదాము యీడ కడమవారు కూడ ॥
పల్లవి.

దోసకారి వాని మోసగిల్లి మనము మూసి దాసి యున్న కాసు దోసితిమి ॥౧॥
వడ్డి కొడ్డి గట్టి, సెడ్డ లన్ని జేసి, దుడ్డు కూర్చువాని, జిడ్డు గడగమె ॥౨॥
కుడున గట్ట నుండి, కడుపు గట్టువాని-యొడలియెడ లన్ని సడలిన్నమె మేము ॥౩॥
పుడమిలోపల దుడుసువాఁ డెవ్వాఁకొ-నుడుసువానిధనముగుడుసువాఁ డెవ్వాఁడొ ॥
పుట్టినప్పు డెవ్వడు కట్టుకొని రాఁడు-గిట్టువేళ వెంట పెట్టుకొని పోఁడు ॥౫॥

రాముగాడు. చంచోడా మనము గడ గడసి వస్తిమి. మన కేల జడుపు? కడమ వారు కూడనీ నిలతము.

చంచోడు. జడుపు! మన తెలలో లేదు కదా! ఆమా టాడక.

కోసిగాడు ఆపొట్టోని బాగా దోసితి మని - అబ్బా, వాని దెంతదుడ్డురా?

రాముగా. ఎందరికొంపల కగ్గిపెట్టి యుండెరా వాడు?

చంచోడు. ఇఁక పన్నెండేండ్లు మన కేకొఱంత లేదు హాయిగా నుండ వస్తు నని.

కోసిగాడు. ఈపొట్టోని కింతదు డ్డెటు వస్సి యుండు నెసీ?

రాముగా. దుడ్డుదుడ్డుకు వడ్డి, వడ్డికి మాఱొడ్డి, మాఱొడ్డికి మాఱుమాఱొడ్డి, గట్టి, కొంపలు కూల్చి, యిల్లాలి నమ్మిన్ని, తాళి తెన్చిన్నినదు డ్డసీ యిది.

చంచోడు. అటు లయిన పాపిదు డ్డసీ యిది! కడుపున కంటే నస్సీ?

కోసిగాడు మనము దుడ్డు తిందు మసీ? అంగడివాణికి బత్తెమున కిత్తుముగా దసీ? జంకేల నసీ?

రాముగా. అటు గా దసీ. పాపిదు డ్డొస్సినపుడు దానాదరుమం సేవలె నెసీ.

కోసిగాడు. అవునసీ మనకు జోతిస్సము పెట్టిచ్చినయ్యకు పెండిలిటసీ. నూరువారగ లిత్తమొసీ! పేదోడు మంచిమూర్తెమును పెట్టుబాపనోడా డసీవాడు.

రాముగా. ఇత్తము నూరువార లేల? పదినూరువార లిత్తము మన కేంత క్వసీ.

చంచోడు. కడుపునకు కడి తినక యుండినయీాణికి, కడు పెటుల వస్నె నసీ?

కోసిగాడు. రేయిబవలు దుడ్డు సూసుట, మూటఁ గట్టుట, మరల విస్సుట, మరల దు డ్డెనసుట, మరలఁ గట్టుట, మింటికి కన్నెగరేసుట, మంటికి దినుసుట, ఇదియే వీనిప నసి, సూసిసూసి కడుపు వస్నె నసి.

రాముగా. బిస్సాలవాడు పైసా యడిగిన, పాన మిస్సును కాని పైసా యిస్సు నొసీ వీఁడు?

చంచోడు. ఇట్టివా కుండ మనకు బతుకుతెర వసీ, లేకున్న గతి యేమసీ? మన యూరిల్లేరమ్మ మనకోస మీాళ్లను పుట్టిన్సు నసీ. ఇట్టివారు కడుపు కట్టునది మనపొట్టకు పెట్టుటకే నసీ

కోసిగాడు. నిజ మసీ, యొకనిని యడుగము, ఒకచోట కొలు వుండము. యొకనివద్ద యొకపైసా యప్పు తీయము. యడవిలో యొకకాణి బూమి యెఱుగము. యూరిలో యిల్లు కట్టము. యెవణికి జడవము. అయినను మనమె దొరలము కా మసీ?

రాముగా. దొర లబ్బల మసీ! బలువు గలదొరలకు రెయ్యింబవలు నిదుర లేదసీ. మనలకో యిక పన్నెండేళ్లు కంటికి సల్లగా నిదుర వస్సు గా దసీ.

కోసిగాడు. నిలు ని లసీ. సద్దు స ద్దసీ బొాట్టె డేడో యేడ్సెడు యింటె మసీ?

వాముగా. అవు నసీ యీా డేడో పోరగా డేడ్సెదు, రం డసీ సూతాము. పఱుగుపఱుగునరాండసీ. (అనుచు పరుగెత్తుచున్నారు)

---

## ద్వితీయాంకము.

### ద్వితీయరంగము (అరణ్యము)

జయపాలుడు - ఘాతకులు. ఎఱుకలు.

జయపా. చం. ఇటు నను దెచ్చి యేల నొకొ యీ విటు లాఁడెద? వన్న! మేల్లొకో! యట జనయిత్రి నన్ను విడి హా! సుత! నాదెసనుండి యేల నె
చ్చటఁ గనుఁ బ్రొమి పోయి? తని చాల బడల్నాడి కుందు, నన్న! యి
పుటిఁ కెటు లైనఁ దల్లిఁ గలపం గద రన్న కడంగి వేఁడెదన్.

చండోడు. సం పసీ యెఱ్ఱోఁడ యేల తడసెదవు.

జయపా. సావేరి రాగము—రూపక తాళము.

అయ్యలార యేమి-అయ్యో! చేసితి-నయ్యా నే మీకు?-చయ్యన నాతలఁ—
దియ్య వచ్చెద రేల? - అయ్యో! తడయకుఁడి. పల్లవి.

అయ్యా కడు భయ—మయ్యెడు వేగ మా-యయ్యనుఁ జూపుఁడి-వెయ్యా
అువరహాలు-అయ్య నడగి నే-నియ్యనె నిజముగ? ౧

పిల్లవాఁడ నేను - చల్లనినాముద్దు - తల్లినిఁ జూపుఁడి - తల్లికిఁ జెప్పదుఁ-
గొల్లగ మీకు నేఁ - జల్ల చేయింతును. ౨

నిక్కపుమక్కువ-యెక్కుడు గలిగిన-యక్కయ్యను జూపుఁడి-లెక్కకు మీ
తిన- రొక్కము లిచ్చెద-నిక్కము నమ్ముఁడి. 3

తండ్రులారా! నన్నేల చంపుపలుకులు పలికెదరు? నే నెవరి కేనేరంబు సేసి యుందు? ఘాతకులారా! ననుఁ జంప మీకుఁ గల్గులాభం బేమి? నాకుఁ గడుభయ మయ్యెడు. నాయయ్యను జూపిన మీకు వెయ్యాఅువరహా లిప్పించెద చల్లనినాతల్లిని జూపిన మీకడుపులు చల్ల సేయించెద, అక్కఱ గల నాయక్కయ్యను జూపిన మీకు మిక్కిలిరొక్కము లిప్పించెద అయ్యలారా నట్టడవిని నన్నీరీతిఁ జంపకుఁడీ, మిమ్ముల వేఁడుకొందును.

ఎఱ్ఱోడు. అబ్బా! బిడ్డలు లేక కడుపు గొడ్డోయినోఁడే యీకందయ్యను సంపొలి గాని నను సంపనీ నాసేత కా దనీ.

పిచ్చోడు. ఆకూనమ్మా టిన్న సాలు ననీ. మన సొకదిను సా నొనీ. ఆకందమ్మమాటకు నాకంటికి నీ రొస్సె ననీ. ఈదోసప్పని నాసేత కా దొనీ.

చండో. ఓరీ! పోం డ్రనీ! మీ రెంతటిపాపులు. తిన్నింటిదంతె లెన్నేవా రనీ మీరు. ఉప్పు తిన్నోనియానకు వేఱు సేయ నగు ననీ? నుక్కలాలె లెక్క లేనిపానాలను మెకల జలెగ త్తిరిస్సినమా కీపాపొ డెం తనీ? వేటోనికి మెకము పై దయ యుండు ననీ?

పిచ్చో. వానికొలువుకన్న నట్టడవినుండి యాకూ అలమా మెసవి గుంటలో పాఱునీరు దావి పొదరింట్లో సల్లగా నిదురిన్న వన్ను ననీ.

చండో మీరలు దోవు లనీ. పాపోనిపై మనసు పెట్టితి రనీ. వానితల నే నెట్టెద సూడం డనీ. (అనుచుఁ గత్తి యెత్తిన బాలుఁడు పరుగిడుచున్నాఁడు.

ఆసమయంబున నెఱుకలు వెనుకనుండి వచ్చి చండోనిని గట్టిగఁ బట్టుకొనుచున్నారు.) ఓరీ యెవక నను బట్టినోం డ్రోత్త్రా? విడుండి విడుం డ్రసీ. పానంబు పోయెడు రసీ. విడుం డ్రసీ.

ఎఱుక. సేతిక త్తిసి రేసిన ని న్నిడుస్నాం కాని లేకున్న నీపానం వుస్కాందు మసీ.

చండో. అయ్యో పానం తీకం డ్రసి. విడిసితి క త్తి. విడువిడుం డ్రసి [కత్తి క్రింద వైచుచున్నాఁడు. ఎఱుకలు విడుచుచున్నారు.] అబ్బా! బతికితి నసీ. వీరేగో పాపోనిపాల దయ్యంబు ల య్యెశ్నా రసీ.

ఎఱుక. ఓకి! దోసకారీ! పసిపాపోని దెస్సి యట్లు గోసెదవే! ఆకందమ్మ నీకేం తప్పు సేసె నంట్రా?

చండో. తప్పు సేసెనో యొప్పు సేసెనో దయ్యాన్కే తెల్యాలి. యేల్నోణి యూన సేయా ల్నా ద్దసీ?

ఎఱుక. యేల్నోఁడు కాఁడు నీయేల్నోడబ్బోణ్ణి రానీ యూకూనపై యేలు షడ సీము.

జయపా. తండ్రులారా! రక్షింపుఁడు [అని యెఱుకలకడకుఁ బరుగిడు చున్నాఁడు.]

చండో. పాపోనితల దీనిసో యూమన్నపోతు మాతల దీసు నసీ. ఏమిసేతుం బాబోండ్రారా?

ఎఱుకలు. పోండ్రసీ దోసులారా? ఈపాపోని మా కప్పగిన్ని సంపితి మ్మని సాటించం డ్రసీ. నూరువార లిస్సేం పోపోం డ్రాసీ.

చండో ఏం బాబూ? మాఫె కల్లోండ్రమా? కల్ల మాతెల్లో లేదే? కల్లోణ్ణి కులమోండ్లు వెత్తీతురు కా దసీ?

ఎఱుకలు, మీ రట్లు సేనిసో పిల్లోఁడూ పోవు - నూరువారలూ పోవు - పోం డ్రసీ. పోనిసో మీపానాలు వుస్కాందు మసీ మామూ.

చండో. నిజ మసీ. అట్లే సేతుం కాని నీయబ్బాండ్రారా? ఈకందన్నను వెత్తీకుండా దాసిపెట్టి పెన్నుం డ్రోరీ. కాని బాబూ మావార లిస్సేం డ్రసీ.

ఎఱుకలు. వుస్కోం డ్రసీ, హెూట్లూ రోండ్లూ [అనుచు నూరువరహా లెంచి యిచ్చుచున్నారు.]

చండో. ఎట్టిమిన్నెడుదు డ్రసీ యిది? యబ్బలారా! ఇది యెసుట దెస్సితి రసీ?

ఎఱుకలు దుడ్డు పుట్టిన్నువిద్దియము గఱసితి మసీ మాము.

చండో. మా కావిద్దియం సెప్పం డఁసీ.

ఎఱుకలు. హెూరికి సెప్పవిద్దెం కా దసీ యది.

చండో. మీావిద్దియమ్ మీాకే యుండనీం డసీ. మాముపోతు మసీ.

(అందఱును వెళ్లుచున్నారు)

---

ద్వితీయాంకము.

తృతీయరంగము. ఉగ్రసేనునిమందిరము.

ఉగ్ర క సుందరి జయమాలిని నే। గందర్పుని కేళిలోనఁ గలయుటకై యీ।
నిందార్హమైనపనులను। బొందుగఁ జేసితిని గాదె? భుజబల మహాహా!
అహాహా! ఆసుందరి యాచిత్తరుబొమ్మ సౌందర్యాతిశయంబు! నామనమం
ద చ్చొత్తినట్టున్నది! అచ్చరాంగనలఁ బొంద నవని జను లాహవాదికర్మం
బుల మేషాదిపశుచ్ఛేదనంబు సేయుచుండ్ర కాదె? అట్టిచో నాయచ్చ
రాంగనలకన్న నెన్నఁదగినకన్నె యగుజయమాలినిఁ గలయుటకై యొకశి
శుచ్ఛేదనం బొనరించిన నది నా కెట్లు దోష మగును? హా! ఆయప్సరస
లీసుందరీమణి యొక్కొకయంగమున కేని సరి యాదురా?

సీ. శశిరేఖ యందమా, శశిరేఖ యాచెలిఫాలతలం బైనఁ బోల లేదు,
హరిణీసరోజాక్షి యందమా, హరిణి యాసఖికన్నుఁగవ కింతసాటి రాదు;
రంభ యఁ టందమా, రంభ యాననబోడియూరులఁ బోల నీరూరు లోన;
తార యం చందమా తార యాకుచభారగౌరితోఁ బోలఁక తారు మింట;
తే. గీ. నహహ! సుందరిజయమాలియవయవంబు
లొకటొకటె దివ్యకాంతల నోటుపఱచు,
మరునియాఱవశర మన మహిఁ దనర్చుఁ,
జంద్రపరిపూర్ణరుచికళాసాంద్ర యగుచు. ౬౫

ఆహా! ఇందిందిరాభాలకయు శకలితశశిబింబాలికయు నగునీబాలిక
మోహాఫలమధురాధరంబు సంభ్రమంబు గదుర పానంబు చేసి తనివి చెం
దుట పూర్వభవార్జితపుణ్యవైభవంబ కాదే! అది పుణ్యపురుషులయదృష్ట

లభ్యం బనుటకు సందియంబే? ఈకరభనిభోరువినుతకటితటీపులినశ్రోణీవిభవంబుం జూచిన మానవునిమనోమర్మములను మఱుఁ దురులం గొల్పఁడా! అహో! ఆగంధసింధురరాజగమనముఖేందుబింబనవలావణ్యామృతసింధువునం దీఁదుటకుం గదా యీవసుంధరాధిపునిసుందరతరసుకుమారకుమారశేఖరుని ఘోరాటవులందుఁదలిదండ్రులనెడఁబాపితి? ఆసుందరిబింబాధరంబుం గ్రోలి డెందంబునం దమందానందంబుఁ జెందుటకుం గదా యాకందర్పసమరూపుని రాజనందనుని జయపాలుని యమమందిరంబునకుం బంపితి? ఆగంభీరమదగజకుంభోపమానకుంభకుచపరిరంభణసంరంభమునకుఁ బాల్పడుటకుం గదా నే నింతటిసాహసంబు సేసితి.

మదనదర్పణవృత్తము. కన్నెఁ గలయఁ గాదె చేసితి నగనంగఁ గ్రూరముల్?
నన్ను గసినఁ గౌఁగిలించి నాన వీడి రమ్మనుల్,
సన్నుతు ననుఁ జేరఁ దీసి నీసమాను లే రనుల్,
మున్ను దలఁచువాంఛ లన్నియు న్మదంబుగా నిడుల్. ౬౬

ఇట్టిసాహసంబులు చేసిననన్నుం జూచినతోడనే యాతుంగకుచ యాలింగనాహ్లాదంబులు గలుగఁజేయ కుండునే? భళిరే! నాయనర్గళభుజార్గళబలంబు గదా యింతటిసుఖంబు నా కందించునది? భుజబలంబు లేనివానికి బుద్ధిబలం బుండిన నేమి? దైవబలం బుండిన నేమి? ఆసుమతి తనబుద్ధిబలిమియే సర్వకార్యసాధనంబునకుం గారణం బని నమ్మినవాఁడు. వాని పిచ్చికి నే నేమందు? ఏమం దిచ్చిన నది గుదురదు. బుద్ధిబలిమియే సర్వశక్తి యైనచో నాజయపాలుసిరూపు మాపుటకు నాభుజబలసాహాయ్యం బేల గోరెను? తనపుత్రికారత్నంబు నేల లంచం బుగా నిచ్చెద ననెను? భుజబలంబు త్రిజగంబుల నేని సాధించు నన్నచో నాగజరాజగమనను సాధించు టేమి యసాధ్యంబు?

తే. గీ. భుజబలము గాదె సమకూర్చు బుద్ధిఁ జూడఁ,
ద్రిజగతీపోషణబలంబు శ్రీహరికిని,
త్రిజగతీశోషణబలంబు త్రిణయనునకు,
త్రిజగతీపూర్ణసృష్టుల నజున? కహహా! ౬౭

సర్వకార్యంబులు నేఁ గోరినరీతి సమకూరె. ఇఁక నాసుందరినిఁ జూడక నిలువఁ జాలను, దానిమందిరంబునకుం బోయెదం గాక. (నిష్క్రమణము.)

---

## ద్వితీయాంకము.

### చతుర్థరంగము - మంత్రిమందిరము.

జయమాలి (స్వగతముగ). కళింగరాజ్యాపహారంబు సేయం బూనిననాతంత్రిమహాసాహసంబు జయంబు నొందు ననుశుభసూచన యగుపడెడు. జయమాలీమూలకం బగుయత్నంబు జయంబు గాక యపజయం బెటు లగు? అహాహా! స్త్రీలు గదా పురుషమృగంబులను బట్టుటకై మరుఁడుంచినదీమములు? యువతులపై పూఁతలమమతలకును, చెలులవంచనలవలపులకును, మదనప్రదరవిదళితవివేకులై, కాముకులు సుడిం బడినచైత్తయుం బోలె విభ్రమించుచుందురు. ఆహా! ఆయుగ్రసేను నెంతటివిమోహవారిధిలో ముంచివేసితిని! తెచ్చుకోల్వాలవులు హెచ్చించి మెచ్చుగు వెలయాలిమోహంబు న్నటించి యుగ్రసేనునిఁ బిచ్చివానిఁ జేసితిం గదా! మదాంధుఁడై వాఁ డీమాయలు దెలియఁ జాలకున్నాఁడు గాదే!

* ఆఖేటవృత్తము

మదిరాక్షులు రాక్షసులం చెన్నక మైయందంబుల్ మాయురె! యంచుర్;
మదనప్రదరంబులకు న్నగ్గుచు మన్ను న్మిన్ను న్గానక యెంతో
ముదముల్గొనుచు, న్మదితా రమ్మని ముందు ల్వెన్క ల్గోఁపక పల్కుర్;
హృదయంబు విషంబధరం బౌసుధ, యెన్న న్గన్నె ల్వెన్ననిమాయల్. ౬౮

భళిరా! వెన్ననిమాయలరీతి మదిరాక్షులమాయలు మానవులకుఁ దెలియ నలవి గావు కదా! మాయమర్మములు మానినులకు మాననీయంబులు గా వని జను లాడుదురు. నాకు నట్టిమాయలు హేయంబు లని తెలియు. అయినను నాచేయఁగల దిం దేమియు లేక యున్నది. జనకు

---

* ఇది 21 టవ ఛందంబునందలి 396508- దవవృత్తము. స, స, స, భ, మ్మ, త, య, గణములు 13- డవయింట యతియు.

నాన మీఱినఁ బాపంబు సిద్ధించుం గదా! ఈలోకమున స్త్రీలు ప్రళయాంతకు లని తెలిసియుఁ బురుషు లేల నో వారి నబల లని వాడుచున్నారు? జలజనయనలబుద్ధిబలిమికిఁ దులదూఁగువా రీయిలలో లేరు. ఉవిదలకు స్వాతంత్ర్యము వల దని శాస్త్రకోవిదులు పదరుదురు. అవి శాస్త్రంబులలోనివార్తలే.

### అంబురుహావృత్తము.

ధారణి నారులలోచనసాయకధారకు న్బడి దిట్ట లౌ
ధీరులఁ గానను మారుతి భీష్ముఁడు దేవబీజసముద్భవుల్
నారులు గోరిన ధారణి నంతయు నాఁపఁ జాలుదు రొక్కమై
వారినిఁ బూరుషు లేలనొ వెల్తిగ వాడఁబోదురు మాంద్యులై. ౬౯

యథార్థంబుగ స్త్రీలే స్వతంత్రు లనుటకు సందియంబు లేదా. ఏధీరులు నారులవాల్చూపు లనుశరమ్ము లురమ్మునం దవిలి వారిశరణమ్ము సొచ్చి చరణమ్ములే సేవింప కుండిరి? మూలఁ గూర్చుండియే గాలము వైచి యిల నైన నొక్కమై నీడ్వఁ జాలినచెలుల నబల లని పురుషు లాడుట తమయందు బలంబు వ్యర్థంబుగా నిరూపించుకొనుటకుఁ గాఁబోలు. జగత్తు స్త్రీమూలం బనునది మఱచిరి కాఁబోలు (ఉగ్రసేనుండు ప్రవేశించుచున్నాఁడు.)

ఉగ్ర. జయమాలీ నీకు జయ మగుఁ గాక, జయ మగుం గాక. దేవీ! కుశలమా?

జయ. (సిగ్గు నటించుచు) నీయట్టిబలశాలురు చేపట్టి యుండ నాకుశలంబున కే కొఱంతయు గోరంత యే నెట్లు కలుగును?

ఉగ్ర. (తనలో) బళె! యీమెపలుకు! కపురంపుంబలుకు! తేనియ లొలుకు, మధురంబుం జిలుకుం గాదే?

జయ. (తల వంచికొని) ఏ మిది యచ్చెరువు! ఈదినంబున నాకు మున్గొలునఁ దెలుపక విధివిరుద్ధంబుగఁ జెచ్చెఱ లోనికి వచ్చితిరి! స్వతంత్రంబు చేకూరెంగాఁబోలు? నిజము.

ఉగ్ర. జయమాలీ! వెలిభావంబు లిఁక మనకు వలదు కాఁ దగినకార్యంబు లన్నియు నయ్యె. సారసాక్షీ! సరసకు రమ్ము ఒక్కసమాచారంబుఁ దెలిపె
గ (జయమాలి కొంతదూరమునకు జరుగుచున్నది) [illegible]

దూరంబున కేగెద వేలనే? నాపైఁ గోప మఁటే? ఏల? ఇన్ని దినములనుం డిచూడ రా నైతి ననియా? నిజము. అందునకుఁ గారణం బున్నది. ఎల నాగా! నాదిక్కు నఁ జూడ వేలనే?

మత్తకోకిల. కోకిలాలప! కోమలాంగిరో! కోప మేలనె?. తాళనే!
రాకుమారుఁ బరాకు సేయక రాత్రివేళను బట్టి నే
షోక డార్ప నె యాకుమారునిఁ? బోలునే యిది? నాతిరో!
నీకుఁ గా దొకో! చేసితి న్గడు నింద్యకృత్యము లిమ్మహిన్? 20

మోసము వలదు. నినుఁ గలయుటకై గదా నే నెన్ని యో యకృత్యం బు లొనరించితి? నీజనకునాన శిరసా వహించి యారాకుమారుని జయ పాలునిఁ బొకార్చితిని. ఆలస్యము చేసితి నని కోపమా యలసగమనా?

జయ. కోప మేల? చాలుంజాలు నాపే రెత్తకుము. నాపేరం బిలవకుము.

ఉగ్ర. అళిచికుర! పేరం బిలిచినఁ దప్పఁటే? పరిణయానంతరంబునఁ గదా నీనా మంబు గాయత్రీమంత్రంబురీతి గట్టిగ నుచ్చరింపఁ గూడనిది గా నుండు? సుందరీ! విజయాక్షరకలితం బగునీనామస్మరణమాత్రనె నా కఘటనఘట నాకాశలంబు కలుగుచున్న దాప్రభావ మెట్టిదో తెలియ కున్నది. ఆ! తెలిసె, తెలిసె, సి న్నడుగ నేల? కారణంబు నాకి తెలిసె. శుభసూచక మగు నెకయక్షరంబుం దలంచినమాత్రన జనులకు సమస్తశుభంబులు గలుగుచుండ శుభాక్షరమాలికచే శోభిల్లునీనామాక్షరంబులు స్మరించు నాకు శుభంబులు గలుగు టేమిచిత్రంబు?

కం. విజయాక్షరనామము మద। గజయానా! స్మరణ సేయఁ గలుగును శుభముల్;
త్రిజగన్మోహిని! నీ వ్రా। విజయాక్షరనామపంక్తి వెలయుదువు రహిన్. 20

జయమాలీ! ఇట్టినీనామాక్షరంబులందు లియ్యమై దివ్యౌషధియో లేక దివ్యామృతసారమో యున్నది. లేకున్నఁ గ్రోలినమాత్రనె నా రెండుభు జంబు లుప్పొంగి నాయం దొకదివ్యసామర్థ్యం బుద్భవింప నేల?

జయ. ఉగ్రసేనా! నీహృదయం బెటు లున్నదో కాని నీనామస్మరణచే నా మనం బొకవిధమ్ముగా నుప్పొంగుచుండును. అది యిట్టి దట్టి దని నిర్వ చింపం జాల. మఱి సహింప నేలం జుమీ!

ఉగ్ర. జయమాలీ! నిజ మాడితివి. ఆబాధ కెవ రోపుదురు? నే నెంతటి సామర్థ్యము గలిగినవాఁడ నయిన నామగుని విచలితసకలామరుని గ్రూరశరమ్ములదాడికి నిలువ నేఱకుంటిని. ఆపంచశరునిఘోరశరధారలకు నా శరీరము తపించి తాళం జూడుము. జయమాలీ! నీ వబల వయిన నట్టి బాధల కోర్చెద వెటులే? నేనోపఁ జాలనే?

※ మలయజవృత్తము మలయజగంధిరో! మనసిజుబాధలు మనమునమానవు మననిఁక నే;
నలికులవేణిరో! యలసితి నంగజునలబల ముంచెదునలజడిచేఁ
దలిరులబోఁడిరో! దరికొనెఁ దాపము, తడయఁగఁ జాలనె, తడవు లిఁకనే;
జిలుకలకొల్కిరో! చిలుకవజీరునిచిలుకులఁ జిక్కితిఁ, జెలి! కనవే. ౭౩

(జయమాలి పెడమొగ మిడుచున్నది.) జయమాలీ! అటు లేల మోము ద్రిప్పెదవే?

క. వనజానన! నెన రూనిన । కనుగొనలను నన్ను నీవు కనుఁగొను, చానా!
యనవరతము మనమున నిను । గొనియాడుదు ఘనముగాను గోమలి వినవే.

సుందరీ! ఏల ననుఁ గడవానిగాఁ జూచుచుఁ గఠినంబుం బూనెదవు? రాజవదన! ఈ రేరాజు, మలయజగంధీ! ఈమలయమారుతము, చిలుకలకొలికీ! ఈచిలుకలపలుకులు, కోకిలవాణీ! ఈకోయిలలకలకలములు, నీమదికెటులు హితంబు లై యున్న వో తెలియదు.

చం. మలయజగంధి! యీమలయమారుత మెన్నఁగఁ బ్రాణబంధువే?
నెలఁ తరో! నమ్మి తేమె నెల? నెయ్యుఁడొ! మోముబిడెంబుసం? గటా!
చిలుకలకొల్కి! మారుకొని చిల్కలు పల్కవె? కోకిలాలపా!
కలకలఁ గూయుకోయిలలు కన్నుల నిప్పులు గ్రక్కవే కనవే? ౭౪

చెలీ! ఇఁక నీతాపంబు సైపం జాల. చాల తపించితి. చేరువకు రావే? సుందరీ! నీచారుతరమధురాధరామృతంబుం గ్రోల్చి తనివి చెందింపవే!

(అనుచుసమీపించుచున్నాఁడు, జయమాలి దూరంబునకుఁ బోవుచున్నది.)

ఇంతీ! ఎంత బతిమాలినను దూరంబున కేగెద వేమే?

ఉగ్ర. ఉ. జాలము లేల? యేలు మిఁకఁ జాలనె తాళఁగఁ గల్కి!

జయ. చాలు; నీ కేలర యింతబాళి? తగు నేమిర? వేళలు లే వ దేర?

---

※ ఇది యిరువదియారవ ఛందంబున 33290224-గవ వృత్తము న. జ. న. స. న న. భ. న. వ. గణములును, 8 - 15 - 22-వ స్థానముల యతియు నుండవలయును

ఉగ్ర. హా!

జాలి వడంగఁ జాల మరుజాలములం బడి

జయ. తాళు మింతలోఁ

గాలము వచ్చు నీకు

ఉగ్ర. శుభకాలము నా కది నమ్ము నెమ్మదిన్. ౨౫

సారసాక్షీ! నాసరసం జేరి సరససల్లాపంబు లాడి సరసిజాంబకుని కేళి సుఖాబ్ధిలో నను ముంచిన న్మంచుము. తేల్చినం దేల్పుము. ఎటు చేసి నను నాకు సంతసమ్ము కాని జాగు సేయ వలదు. నీవియోగదుఃఖంబు నే సహింపం జాల వలచినయింతిని బాయువిచారం బింత యంత యని తెలుప నలవియే?

ఋ. ఉగ్రసేనా! నీవచనంబులకు నామనం బెంత విచారంబు నొందునో యనునది యెఱుంగక యున్నా వేల? నావిచారంబు దైవం బెఱుంగు. నీ పలుకు లనునవి నావిచారాగ్నికి శుష్కేంధనములుగా నున్నవి ఏమి సేయవలెను? జనకునాన కలుగునంతవఱకు మనదుఃఖంబు మన్నమే యుపశమించుకో వలయు? త్వరపడినఁ గాఁ దగినకార్యంబులు రిత్త వోవవే? నిజము ఉగ్రసేనా! నీ కీవిళంబము బలుకష్టముగా నున్నది. కష్టము లేక సుఖం బేల కలుగు? పేదవడి సంపద నొందినవాఁడు తత్సంపత్సుఖం బెఱుంగునటుల యాబాల్యశ్రీమంతుఁ డెఱుంగునే? కష్ట మోర్చి కడతేఱినవానికి ముదములు దోఁచినట్లు లేకాలంబునఁ గష్టంబుం గన్నెఱుంగని వానికిఁ దోఁచునా? నీవు కొన్నిదినంబు లిట్టికష్టంబు లోర్వనే వలయు. పిమ్మట సుఖంబు నీకు హెచ్చు. ఉగ్రసేనా! విచారము వలదు. కాఁ దగినకార్యంబులు గాక యేల మానును? విదియనాఁ డగుపడనిచంద్రుండు తదియ డాఁగునా?

చం. విదియనిశీథి మాటువడు వెన్నెలతేఁ డెటు డాఁగిపోవుఁ దాఁ
దదియనిశీథి? నేల యిటు తత్తర మొందెద? వక్కటా! భువిన్
ముదములు హెచ్చుఁ గష్టములు మూఁడి సుఖం బొనఁగూడువానికిన్
విదితము గాదె పేదవడి వెండియుఁ గల్గెడుగల్మిసౌఖ్యముల్? ౨౬

ఉగ్రసేనా! నీ కీనీతులు దెలియ కున్నవే? ఇంకం గొన్నిదినంబు లిటులే యోర్చి నాతండ్రియనుగ్రహంబునం జెడక యతనియాజ్ఞానుసారంబు

వ ర్తించి తేని రాజ్యంబు నాతండ్రిదియగు. అపుడు కదా నీపదవి మి న్నందును! నీసుఖంబు స్వర్గసుఖం బగు!

ఉగ్ర. జయమాలీ! నీమధురవచనంబులు హితనీతియుతంబులు. నిజము. త్వ ర వడినఁ గార్యంబు వ్యర్థ మగు. నీజనకునిమనంబున కేనాఁడు మనపై దయ కలుగునో నాటివఱకు వేఁచి యుండెద. దిన మొకయుగంబుగాఁ జూచుచుఁ గాచి యుండెద. జయమాలీ! పోయి వచ్చెద. సెల విమ్మా. (అనుచు సరసకుఁ బోవుచున్నాఁడు).

జయమా. (దూరంబునకుఁ బోయి) ఉగ్రసేనా! దుఃఖింపకు. నాతండ్రికి సర్వం బెఱింగించెద. మంచిది. నీవు విశేషముపనులవాఁడవు. పోయి రమ్ము.

ఉగ్ర. హృదయేశ్వరీ! నీయాజ్ఞ మీఱక వర్తించెద. మఱవకుము.

(ఉగ్రసేనుఁడు వెళ్లిపోవుచున్నాఁడు)

జయమా. (స్వగతముగ). మదిరారసోన్మాదమత్తుఁ డగుజనునింబలె నీ రాజ రమోహారసోన్మాదుఁడై యొడ లెఱుంగకున్నవాఁడు. వీఁడు ... భ్రమవిభ్రష్టవివేకుఁడై నే నాఁడినద్వంద్వార్థపదవివేచన సైతము నీమది కున్నాఁడు. సర్పదష్టునకు నింబపత్రంబులు మధురములైనట్లు ... దీనమనస్కుం డగువీనికి నావిషమార్థంబులు మధురామృతంబు యవి. వెఱ్ఱికి వేయివిధంబు లండ్రు గాదె? ఆవేయింట నిది యొక్క డని యెన్నెద. ఆ! వాఁడీరి నన నేల? నేఁ బిచ్చిని గానా? ఇట్టియమా నితకృత్యంబులు సేయఁ జాల నని నాజనకునకుఁ దెలిపిన నను దల గొట్టునా? ఇపుడు యోచించి ప్రయోజనం బేమి? ప్రారంభమునం దిట్టి దుష్కార్యంబుల దూఱకయ యుండ వలసె అట్లు దూఱియుఁ గార్యావ సానకాలమున నీవిచారం బేల? ఏమి సేయ నగు. ఇంక నాతండ్రిని దురా శాపాశంబు పట్టిబాధించుచున్నది. వానిచేతిజంత్రపుంగీలుబొమ్మ నయి నే నాడ వలసినదిగా నున్నది కాదె? ఇది నివారించుకొన యత్నించెదం గా క. (నిష్క్రమించుచున్నది

---

## ద్వితీయాంకము

పంచమరంగము. రాజమందిరము.

…నందని. కవిరాజవిరాజితము.

తనయునిఁ గానక తల్లియుఁ దండ్రియుఁ దాళఁగ నోపనితాపముచే,
వనములఁ జేడ్పడి వాయువుఁ గ్రోలుచు వాసిఁ దొఱంగుచు వాడఁగ, నే
మనియెద నే మఱి? మానని వంతలు మానస మందెను. మాధవ! నా
యనుజునిఁ జూపర యాయవనీశుని యాఱట మాఱ దయావనధీ. ౨౨

కటకటా! కానలోఁ బోయినబాలుఁడు కానరానికారణంబున నాతల్లి దండ్రులు కాఁగాకులు దిని కాననంబునఁ గాఱియలు వడుచు నవయుచున్నవారు. వారిదుఃఖంబు నామనంబుం గలంచుచుండుట నీరాజ్యసుఖంబులు నాకు వమ్మై పోయినవి. అకటా! ఆబాలుండు పోయి పెక్కుదినంబు లయ్యెను. వానిసమాచారంబుం దెలియ దయ్యెను. పరివారపరివృతం బగుశిబిరమధ్యంబున నున్నబాలుని మృగంబు లెటు గొని పోయెడిని? మఱి యచట వానిజాడ గూడ నగుపడ దయ్యె. అరివర్గంబు గొని పోయె నందమా నాతండ్రి యజాతశత్రువు. హా! అట్టిమహానుభావునకా యిట్టిఘోరసంకటములు? పుట్టిననాఁటగోలెఁ బరమసుఖపదవి ననుభవించినచల్లనినాతల్లికి నిట్టిగహననివాసంబు రాఁ జెల్లునే? చిన్నతనమునుండియు మన్ననలచే నే నాడించుచుండిననాతమ్ముఁ డేమాయెనో మాయ మాయెను? ఆబాలకుని భృంగశాబాలకుని నగుమొగంబు మఱలఁ జూచుభాగ్యం బీనిర్భాగ్యురాలికి నాకుఁ గలుగునో కలుగదో? దైవం బెఱుంగుం గాక మనుష్యమాత్రునకు గోచరముగా కున్నది.

మ. అకటా! బాలుఁడు నిద్ర లేచి వనిలో నమ్మయ్య! యప్పయ్యరో!
యొకని న్నీరిటు నెట్టి పోవ నగునే? యోయమ్మరో! యంచు; బ
ల్వికటమ్ముల్ లగ నాడియాడి తుదకు న్వీతాసు వై క్రుంగెనో?
అకటా! సోదరుముద్దుమోముఁ గనుభాగ్యం బున్నదో లేదో? ౨౩

అట్టిసోదరునివిచారంబున నాకు నేమియుం దోఁచక యున్నది. (అనుచుఁ జింతించుచుండఁ గుబేరుండు ప్రవేశించుచున్నాఁడు.)

కుబే. సునందనీ! ఈనడుమ నీతీరు వేఱై యున్న దది యేల? ఎల్లకాలంబుఁ జింతించుచుండెదవు కారణం బేమి? చిన్నతనమునుండి నే నిన్నుఁ జూచు చుందును. ఏన్నఁడు నీ వీరీతి ఖిన్నురాల వై యున్నదానవు గావు.

సునం కుబేరా! అన్న సెల్లెండ్రుంబలెఁ జిన్నతనమునుండియు నాడుచుం బాడుచు నుంటిమి కదా? నా కెన్నఁడే నిట్టిదుర్భరవ్యసనంబునకుఁ గతంబు గలిగెనే? లేదు. ఇపుడు కదా యది నాకు సంప్రాప్త మాయెను. ఈదుఃఖంబు కొన్నివత్సరంబులు వెలిఁ బడనీక భరించితి. దినములు గడచినకొలఁది నది దుర్భర మై వెలికి నుబుకుచున్నది. ఏమి సేయఁగలను.

కుబే. సునందనీ! అట్టిచింతకుఁ గారణం బేమి?

సునం. ఏమి కుబేరా! తెలియనివానింబలె నడిగెదవు? నాయనుంగుందమ్ముని వి చారంబు దక్క నాకు వేఱొక్కవిచారం బెక్కువది యగునే?

కుబే. సునందనీ! ఎట్టిపిచ్చిదానవు! నీయనుజన్ముఁడు పోయి యయిదేండ్లాయి నది. కానలోఁ బోయినవాఁ డిన్నిదినంబులు చనినవెనుక నిపుడు దొర కునే? ఏల నీ కీచింత?

కం. సుందరి సునందనీ! యిటు కుందెద వది యేల వలదు గురుకుచ నృపసం క్రందనుసతుఁడుండు నెమ్మతి చెందక యిందాక? నుడుగు చింత, మృగాక్షీ!
సునందనీ! ఏల నీ కింక నీవిచారంబు? వలదు వల దూఱడుము మూఱడుము

సునం. ఏమి! కుబేరా! అయ్యో! నాతమ్ముఁడు దొరకఁడా? శ్రీహరీ!

చ. కటకట! తమ్ముఁడా! విపినకంటకభూములు సొచ్చి నొచ్చితో?
పటుతరక్రూరజంతువులపా ల్పడి వ్రాయితో? భీకరారిబ
ల్కుటిలకరాళశూలములకు న్గడుఁ జిక్కుచు స్రుక్కితో? కటా!
యిటు లగు నే విధీ! బ్రతుకు లింతకుఁ దెచ్చితె? పాపి! దైవమా! 25

హా! అవనిలో నన్నదమ్ములు కదా యాఁడుబిడ్డలపాలిటి యైశ్వర్యంబులు? తమ్మునిఁ గోలుపోయిననా బ్రతు కేల?

కం. తమ్ములు లేనిగృహమ్ములు తమ్ములు లేనట్టిసరసి తనరునె జగతిం?
దమ్ములు మోదమ్ములు సుకృతమ్ములు సుఖదమ్ము లేవిధమ్మునఁ జూడఁగా. 26

హా తమ్ముఁడా! జయపాలా! నీ వరణ్యశరణ్యుండ వై యీరీతిఁ బోయెద

వని నే నెన్నఁడుం దలఁప నైతిర! హా! [క్రిందఁ బడి మూర్ఛ పోవు చున్నది.]

కుబే. [తనలో] నే నేమి సేయ వచ్చితి? ఎమి చేసితి? దీనివిచారంబు మాన్పఁ దలంచి వివేకరహితుండనై విచారంబుం బెంచితి. దీని ననునయించు విధం బెట్టులు? నాతండ్రి కలిపినహితోపదేశంబు లన్నియు నాయందు వ్యర్థంబు లయ్యె. ఈదినంబున నామనంబు తెల్లంబుగాఁ దెలియపఱుపవలె నని కదా నే నిర్ధారణంబు సేసికొని యిటు వచ్చితి? కాలవిళంబ మునకు నోర్వఁ జాల. పంచశరశరభిన్నహృదయుండ నై గుటకలు మ్రింగుచు నీకామినీమణికిఁ గలకాలంబుఁ గాచువాఁడ నె? ఇన్నివత్స రంబులు వేఁచినదే యెక్కువ. ఇటు వేఁచుచుండినం బ్రాయం బంతయు దీనిఁ గాచుటయందే వినియోగపడును. ఇఁక సుఖ మనుభవించున దెపుడు? చిరకాలము గాచినను బిమ్మటఁ గార్యంబు సమకూఱు ననునిశ్చయంబు లేదు కదా? భోగాములు వైళంబె తెలియుట శ్రేయంబు. ఔరా! ఈసుందరిసౌందర్యంబు! ఖిన్నముఖి యైనను సంపూర్ణచంద్రునిఁ దిరస్కరించుచున్నది! నిమీలితనేత్ర యైనను వికచాంబుజంబుల హసించుచున్నది! ఎటు లయినను దీనిదుఃఖోపశమనంబు సేయవలయు. నా కామితార్థంబుం జెందవలయు. లేకున్నఁ బ్రాణంబుం ద్యజింపవలయు. ఇదియే నానిర్ధారణమ్ము. [అనుచు సునందనికి శైత్యోపచారములు సేయుచు] సునందనీ! దుర్భరవిచారంబున నేల నేల వ్రాలెదవు? చాలుం జాలు. లెమ్ము. నే నుడివిననుడువు లూహాజనితంబులు గాని నిక్కమ్ములు గావు సుమీ.

సునం. (మూర్ఛ తేఱి) కుబేరా! ఏమీ! అటు లయిన నాయనుంగుందమ్ముఁడు దొరకునే కదా?

కుబే. సందియంబు లేదు. మతిమంతుం డగునాతండ్రి సుమతి యాబాలునిశుభ సమాచారం బరయుటకె చారుల ననేకులఁ బంపి యున్నవాఁడు.

తే. గీ. సంతతానంతసంతాపతాంత వగుచు
వగలఁ బొగులుట యేలనే వలదు వినుము
మంతనంబున యోచించి మంత్రివరుఁడు
చారులను బంపెఁ దెత్తురు వారు శుభము. ౮౧

సునందనీ! చింత వలదు. ఇంతులయానందంబు గదా కార్యశేఖరంబు నకు శుభసూచకంబు!

సునం కుబేరా! నీతుదిపలుకు లనువర్షధారలు ఘనతరసంతాపవహ్నిచే గ్రాలునాహృదయంబుం జల్లచేసెను. ఇంతులసంతసంబు కార్యశేఖరసూచకం బనునది నిక్కంబు కుబేరా! నీయనుంగుంజెల్లె లీదినంబున నిచటి కేల రాక తడసె?

కుబే. [తనలో] దీని దోవకుఁ దెచ్చితి [ప్రచురముగా] కలకంఠితో నాఁటపాటలం గాలక్షేపంబు సేయుచున్నది కాంబోలును సునందనీ! నీవు జవ్వని వై యుండియు వయోధర్మంబు లనుభవింపక యెల్లకాలంబు వంతలఁ గుందుట యేలనో తెలియ కున్నది దినదినంబునఁ గాలంబించించుక గతించుచుండును గాని వృద్ధి యగునా? సర్వలోకములు సృజించెడిబ్రహ్మకు నైతమాయుఃపరిమితి తగ్గు నన్న మనబోఁటివారి కడుగ నేల?

క. దిన మొకజలబిందువుఁ గొన ఘనతరవారాశి యింకుఁ గదవే తరుణీ!
దిన మ్మొకపెల్లఁ గదల్చినఁ దృణమాఁ గదె తుహినగము? తెలియవె చానా?

ఈరీతి దినదినం బాయుఃపరిమాణంబు సన్నగిలుచుండుటఁ జూచి లోకులు యుక్తకాలంబుననే యనుభవింపఁ దగినసుఖంబు లన్నియు ననుభవింతురు నీ వేల బేల వై యీరీతి సుఖదూరురాల వయ్యెదవు?

సునం. కుబేరా! నీమాటలు యథార్థమె యవును అయినను నైసర్గికసుఖహితం బగునాహృదయంబునకుఁ దెచ్చుకోల్సంతసం బెంతహితంబుగా నుండును? వయోధర్మసుఖానుభవం బనఁ బరిణయం బగుట యని కదా నీతలఁపు?

కుబే. నిజము. నిజము. నిక్కము. అదియే.

సునం. అటు లయినఁ గులశీలరూపవయోవైభవుఁడు గదా నేఁ బెండ్లియాడం దగినవరుఁడు? అట్టివరుఁడు దొరకమి జవ్వనులకొకదుఃఖం బగుం గాదే?

కుబే. సునందనీ! కులశీలరూపాధికులు మనపట్టణంబునఁ గఱవైరే? నీమనంబు వారిపైఁ బోదు గాక? తేటి చూచిన మారునిఁ గుమారుని నలకూబరుని సురవరకుమారుని మీఱుసరసరసానుకారులు సుందరాకారులు మననగరియం దొక రయినను దొరకరే? అరుదైరే?

సునం. కుబేరా! కులశీలరూపంబుల నాకుం దగినవరు లేరుం గానరా రనుట నిక్కువము.

కుబేరుఁడు. ఇది కదా కన్ను లుండినగ్రుడ్డితనము! అటు లయిన వా శే రయినది తెల్పెద వినుము.

ఉ. సారసగంధి! రూపమున సాటికి మారుని ధిఃకరింతు నే,
గూరిమిబంటు గాఁడె నలకూబరుఁ? డానెలరాయఁ డెన్న నా
కారము డిగ్గు ఖేదమునఁ; గాంత! వసంతు డిసంతుకొట్టుడుం;
గోరితి నీదుకూడికలఁ, గొమ్మరో! చూడవె నన్నుఁ బ్రీతిగన్. ౮౩

సునందనీ! మన్మనఃపూర్ణానందనీ! దాప నేల? ఓవికచోత్పలపత్రలోచన! ఆలోచింపుము. చూడుము. ఏధరావరునిసుకుమారసుందరకుమారులు నాతోఁ సరితూఁగువారు? ఆకంతుజయంతవసంతులరూపం బది యెంత? అని నే నధఃకరింతునే యింతీ! సొగసులదొంతీ! పూవులబంతీ! మదనమదదంతీ! ఓ రాకాసుధాకరబింబాననా? రంజితరాజీవాబ్జలోచనా! ధిక్కరితదిక్కుంభికుంభినీకుంభోపమానకుచకుంభకలనా! కుందరదనా! ఆశంబరదమనుని ధృతశమనుని మదకీరగమనుని సుమనారాచంబులకుం జిక్కి స్రుక్కితినే నారీ! మదనకటారీ! మోహంపుమిటారీ! యొయ్యారీ! నా దిక్కు చూడవే. నేను రూపరిని గానా చదువరిని గానా యోచింపవే?

సునం. కుబేరా! కుత్సితవిచారా! సోదరసమానుఁడ వని యెంచి నిను మందిరంబునకు రానిచ్చి స్వేచ్ఛగా నీతో సంభాషించినందునకుఁ గదా యిట్టి యవమానితపుంబలుకులు పలుకుచున్నావు?

మత్తకోకిల. ఔర! యెంతటిపొట్టక్రొవ్విది? యారె! యెంతటికావరం?
బౌర! యెట్టికృతఘ్నతాస్పద?। వారె! యెట్టిదురాగతం?
బోరి సత్కులపాంసనాధమ! యోరి బుద్ధివిహీనుఁడా!
నోరు మూయుము, తర్లు మింతట నూరుమాటలిఁ కేటికిన్. ౮౪

ఛీ! ఛీ! కుబేరా! యిదివఱకును నీ వేమియుం దెలియనివెఱ్ఱివాఁడ వని తలఁచుచుంటిం, గాని యిట్టికుత్సితవిచారుఁడ వని తెలియ నైతి. నీ వింతకండకావరముతోడ నుడలు మఱచి, యిట్టిప్రల్లదంబు లాడుదు వని, కల నైనం దలంప నైతి. భళిరా! నీక్రొవ్వు! నన్నా నీవు గోరునది?

కుబే. కామినీ! ఆక్రూరమారఘోరశరధారలకు సారెసారెకు వేసారి, శరీరము తాఱి, పోఁ దారి గానక, నినుఁ గోరి, నీమఱుఁగుఁ జేరితినే రమణీ! సఖీశిరో

మణీ! జగదానందనీ? సునందనీ, నే వెట్టివాఁడ నని కదా నీ వెదఁ దలంచితి నంటివి? అది నిక్కము. నీముఖసౌందర్యంబుం జూచిన నే నొకఁడన యేల? సమస్తలోకాధీశులు సైతము వెట్టి పట్టి మోహార్ణవచక్రంబున సుడివడి తిరుగుచుందురు.

పణవవృత్తము. భూతేశాదులు భుజసత్వాఢ్యుల్। వాతాహారులు వరమౌను ల్నీ
నీతు ల్ప్రీతులు నిజమై కన్నన్। భ్రాంతి న్నిల్తురు భటులై పంచన్. ౫౫

సునం. ఇసీ! కుబేరా! నీతులువకూఁత లిఁకఁ జాలును. నీ విచట నుండం దగవు. వేవేగఁ దరలుము.

పద్మస్త్రాలావృత్తము.

కుబే. కోపం బేలే? క్రూరం బౌనే?। పాపాత్ముం డేపంచాస్త్రుం డి
ట్లేపారంగా నేఁచె న్న న్నీ। తాపం బింకం దన్నీవే? తాళన్. ౫౬

కం. పంచశరకుముదశరమునఁ। బంచత్వము నొంద లేక భామిని? యిదె నీ
పంచకు వచ్చితి నిఁక నను। ముంచెదవో? లేక తేల్చి ముద్దాడెదవో? ౫౭

మదవతీ? మదనవేదనాదోధూయమానసుండనై నన్ను నీలావణ్యామృతార్ణవంబునఁ దేల్చెదవో? లేక ఘనతరవియోగవిమోహవిచారసాగరంబున భీకరమీననక్రగ్రాహవ్రాతంబునకుఁ బలిగాఁ బడఁ గూల్చెదవో? ఇఁక నీయదియే నాభారము. జవ్వనీ! నవనవయౌవనవయోభరితం బగునీ తారుణ్యశరీరలావణ్యంబు నవహేమధామంబు న్నిరసించునాశరీరకాంతిలోనలియ్య మైనతఱిం గదా బంగరునకుఁ బరిమళంబుఁ బొందుపఱిచినచందం బగు కలికీ! చిలుకలకొలకీ! తేనియ లొలికించుచు మధురసుధాధారలం జిలుకంగలనీకలికిచిలుకపలుకుల వెంట నాహృదయంబునకు నాహ్లాదంబుఁ గలిగించుశుభాతురఘుటికల న్వెలువరించి యీతాపం బార్పుము. భవన్ముఖేందుబింబాంతర్గత స్మితనవసుధాసారమ్మువలన మధురాయమానం బగునీదు బింబాధరంబుదిక్కునన చూచుచు స్వాతివానకు ముత్తియపుఁ జిప్పయుం బోలెఁ గాఁచి వేఁచి యున్నవాఁడను.

సునం. ఓరీ, కుబేరా! నీపని శ్రుతి మించి రాగానఁ బడుచున్నది. కాదని నే నెంత చెప్పినను నీకారుకూఁతలు విడనాడక మరల నెన్నియో తెన్నుల వర్ణించుచున్నాఁడవు. పొగరు కనులకుండట్టెయున్నది. కులగోత్రంబు

తెలుంగ నేఱకున్నావు. తారతమ్యంబుం దెలియ వైతివి. అనుజన్మసమా నుఁడ వని యెంచి తిరస్కరింపక పలుకరించినందునకుఁ గదా యిన్ని వంచనలు నీవు తలంచితివి? నీ విచట నిలువఁ దగవు పో పొమ్ము.

కుబే. సునందనీ! కులములతారతమ్యంబు లెన్న నేలనే? స్త్రీలు తక్కువకులమువారై పురుషు లెక్కువకులమువారు గాను, పురుషులు తక్కువకులమువారై స్త్రీ లెక్కువకులమువారు గా నుండి యొండొరులను మోహించి తమ తమ మనోభీష్టంబులు దీర్చికొని సుఖంబున నుండినవారి నెందఱెందఱిని వినియున్నాము కాము?

సీ. నెలఁత! యోజనగంధికుల మెద్ది? విఖ్యాతుఁ డలపరాశరుఁ డెట్టికులమువాఁడు,
మెలఁత! యూర్వశి యెట్టికులశీలముల దగు? నలపురూరవుఁ డెట్టికులమువాఁడు?
అలికుంతలా! శకుంతలకుల మెయ్యది? దుష్యంతుఁ డెంతటిదొడ్డవాఁడు?
చెలి! దేవయాని దేకులము? యయాతి యేకులమువాఁడది నీవు గుఱుఁ దెలుఁగవె?

తే. గీ. తెలియవే యట్టిమెలఁతలు తెగలు మాని,
మానితం బని కూడిరి మంచిమగల,
కులముశీలమ్ము లేలనే గుణము లేక?
మనము గలసినచోట నే మనువు కాదె? ౮౮

సునందనీ పై దృష్టాంతంబుల నారసి కులశీలంబులవిచారం బుడుగుము.

సునం. కుబేరా! మానితంబుగ నీ విచ్చటినుండి వెళ్లుదువా? వెళ్ల గెంట వలయునా?

కుబే. సునందనీ! నీవీక్షణాంచలము లనుసంకెలలు న న్నిచట బంధించివేయ నేఁ బోవున దెటులు?

కం. మరుబారికి వెఱచుచు నీ। చరణంబులఁ బడినయట్టిశరణాగతునిన్।
సరసకుఁ దీయుచుఁ గౌఁగిట। సరసగతి న్గూర్చి పోవు సారసనయనా! ౮౯

సుందరీ! తేటమాటలకుఁ బదివేలటీక లేల? ఉన్నయథార్థంబు నీకు విన్నవించితి. ఇదిగో శర ణని నీచరణంబులపై వ్రాలెద. (అనుచు సాఁగిలపడి పాదములు గట్టిగఁ బట్టుకొనుచున్నాఁడు.)

సునం. (స్వగతముగ) ఏమియమానుషకృత్యం బిది! భూలోకమునన్న దవివేకుల

[illegible]

బాలు కాకుండును? (ప్రస్తుతంబున నీనిమంచిమాటలతో మందిరంబు వెడల నడచి ముం దిక నాగృహంబుం జొరనీక యుండులాగు చేసెదం గాక. ఏని కున్మాదంబు హెచ్చినది. మోహరసంబు తల కెక్కినది. పిచ్చివారికి హెచ్చుగునిచ్చకపుమాటలు కదా మచ్చిక గొలిపి నచ్చిక పుట్టించుమం దులు? (ప్రచురముగా) కుబేరా! నాచరణంబులు విడువుము. నీ వెన్నియు పాయంబులు నేర్చితివిరా! ఇపుడు కదా నీవు చతురమతి వనునది నిక్కం బయ్యె? నీచదువు లన్నియు సార్థకంబు లయ్యె నీయోగ్యత తెల్ల మ య్యె. నీవు ప్రపంచానుభవంబు లేనిపామరుండ వని తలంచుచుంటిం గాని యింతటిప్రజ్ఞాధికుడ వని నే నెఱుంగ నైతి. నాచరణంబులు నొప్పి పట్టె డిని. విడువిడుము. ననుం గరుణించి విడువుము. నిను మన్నించెద.

కుబే. ఆహా! ఇపుడు కదా ధన్యుండ నైతి.(అనుచుం జరణంబులు విడుచుచున్నాం డు, సునందని వైళంబె వెళ్లిపోవుచున్నది. కుబేరుడు లేచి భ్రాంతిగొని) సునందనీ! నీయడుగుదామర లెంత నను పెక్కినమెత్తలై యున్నవే! ఇందువలనం గదా నీదేహంబు కుసుమకోమలం బని జనులు కొనియాడు దురు? నే నీదినంబున ధన్యుండ నైతిం గాదే సుందరీ!

సీ. వారిజారిహితానుకారిమోముమిటారి! ధన్యతం గంటి నీదర్శనమున;
మధుకరచికుర! యోమధురసాధర! నేను మాన్యతం గంటి నీమాటకతన,
కల్కిచిల్కలకొల్కి! కామునిపూముల్కి! గణ్యతం గంటి నీకరుణకతన;
మదనునిమదదంతి! మద మార ముద మూఱ మనుటలు గంటి నీమ [మతకతన.
తే. గీ. కంటిం గంటిని నేం గంటిం గలికి సుఖము!
జంట యెడబాయకే మచ్చెకంటి యికను!
మంటికిని మింటికిని గూర్చి మంట లెగుచు!
తుంటవిల్తునిశరవహ్ని యంట దిగను.

ఉడురాజముఖి! ఇపుడు గదా వసుంధరలో నాసరివా రెరును లే రు; నాశరీరం బుత్సాహంబున నుప్పొంగుచున్నది! ఏమి? సుందరీ! ఏమియు మ్మాఱు వలుకక, నాముచ్చటలమాటలకు నూఁకొట్టక యూరకుండె,

సరించెదవే? సుందరీ! నవయౌవనవతు లగుయువతులసంగమసుఖమునకు భంగకారి గదా కోఱమాలినయీపాపిష్ఠిసిగ్గు?

చం. తెలియ న దంత యింత యని తెల్పఁగ రానియనంగబాధలం
దొలఁగఁగఁ జేయ నెంచి కడుఁ దొందరగా వగకానిఁ గూడఁ బోఁ
ధలఁచెడినూతనాంగనలదాపునకుం జని కేలు వట్టి య
గ్గలముగ నీడ్చి లాగుఁ గోఱగాములసిగ్గు తలంప నెగ్గు గాౘ. ౯౦

చెలీ! కలయికకు మనంబు గలసినచో సి గ్గేల? బోటిరో! మాట లాడ వేలనే? సునందనీ! సునందనీ! (అనుచు నలుదిక్కులం గలయం జూచి సునందని లేమి యెఱింగి) హా! సునందనీ! మోసగించి వెళ్లితివఁటవే! మోసమా! ఔరా! చేకడి వాద ప్పెఁ గదా?

మ. కలలోఁ గాంచినకల్కి లేచి మఱల న్గానంగ లేనట్టు, ని
చ్చల మానద్దములోనిబింబ మరయం జాలంగ లేనట్టు; లీ
యిలపై వస్తువు లింద్రజాలమహిమ న్హీనంబు లై నట్టు, నె
చ్చెలిరూపం బకటా! కనుంగొనఁగ నేఁ జెల్ల న్హరీ! పోయెనే? ౯౨

అకటా! ఆసుందరిరూపంబు నాకన్నెదుట నుండిన ట్లున్నను స్పర్శకు నలవి గాక యున్నది! నామనం బరయ నిం డెం దై నను నాసుందరి డాఁగి యుండునా? [అనుచు దిక్కుదిక్కునకుం బోయి యున్మాదంబున].

సీ. హీరాళిమణిమయోదారంపుఁగంబమా! హీరాళిరదన నీ విందుఁ గనవె?
వైడూర్యభూషితవైభవభవనమా! విద్రుమాధరిఁ గానవే నిజముగ?
ఇందూపలోపేతమందిరకుడ్యమా! యిందువదనను నీ విందుఁ గనవె?
హరినీలవిలసితహరికవాటమా! హరినీలచికుర నీ వైనఁ గనవె?

తే. గీ. కనవె కరభోరుఁ గనకాంగిఁ గంజనయన?
నగుపడదె నీకు నలివేణి యలసగమన?
చూడవే నీవు సొబగులసొగసులాడిఁ?
గడఁగి వేఁడెదఁ దెల్పవే? కడపభ్రమానా! ౯3

(అనుచు నున్మాదంబునఁ బరుగిడుచున్నాఁడు)

## తృతీయాంకము.

### ప్రథమరంగము. రాజమందిరము.

సునందని (నిద్రలేచుచు). అరుణోదయమా యిది!

శా. చక్రం బెల్లను జక్కగాఁ బెనుచుచు న్సత్సంతతు ల్గాచు చే
వక్రత్వంబును లేక రాజ్యమును దాఁ బాలించి విశ్రాంతికై
యాక్రందుం డని చంద్రుని న్నిలుప వాఁ డాక్రందుల న్బెట్ట రో
షక్రోధంబున వచ్చెఁ బూషుఁ డదె దోషం బెల్లఁ బాసె న్భువిన్. ౯౮

పగ లెంతయు జడనిధుల నీరసంబు గావించి చక్రముం బెంచి సత్సంతతులఁ గాఁచి యలసి విశ్రాంతికై కొంతకాలంబు తనయనుంగుం జెలికాఁ డగుచంద్రునకు రాజ్యం బిచ్చిన, నాదోషాకరుండు నిశాచరుం డై యెంతటియకటావికటములు గావించె! చక్రముల వియోగనీరధిలో ముంచె. సత్సంతతులతేజం బడంచె. జడనిధులఁ బెంచె. అబలల నేఁచె. కుముదినీప్రియుం డై యిట్టికుత్సితకృత్యంబు లనేకంబులు గావించె. విషజనితం బగుతననై సర్గోత్పత్తి యెల్లఱకుఁ దెల్లంబు సేసె. వానిక్రూరకర్మంబుఁ జూడం జాలక కాఁబోలు రోషక్రోధారుణుం డై యరుణుండు వానితేజం బిపు డే నడఁగింతు నని తూర్పుకొండపై నగుపడెడిని. ఆహా! ఆపాతకి యగుచంద్రునిదాడికి నోడి కాఁబోలు నిన్నటిరాత్రి నాకుం గంటికి నిదుర రాక లేనిపోనితలంపులు మనంబున నాటి బాధింపం దొడంగె. మూఁడు యామంబులు శివరాత్రిజాగరం బయ్యె నాలుగవయామంబున నించుక కన్ను మొగిడినఁ దోడనె యెట్టివిచిత్రపుఁగలఁ గంటిని! ఏమిచిత్రమో కాని కన్ను మూయుటయే తడవుగఁ గనఁ బోనిమోహనాకారు ప్రేమాలం గని, మఱల నించుక కన్ను మూఁతపడి చెంద నేరనిసుఖంబుల నంది, కనులు తెఱచి కందుం గదా యాకనత్కనకశుభాంగుఁడు కాన రాఁడయ్యె. ఏమి సేయుదు? ఆమదనమోహనాకారుం డెవఁ డై యుండునో కద.

ఉ. కంటిని గామరూపు నొకని న్గలలోన నవీనసుందరుం
గంటిని గన్ను పండువుగఁ గాననిసౌఖ్యము లెల్ల నప్పుడే

గంటిని గన్ను మూఁత యిడి కానన దేలను కన్ను విచ్చి నే
నంటుచుఁ గౌఁగిలించి కడు హర్షము నందిననామనోహరుఁ. ౯౫

ఉ. మారునిమిత్రుఁడో? మహిని మాఱటమారుఁడో? మారమారకో
దారకుమారుఁడో? గురునిదారకుమారుఁడో? మారు ఫేనిశృం
గారశచీసుతుండో? దొర గాననిజక్కులతేనిసూనుఁడో?
యూరయఁ గంటి నాదుకల నక్కట! నావరుఁ డంచు నమ్మితిఁ. ౯౬

హా! ఆసురుచిరాకారుం డెవఁడో తెలియదు. మరుఁ డందమా? వానికి శరీరంబు లేదు. జయంతుం డందమా? వాఁ డంతశ్రీమంతుండు కాఁడు. చంద్రుం డందమా? కందు గాన్పింపదు. పెక్కుమక్కువలు పిక్కటిల్లం జెలరేఁగి యురమ్మునం జేర్చి చెప్ప నలవి కానిసుఖంబులం గూర్చి నను మోహమూర్ఛలో ముంచెను గదా! మఱల నట్టితఱిఁ గాచి నామానస ద్రవ్యం బపహరించి పఱచెనుగదా! పరు విడినను జిక్కఁడాయెం గదా అట్టిసుఖధాత నెడఁబాసి నే నెటు లుందు? ఏమి సేయుదు? హా! ఇవి యన్నియుం గలలోనిముచ్చటలు. ఆ; కాదు. కాదు. కలలోనిముచ్చటలయినం గాయంపుంబడలిక ప్రత్యక్షంబుగా నున్నదే? ఇవు డెంతప్రొద్దెక్కెను? మఱచితిఁ, జెలికత్తెలు వచ్చెడుసమయ మాసన్నం బయ్యెను. ఇట్టిశరీరచిహ్నలతో నుండిన వారు కారణంబుం గ్రుచ్చిగ్రుచ్చి యడుగుదురు. కలలోనివార్త వారికిఁ దెలుపుట సిగ్గులపాటగు. త్వరలోఁ బోయి జలకంబు లాడెద. (జయమాలి కలకంఠియుం బ్రవేశించుచున్నారు.)

జయ. సునందనీ! తెల్లవారినను శయ్యాగృహంబు వెడల కున్నా వదేల?

సునం. జయమాలీ! యిపుడే మెలఁకువ గలిగెనే?

కల. సునందనీ! రాత్రి నిద్ర మానితి వేల నమ్మా?

సునం. నిదుర మానితినా? ఏల?

జయ. అది యేలనో మాకెట్లు తెలియును? నీశరీరం బొకతీరుగ దాని నెఱిఁగించుచున్నది.

సునం. చాలులే నీజాణతనం బింతటఁ గట్టిపెట్టుము. నాకును నీమాట లంత కంత కొకవిధంబుగఁ గన్పట్టుచున్నవి.

జయ నిజ మాడితి నని నాపైఁ గోపంబు గాఁబోలును అటు లయిన నట్టి మాట లిఁక నా కేల ? అద్దముఁ జూచిన నీతీరు నీకే తెలియఁగలదు.

సునం. ఓ జయమాలీ ! ఓసీ కలకంఠీ ! మీపై నా కెప్డు డేనియుం గోపంబు గలుగు నఁటరే !

జయ. అది నిజ మేని కలతీరు పలుకుదువు గా ?

సునం. కలతీ రేమి యున్న దని నను బలుకు మందు రే?

జయ. సీ. అలినీలవేణి ! నీయలక లేలనె జాఱె ?

సునం. చెలి ! సంజ దూఱనే యలరుఁబోదల ?

జయ చెక్కులతీ తేల నెక్కతీరుగ మాసె ?

సునం. నిదుర రా దాయెనే నిన్న రేయి ;

జయ. వాడువాఱె న దేల వనితరో ! నీమోవి ?

సునం. చిలుకలఁ బెంచినఫలమె చెలియ !

జయ. లలన ! లేఁజమట లేలనె మోము నిండారె ?

సునం. కాలఫలం బది కాదె కలికి ?

జయ. గీ. వెలదిరో ! ముద్దుమో మేల వెల్లఁబాఱె ?

కల. ఏలనే కన్నుఁగవ నీరు నెఱ్ఱవాఱె ?

జయ. సొగసులాడిరో ! దేహంబు సొలసి తాఱె ;

కలకంఠి చేడెరో ! య దేల నీమేనిసిరులు జాఱె ? ౬౭

జయ. సునందనీ !. ప్రొద్దుననే లేచి బొంకు లేల నమ్మా ? నీనమ్మినచెలికత్తెలకు నిజము మఱుంగుపఱపవలయు నఁ టమ్మా ?

సునం. జయమాలీ ! నిజము పల్కువిషయంబున మృష లేలనే ?

జయ. సునందనీ ! అటు లయిన నీయుదంతమ్ము సెప్పఁ గూడనిది కాఁబోలును ?

సునం. జయమాలీ ఏల నీలీల హేళనంబు గావించెద రే ? నాతోఁబుట్టువువ్యసనంబు తక్క వే ఱొక్కవిధం బగుచింత నాయంతరంగంబున లేదు గ దే. నిజ మే, గుణగ. దీనిదును సందియంపడఁ దగు నఁటే ?

తోటకవృత్తము - ప్రశ్నోత్తరరూపము.

సునం. వనితామణి! తమ్మునివంత,

జయ. లిసీ!

మన సెం తని వేచెదె? మానిని!

సునం. హా!

తనుపారెడితమ్ముఁడె తాళ

జయ. నిచే,

కొనివత్తురు చారులు కోమలిరో! ౯౮

జయ. సునందనీ! నీసోదరునిసమాచారంబు చారులు దెత్తురు విచారంబు వలదు.

సునం. జయమాలీ! ఆబాలునిశుభంబు లిన్నిదినంబులుగాఁ దే లేనిచారు లిపు డెటులు దెచ్చెదరు? ఇంక నేల నీయడియాసలు?

జయ. అట్లనకుము. సఖి! మాతండ్రి నిన్నటిదినంబునఁ గొందఱుచారులం బిలిచి యాఱుమాసంబులు మితి పెట్టి యాలోపల నాబాలునిపోకడలు దేకున్నఁ గఠినదండన విధించెద నని బెదురు పెట్టి వారినిం బంపెను. వా రెచ్చట నయినను వెతకి సమాచారంబు దెత్తుగు. ఆబాలునికిం బ్రాణభీతి నిజంబుగా లేదు. వాఁడు చిరాయు వని కదా కాలజ్ఞులు పలికిరి.

సునం. నిజము జయమాలీ! జ్యోతిష్కు లనేకు లానాఁడు పలికిరి వారిపలుకు లిదివఱకు నెన్నఁ డేని యన్నృతములు గావు. ఈబాలునివిషయమ్మునం గూడ వారివచనమ్ములు వమ్ము గాక యుండవలయుం గాదె?

జయ. ఎన్నటికి నటు కావు. కావున సునందనీ! నీవు లేనివిచారమ్ములు మది నిల్పి యాటపాటలు సరకుసేయ కుండుట సరి కాదు.

కల. జయమాలీ! ఆటపాట లనం దలంపునకు వచ్చెను. వనవిహారంబు సల్పి యెన్నిదినంబు లాయెనమ్మా! ఈదినము వనంబునకుం బోవల దఁటమ్మా?

జయ. సునందనీ! కలకంఠిమాటలు వింటి వఁటమ్మా? నాకు నదియే యపేక్షగా నున్నది. వనవిహారంబున వనటలు పోవును నిజము.

కుసుమవిచిత్రవృత్తము

వనజముఖి భావనమున నెంతో। వనరుట మేలే వనరుహనేత్రా?

వనతలమందుఁ వనితలు గూడఁ। వనమున నాడఁ వనటలు వ్రావుఁ.౯౯

నం. జయమాలీ! వ్యసనగ్రస్త మగుమనంబుతో వనవిహారంబు సేసిన నది యేల రుచియించునే?

సు. సునందనీ! ఈకలకంఠి కడుబాల. అది వనవిహారంబు గోరుచుండెడుతఱి మనము దానికి భంగంబుఁ జెప్ప నగునా? బాలిక లందఱు జత గూడి యాఁడుబాలక్రీడలు సూచినం జాలు మనంబున కెంతో మనసు సంత సం బవుంగాదే?

ఉ. నెయ్యపునెచ్చెలు ల్సరసి నేర్పులు మీఱ నగంబు లెక్కుచో, నుయ్యెల లూఁగుచో, నుదియ నుద్దులు గట్టుచు వియ్య మందుచోఁ, దియ్యనిమ్రానిపండ్లు దరితీపులు మాని తగంగ రాల్చుచోఁ, జయ్యనఁ గేళికూళి జలజంబులు గోసెడిచోఁ గనం దగున్ ౧౦౦

సీ. కాలాహివేణిక ల్కదలఁగ వెన్నాడి బాలానిలము ద్రిమ్మఁగఁ బాఱులీల, ఫలుకులఁ జిలుకలపద్యము ల్సెప్పుచుఁ బల్కరించుచు నవ్వుబాలలీల, యందనిపండ్లకు నఱ్ఱు సాచుచుఁ గొమ్మ లందింప వేమమ్మ యనెడులీల, యద్దంబులోఁ దమయాకారములు గని సుద్దుల ముద్దులు సూపులీల,
ముద్దుమాటలఁ బ్రొద్దులు పుచ్చులీల।నుద్దులను గూడి యుయ్యెల లూఁగులీల
గద్దరించినఁ గన్నీరు గార్చులీలఁ। జూచి సంతస మందనిచూపు లేల? ౧౦౧

సునందనీ! ఇట్టిబాలలీలలం గన్నారఁ జూచి సంతస మందుటకంటెను వే ఱొకసుఖం బున్నదే? కావునఁ గలకంఠిమనోభీష్టంబునకు మాఱు దలఁపక మనము వనవిహారంబు సల్పుటకుం బోవలయు.

నం. మంచిది! జయమాలీ! కలకంఠీ! మీమనోభిలాషంబునకు నే నేల విఘ్న కారి నై యుండవలెను? నగరమ్ము వెలుపట నుండుమనయారామంబునకుం బోయి వనవిహారంబు సల్పి రాత్రి మఱల మందిరంబుఁ జేరుకొందము. ప్రొద్దెక్కె పోదము పదపదఁడు (అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## తృతీయాంకము.

### ద్వితీయరంగము. అరణ్యము.

సుదేవుఁడు. (అంగదేశపురాజకుమారుఁడు.)

ఉ. నాలుకయెండు, నోటఁ దడి నాశనమాయె; నధరంబువాడు; క
ణ్ఠాలయము ల్లయంబు లవు; నాసిక నిక్కెడుఁ; గాంతిఁ దక్కెడుం,
గాలు గదల్ప రాక కడుఁ గాడ్పడు, దేహికి, నెంత పాయమో
నాలియఘోరదాహ! మది నామదిఁ గోరి నిఁ కెంతవారికిన్. ౧౦౮

హా! ఇంతటిదాహంబు నను జంపువైరి కయినను నేఁ గోరను. ఔరా! ఈకాసారవిభవంబు! స్వచ్ఛతరాంబుసంపూర్ణంబు! కల్లోలకలితతోయధ్వానవిస్తారంబు! కంజాతకింజల్కపుంజనితాంతద్యుతిచారుతీరంబు! దూరప్రయాణాతిప్రయాసజనార్తిదూరంబు! ఇఁక నీవనవిభవంబు నందనవనవిభవంబు నపహసించుచున్నయది కంటే?

సీ. సాలజాలము సురశాల లంటెడు, నింక సురసాలముల నేను జూడ నేల?
తాళములోఁతు పాతాళమునకు దిగె, నేల హింతాళంబు లెంచ నాకు?
పూరిభోగ మెడు పొందు గా దనునాకు,సురపొన్నఁ బొగడుట సులభ మగునె?
గానక తిరిగితిరిగి వేసవి యోరెననంగఁ! బున్నాగమున కెద్ది పురుడు సేయ?
టిని. అయ్యో! ఆ ఘోరాటవి! మల్లెపూవుల తావులమహిమ లెన్నఁ
గదా ఇచట నెచటఁ జూచినను గంటే వశ మానెయారయీవనవిభవము.
యది! ఈ దిక్కునఁ బోయెద నన్ననో గలాంబుకాసారవిస్రుతంబు,
నం బోదు నన్ననో చండకరకిరణతప్తసి సుందరమాకందసురుచిరంబు,
దునన్ననో దూరాగమనప్రయాసాతిశయంబుగాంచనంబు,
కెడు. నిలిచెద నన్ననో కిలికిలలం బోలె మ..కేళఫలాదినగయుతంబు,
నికరజ్వాలలు గ్రాలుచు ..హామును దహించెద్భృందోపసుందరంబు,
అలసితి. ! యీవనమందిరంబు.

కేదార గౌళరాగము - రూపకతాళము. ప్లెడిన్

మఱచితివో నను మాధవ! యీతఱి. (పల్లవి)
ఘోరాటవిఁ - జేరి పురి - దారి గన - నీరీతిని॥ ౧॥
కీలిబలె - గ్రాలురవి - జ్వాలలకుఁ - దాళ నిఁక॥ ౨॥ ౧౧౧
అడు గిడ - గడగడ - వడఁకెడు - నొడ లయయో! ॥3॥ ఘనికరల
తోడై కా - పాడ నిను - వేఁడికొను - వాఁడ హా! ॥౪॥ గాకంద
సీగుగన - కీగీతి వ - గీరగతి - తాతాఁ గను॥ ౫॥ బర

రవిందంబు, ననిందితత్రిలోకవందితత్రిదశానందం బగునందనవనంబు, మందార మాకందమకరందరసఝరీపూరంబు, కలహంసకీరమదకోకిలానేక విహంగప్రకూజితంబు, కమనీయకైరవోత్పలకల్హారకలితకాసారంబు, రాజితరాజీవరాజమరాళవిరాజితంబు, నిట్టివనమహిమం బెంతనికో నియాడీనం దీఱును! ఆహా! మార్గాయాసమువలన నెంతయు బడలియుంటిం గానఁ గంటికి నిదుర వచ్చుచున్నయది. ఈభూరుహంబుక్రింద నొక్కింత పండుకొనియెదం గాక. నిద్ర కదా పథికులపరిశ్రమకుం బరిహరణౌషధమ్ము?

ఉ. ఎయ్యది పూరుషావళికి నేఁకటిప్రేయసి రాత్రివేళలం?
దెయ్యది సర్వకాలముల నెక్కుడువంతలఁ గుందువారిమే?
లెయ్యది యద్వితీయసుఖ మెయ్యది యంచు నిరూఢి చేయు? వే
తెయ్యది నిద్ర గాక యది, యెన్నివిధంబులఁ జూచిన న్భువిన్? ౧౧౨

ఇట్టిమహిమాతిశయమానితంబు గదా నిద్దుర! (అనుచు శయనించి నిద్రనభినయించుచున్నాఁడు.) (ప్ర. సునందనీ కలకంఠీ జయమాలులు.)

వృషభగతిరగడ.

**జయ.** నందనం బిదె పో యనం దగునందనంబు సునందనీ! కను.
**కల.** నందనందననందనున కానందదం బిదె సుందరీ! విను.
**సునం.** అంద మలమాకందబృందములందు ఫలముల నందుఁ గీరము.
**జయ.** మందగమనరో! యిందు నందును మందగతిని సమీరవారము.
**కల.** ఏలొకో! కోయిలలు గన్నుల నెఱ్ఱఁజేసెడుఁ బాడుగుణములు?
**సునం.** గోల!పల్లవములను గ్రోలుచు గ్రుడ్లఁ గ్రక్కెడు నగ్నికణములు.
**జయ.** కాదు, సఖి! నీకంఠరవములు కడుపుమంటగ నుండు వానికి.
**కల.** కాదు, కాదన వలదు, నిజ మగుకారణం బిదె మాట లేటికి.
**సునం.** అంచగమనరో! యంచలంచల నంచగుమిఁ గని మన్ని ప్రోవవె!
**జయ** అంచితం బగునాట గఱపు మటంచుఁ బదములఁ బడెడుఁ గావవె!
**కల.** కాంత! కను సేమంతిబంతులకాంతి యింతుల కెంత సమ్మతి!

జయ. అలరువిల్తునియలుఁగుగుము లవి యలరుబోఁడిరో యలరు లం — ? కాదు,
కల. అలికులంబులు నలియునయ్యెడ లలికచా నీ వలిగి చేరకు. ✶ విది
సునం. అల్లనల్లనఁ బోయి మొల్లల నలమి గిల్లవె యలసగమనరో!
జయ. జల్లులాడక కొల్లవెట్టవెఁ జాల మేలనె? సొగసులాఁడిరో!
కల. కొమ్మ! యీవిరిగొమ్మఁ గనవే! ఘుమ్ముఘుమ్మని తావు లలరెడు.
సునం. కమ్మమధువులు చిమ్మునవి వేఁగమ్మెర మ్మిటు చెమ్మ లడరెడు.
జయ. కలికి! కేలికిఁ దగినలికుచముఁ గంటి లికుచకుచా! కుఱంగట.
కల. కలిక లిచ్చెద దాని నియ్యవె కలఁత లేలనె కామినీ! యిట?
సునం. కనవె తిలకముఁ గన్నుఁగొనలను గనకలతికా! కలయఁ బూచును
జయ. తనివి దీఱఁగఁ గౌఁగిలింపవె తనరి కురువకతరువు ననుచును.
కల. పొన్న పూచునె సన్నుతాంగిరో! పొగరునగవులు నగినఁ జూడవె.
సునం. కన్నెరో! ప్రేంకణము పూచునె కలరవంబునఁ బాట పాడవె.
జయ. కినుకచే నీ వేలనే కంకేళిఁ దన్నక యూఱకుండెదు?
కల. వనట ననుచునె యుమియవే యీవకుళ, మేలనె గారవించెదు?
సునం. చిలుకపలుకులు పలుక గోఁగులు చిగురుజిగితోఁ జెలఁగి మెలఁగునె.
జయ. అలుకతో నెదిరించి పలికిన నలరి చాంపేయములు కలుగునె.
కల. మమతతో లేమావి నంటిన మానినీ! మన మలరఁ బూచునె?
సునం. కమలనయనరో! సింధువారము కలయ నూర్పులు విడవ ననుచునె.
జయ. వనజనయనరో! వనవిహారము వలదు, వలదే జలవిహారము?
కల. చనుమిదేచెలి! జలజజాలము చాల గలిగిన నగును హారము.
సునం. సారెసారెకు సారసారససారసంబుల నేల గోరెదె?
జయ. సారసాక్షిరో! సరసత న్గని సరస నుండెడుసరసిఁ జేరుదె?
సల. వనిత! లలితపులతలడోలల వలదె యూఁగఁగఁ బలువిధంబుల?
సునం. వనరుహాక్షిరో! వినుపఁగదె వనవర్ణనాధికభాగ్యలీలల.
జయ. కలకంఠి! మనసునందని యీవనవిభవంబు వినఁ గోరెడిని వర్ణింపఁ గల వటే?

రవిచ. శుకపికశారికానికరసూక్తులు మంగళవాద్యనాదముల్,
ప్రకటితపుష్పమంజరులభాసిలుబాసిక లెంతొ భవ్యముల్?
సకలపరాగగంధములసంపద, లక్క_అ బుక్క_మోదముల్;
రక మగు మాధవుండు,వనరామ వివాహము లాడుచిత్రముల్.

ఇట్టిమాధవవనరమావివాహమహోత్సవంబులు కన్నులకలుములు గా నున్నవి సునందనీ! ఈ శుకపికశారికానికరములకలకలంబులు, నీ నీహార నీరప్రపూరితఝరీతీరంబులు, నీకమనీయకమలకహ్లారకలితకమలాకరంబులు, నీనవరత్నఖచితకందరంబులుం, గలయీమృగమదఘనసారవనసారగంధసారసారభావృతవిహారారామంబుల విహరించుచు యువతులపయోధరములం జాఱుమందమారుతంబు, లహో! యీవిభవంబులు గల యుద్యానవనంబును వివరించి వర్ణింప విరించియుం జాలఁ డన దీని ససాకల్యంబుగం గొనియాడ నాతర మఁటే!

సునం. జయమాలీ! ఝంఝామారుతం బని పేరుం బడసి కులాచలంబులఁ జలింపం జేయువాయు వేలనో యీయారామతీరంబుల భూరుహంబులలో డాఁగి గూఢగామి యై సంచరించెడిని?

జయ. సునందనీ! కారణంబు లేక యెద్దియు నుండదు. వాయువు డాఁగుటకుఁ గారణం బే మనిన వినుము.

ఉ. అంగజసంగరంబుల నవాంగనలం దమిఁ జూడ, వాయు వు
ప్పొంగుచు, గుబ్బసందులకుఁ బోయిన, నాథులు గాంచి తాడనా
భంగురఘట్టనాదిబహుభంగుల సేఁచుచు, ఘర్మనీరధిఁ
గ్రుంగఁగ ముంచి యెత్తి విడఁ, గూడె వనంబుల గూఢగామి యై. [illegible]

సునందనీ! యిట్టిది కదా యీమందమారుతునియుదంతంబు. చెలీ! సునందనీ! ఏలనే మాటాడక ఱిచ్చవడి నిలిచితివి?

సునం. చం. తరుణిరో! యెట్టికాలమునఁ దర్శితిమో గృహసీమ లక్కటా!
యురుతరతాప మెల్లెడల నుగ్రముగాఁ దను వంటి క్రాఁగు; నే
నరయఁగఁ జాల నేమొ, యొక కైనను నిం పని తోఁప దయ్యె; నా
తరమె శరీరభార మిఁకఁ దాల్పఁగ? తథ్యము నమ్ము, కోమలీ! ౧౧౬

జయమాలీ! నా కేదియో చెప్ప నలవి కానివికారంబుగా నున్నదే ఇట్టి దట్టి దని నిర్ణయింపఁ జాల కున్నదాననే.

జయ. ఏమియచ్చెరియపుమాట లాడెద వమ్మా? అది వికార మగునా? కాదు, మదవతులకుఁ గలుగుముదము కా దఁట వమ్మా? (తనలో) ఇఁక నిది త్రోవకు వచ్చినది. నామంత్రంబు పారినది. ఇఁక మాతంత్రిగారికోరిక కొనసాగఁగలదు. అందునకుఁ దగినదోహదంబు సేసెదం గాక. [ప్రచురముగా] సునందనీ!

ఉ. అక్కడఁ జూచి తమ్మ, ముద మార ముదంబులు హెచ్చి పాఱ సొం
పెక్కుచు నుందరాళిసుఖకృత్యములం జెరలాడు భృంగముల్?
ఇక్కడఁ జూడ వమ్మ, మరునీరస మెల్ల నడంచుఁ గీరముల్,
చక్కరమోవి నెక్కుచును జక్కనిరెక్కల నిక్కి సొక్కుచుఁ. ౧౧౭

సునందనీ! ఆయలరులగుత్తులయందలిమధు వ్రేకయాళి గ్రోలి తనప్రియురాలి కిచ్చి మ త్తిల్లి మదనక్రీడల ముద మార మదిఁ దేలుచున్నయది చూచితివే? ఆహా! సారసాక్షీ! చేరువ నుండుసారసహకారభూరుహఫలసారములు మన మలరారం గ్రోలి కీరములు సురతక్రీడలం దేలుచుండుతీరుం జూచితే?

వనమయూరవృత్తము. శ్రీవనమయూరములచెన్నుఁ గన వేమే?
యావనజహారముల నీహఁ గొన వేమే?
యావనవిహారములయింపుఁ గన వేమే?
యావనమె జీవనమె యింతి విన వేమే? ౧౧౮

సునం. జయమాలీ! చాలు చాలు నే నెద్ది చూచినను భయంకరశత్రువర్గంబులోనిదిగనే తోఁచుచున్నది.

[illegible]తతిలకావృత్తము. నా కేవియు న్వలదె నాతిరో యంబుజంబుల్.
నా కేశవందితునినందనునంబకంబుల్,
కేకీగణంబులకు కేకలు భీకరంబుల్,
రాకాసివాసములు రామరో! నందనంబుల్. ౧౧౯

జయ. ననుం బలుకరింపకు నా కెద్దియు న్వలదు.

ప్రశ్నోత్తరరూపసీసము.

సునం. చెలియరో! విన వమ్మ చెవులు చేష్టలు తక్కె;

జయ. [illegible]

సునం. కలికిరో యొద్దియుఁ గన బుద్ధి పుట్టదు.
జయ. కలకంఠములు నలుగడలఁ గనవె.
సునం. ముద్దియరో! యిఁక సుద్దులు చాలింపు.
జయ. చిలుకలపలుకులు సెవుల వినవె!
సునం. వనతలమున నింక మనఁ జాలనే చెలి!
జయ. వనతలంబులఁ జేరి వాసి గనవె.

సునం. గీ. తరుణి నే నిఁకఁ దాపంబుఁ దాళఁ జాల.
జయ. చలువరాయఁడు వచ్చిన శైత్య మొదవు.
సునం. వలదు దోషాకరునిఁ జూడ వలదు చాన!
చాలు సితకరుఁ జూడంగఁ జాల నేను. ౧౨౦

జయ. సునందనీ! నీశరీరతాపంబునకుం బ్రశామకముగా నింతలోఁ జలువలఱేఁడు వచ్చెడు సన్న, వాఁడు దోషాకరుం డనియు, సితకరుం డనియు, వానిం జూడ వల దనియుఁ, బలికెద వది యేలనే?

ఉ. తామస మెల్లఁ గూల్చుఁ, దనుతాపము లెల్ల నడంచు, ధారణీ
భామల కెల్లసౌఖ్యములు భాసిలఁ గూర్చు, సమస్తసృష్టికిన్
ధామముఁ దెచ్చి యిచ్చు, నిరంతంబును వేల్పులఁ బ్రోచుదైవ, మో
భామిని! చంద్రు నిట్లు పలుభాషల నిందితుఁ జేయఁ జెల్లునే? ౧౨౧

భామా! ఇట్టిచంద్రుని గుణసాంద్రుని దూఱెద వేటికే?

సునం. జయమాలి! కన్నకష్టంబులం బడక భూరితరైశ్వర్యంబులోఁ బుట్టినయీ భువిజనులకు నెట్టిదుర్గుణంబు లుద్భవించునో, యట్టిదుర్గుణంబులు సిరితోఁబుట్టువగునీచంద్రునకుం బుట్టె. వీఁ డమృతవదనవిషహృదయుఁడు. వేపచెట్టునం దీపు లేనట్టు విషజనితునకు సుగుణం బుద్భవింపదు గదే.

మ. గిరిజాధీశునియుత్తమాంగమునఁ దాఁ గ్రీడించుఁ గీడెన్న కా
సిరిజేని న్ననుఁ దాఁకి నిల్చు, గురుయోషిద్రత్నముం గూడెడున్,
గరిరాడ్యానలమర్త్య మెల్లఁ గలఁచుం, గారించెడుం దమ్ములన్,
సిరితోఁబుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్? ౧౨౨

మ. సర్వప న్దారలు దారలై సకళలై సాంగత్యముం గోరుచున్
సరవిన్ రాఁ, బురిపుచ్చి వాని, నకటా సంత పలం జేసి, రా

తిరి శూన్యస్థలవాసి యై, కుముదినీస్త్రీఁ గూడుఁ జంద్రుం, డిసీ!
సిరితోఁబుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్? ౧౨౩

మ. హరిణం బంచును, దోషజన్ముఁ డహహా! హాలాహలం బాత్మలో
ధరియించున్, ఘనమార్గ మంచు, బయలం దాఁ దాఁగు, మిత్రాగమం
బరయ న్లానుఁడు, రాకఁ గూడుఁ, గుజవర్గానందుఁ డై నిక్కెడున్,
సిరితోఁబుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్? ౧౨౪

మ. స్ఫురదాచారవిచారమానికులసంభూతాత్ముఁ డై వీఁడె యు
ష్పరవీథిం, గడుసమ్మతం బని సుధాప్రాప్తి న్మదోన్మత్తుఁడై,
సిరిచేఁ జె ల్వగుసోదరీగృహము నాశిల్లంగఁ జేయు, న్భళా!
సిరితోఁబుట్టినవాని కీగుణము సంసిద్ధంబు గాదే భువిన్? ౧౨౫

మ సిరిచే నాసరివారు లే రనుచు వాసి న్బాసి, ప్రద్యుమ్నమున్
పరదారాదులపాలు చేసి, పిదప న్బాండుక్షయాద్యాధులన్
నిరసింప న్బడి, స్వావనీతలమున న్నిల్వంగ లే కేగెడున్
సిరితోఁబుట్టినవాని కీగుణము సంసిద్ధంబుఁ గాదే భువిన్? ౧౨౬

అకటా! ఇట్టిదుర్గుణాధికుం డగుచంద్రునిం జూడ నేలనే? కొనియాడ నేలనే? చాలుచాలు. సూర్యుం డస్తగిరిం జేర నుద్యమించెదు. అదిగో కనుము.

ఉ. పుట్టుచుఁ గర్మజాలములఁ బుట్టఁగఁ జేయును బ్రహ్మరూపుఁ డై.
నిట్టగ నిల్చి కర్మమున నిక్కఁగఁ జేయును రుద్రరూపుఁ డై;
గిట్టుచుఁ గర్మజాలముల గిట్టఁగఁ జేయును విష్ణురూపుఁ డై;
యిట్టిత్రిమూర్తి కర్మనిధి యేగెడుఁ జూచితె పశ్చిమాద్రికిన్. ౧౨౭

జయమాలి! ప్రొద్దు చాల మీఱెను. మనము వేవ్వేఱం బోయి, కుంద మందారవిందాదికుసుమబృందంబులం దెచ్చి, మందిరంబునకుంబోదము.

జయ. సునందనీ! మంచిది నీమనోభీప్సితంబు (ఆలోచనతో కొంతసేపుపైనఁ జూచి) ఊఁ, అనుసరించెదము (వేర్వేఱం గొంతదూరంబునకుం బోయి కలకంఠితో) కలకంఠీ! మనసునందని మనంబుఁ దెలిసికొంటి వఁటే?

ల. మనంబు తెలియు టేమి? ఉద్యానవనంబునం బ్రవేశించినప్పటినుండియు దానితీ రొకరీతిగా నుండెడి. అది యేమో నాకుం దెలియదు.

జయ. నీవు బాలవు, నీ కివి యెట్లు తెలియును? సునందని విరహాగ్నిచేఁ బరిత పించుచు మన కది మఱుఁగుపఱచుటకై యేకదేశంబుం గోరుచున్నది. మన మిరువురము నొకయీరంబునం దూరి పొంచి విందము.

కల. అమ్మచెల్ల! యెట్టిమాట లాడెదవే? పొంచి వినుట మంచిదఁటే?

జయ. కలకంఠీ! యెంతటిగోలవే నీవు?

గీ. చంచలాక్షిరొ వినవమ్మ పొంచి వినుట
మంచిగుణ మంచు వ్రాసె, సమంచితముగ
నంచయానలఫాలతలాన నజుఁడు;
కానఁ జానల కది యుగ్గుతోన గలిగె. ౧౨౮

ఉ. సోదరసోదరీమణులశోభనకాలములందు మానినుల్
సాదర మొప్ప దంపతులయాదటవ్రోవనిగూఢభాషలం
గాదన కుడ్యమంబునను గాఢకవాటగవాక్షపాళుల
మ్మోదితచిత్తులై నిలిచి మోదిప్పడి విందురు పొంచి యిమ్మహిన్. ౧౨౯
కలకంఠీ నీవు బాలవు కావున నీ కిట్టివి తెలియవు. ఊరక నావెంట ర మ్ము. ఈపొదరింట డాఁగుదము. (అనుచు నొకలతాగృహంబున మాటు వడుచున్నారు.)

సునం. (ఏకాంతప్రదేశంబునం గూర్చుండి)

సీ. హా! రామరామ! నేనారామమున దూఱి యారామలను జేరి యారజమునఁ
గోరిక లీరిక లూర ముదం బార గారవంపువిహారసారమతిని
మీఱుచు విహరింప, మితిమీఱి మతిఁ గేరి తీరుగానివికారభార మయ్యె,
గిరగిర మని కులగిరులు తిరుగసాఁగె, నరుదార నాకనం బవనిఁ బడియెఁ,

గీ. దెమ్మెరలశైత్య మక్కటా! దిమ్ము వట్టె, జిలుకపలుకులు చెవులకు ములుకులయ్యె
నళులయులివులు నాకభులయ్యె, నకట! చెలులసల్లాపములుబలుచిలువ లయ్యె.

ఎరుకులకాంభోజి రాగము. రూపకతాళము. [౧౩౦

హా! రామరామ! నే నారామమున దూఱి యారామలను జేరి యారజము
నగోరిక లీరిక లూర వనీకేళిపరనై పరిపరిఖేల పరనై సరి సరసిజాంబక
వృతనై సిరి మీఱి మెఱయన్ అరుదార భోరున నాకసము బల్గిరగిర న్దిరిగెన్
గారునాశరీర మ తఱి మీఱుభగ నొంరెన్ సరివారిసరసాలాపములు

బల్విరనము ల్చెం దెగ మతి యే మొకో మితిమీఱి మనము వికారమును జెందెగ
జొరార! యురుతర ఘోరబాధల మేరమీఱెను దారి గానను కారణం బది
యేనెఱుంగను శ్రీహరీ! యేనేగ మెఱుగను. ౧

అళికిఁ గేకులహాళాహాళికిఁ బకావళికి నలగంధవలికిఁ గరువలికిఁ గళికిఁగ గలకల
మనుచిలుకలబ్రలవలికి నే నులికి యంచలరవళికి నే నళికి వనతలంబులకు నే
బెళికి పలుమారు వెలికి దూరఁ బలికి పలికి తూలి గాలికి ధూళికి నేలపై
వ్రాలి తాలి మెల్లను బ్రీలి బలువిరాళి నేఁ దేలి బాళి మూలి చాల నలసట సో
లి బ్రతిమాలి నేఁ గంటి వింతలు గాలి గ్రాలెడుకీలి యయ్యెను మేలిచిలుకలు
చిలువ లయ్యెను కేళిజలతలములు నాకు హాలహాలము లయ్యె నయ్యో! ౨

అకటా! ఆరామమును దూఱి విహరించినతఱినుండి మితిమీఱుమనో
వికారం బుద్భవించి సరివారిసరససల్లాపంబులు సైతము విరసంబు లై
తోఁచె. కలలోఁ గనినకామసుందరుఁడు కంటికిఁ గట్టిన ట్లగుపడెడు.
ఏదారిఁ బోయిన నేదరి దూఱిన నేగిరు లెక్కిన నేయూరములు సొచ్చిన
నేతరులనీడ నిలిచిన నేకీరములఁ బల్కరించిన నేశారికల హెచ్చరించిన
మీఱినబాధలకు నాకరం బయ్యెం గాని నెమ్మది లే దాయె. మది బెదు
రుగా బదరుచిలుకలదురుక్తులకు మూలకాకులు పెంచినకోకిలలకూఁతల
కు మద మేరి మద వతులపాలిమారులుగా నలచుశారికానికరరవములకు
మధుపానమదమత్తుచే మదిరాక్షులమెదలపైఁ బొదలుతుమ్మెదలధ్వా
నములకు గుండెలు ఝల్లు మనుచు మది తల్లడిల్లుచు నాసుందరునిసం
యోగాభిలాష హెచ్చుచు నాయనురాగరసంబు మనంబునఁ బూర్ణీభవిం
చుచు మిక్కుటమై పొక్కెడుదేహతాపంబుచేఁ బొంగుచు నా కిట్టి దట్టి
దని యెఱుంగ లేనివికారంబులు పుట్టె నే నీవెతలతో నిట నుండఁ జాల.
వైళంబె శీతలసికతాతలంబులఁ జేరెద (అనుచుంబోవుచు) ఏమీ! ఈ
మహీరుహచ్ఛాయ నెవ్వండో మహానుభావుం డొకండు నిదురించుచున్న
వాఁడు! ఆహా! ఇది కదా పురుషసౌందర్యంబు! వీనికి రాజకుమార
చిహ్నము లున్నయవియే! ఏమీ! వీని నే నెచ్చటనో చూచినటు లున్నది!
ఎచటఁ జూచి యుందును? నిన్నటిరేయి నాకలలో వచ్చినకామసుంద

సీ. జిగియొుగులు చూడఁ జిగురుల నగియెడు, నడుము చూడఁగ లేదు పిడికెఁడైన!
మోముచందము చందమామయందము మాన్చు, ననురాగ రాగ మౌరౌర! మోవి!
అఱమోడ్పుఁగన్ను లేయరవిందములఁ గెల్చు, నఱనెల న్గెల్చు నౌరౌర! నుదురు!
చికిలిచెక్కులచెన్ను చెఱుచుఁ జంద్రికకాంతి, చపలాలతానిభచ్ఛాయ మేను;
గీ. నవనవంబులు శ్రీనిధు ల్చెవు లయారె! నవన మొనరింప నవు నౌర! నాసచెలువు!
తరళగళమున కెంతటితరము దరము! మల్లెమొగ్గలచాలుపో పల్లువరుస. ౧౩౧

హా! యితఁడు నాకలలో వచ్చి, కలకాలంబుఁ గాచి యుంచిన నామానధనంబు నపహరించి, యౌవనతలంబున నున్నవాఁడు. ఔరా! వీనియందంబు; గ్రంథంబుల వినుచుండినయాసిరివర సురవర ధనవర పురహర కుమారుల నేమి, యౌవనవర రాకాసుధాకరుల నేమి, యీసుకుమారరాకుమారునకు సరిపోల్పం దరమా? ఔరా! వయోవిలాసభరమా! భళిరే! నా పూర్వభవార్జితపుణ్యంబు నాకై యీరీతిఁ బురుషరూపంబున ఫలించెం గాఁబోలు? వీనిం బల్కరించి చూచెదం గాక. (ఒకయడుగువైచి) ఆ! పరపురుషుని నే నెటు పల్కరింతును? స్త్రీల కది చులకఁదనంబు గాదే? ఏమీ! వీఁడు నాకుం బరపురుషుం డెటు లగు? ఈమోహనుని మోహనమంత్రంబుచే బంధింపంబడినమనంబునకంటెను నాకు వేఱొకమనం బున్నదే? లేదు, లేదు. ఈసుందరునిం గనిననిమిషంబుననే మనంబున నాయత్నంబు లేకయే యొకనిర్ధారణంబు గలిగె. అట్టినిర్ధారణంబు మఱల్పహరిహరవిశ్వస్రష్టలకుం దరంబు గాదు. ఈసుందరుం డలసి సొలసి హాయిగా నిదురించెడు చందంబు కన్పట్టెడు. నిద్రాభంగంబు సేయ నోపఁ? (అని సంశయించుచుండ సుదేవుండు నిద్రలేవఁగా సునందని యొకచంపకము చాటున డాఁగుచున్నది.)

సుదేవుఁడు (సునందనిం జూచి). ఈతొలకరి తళుకుమించుల మించెడునీచంచలాక్షి యీయాంచయాన యెవతె యయ్యుండును?

గీ. మొలకనవ్వులు, నెయ్యార మొలుకునడలు,
తళుకుమెడయును, బట్టిన నళుకునడుము,
కులుకుగుబ్బలుఁ దళతళ బెళుకుకన్ను,
లన్నువులమిన్న చెన్ను నా కెనఁ దరనే? ౧౩౨

ఈబాలకు బాలేందుఫాలకు హరినీలనిభాలకజాలకుం దులతూఁగెడియందం బీయిలలోన యేల నీరేడులోకంబులలో నెచట నేనియుం గలదా? ఈజవ్వని యెవ్వనియం దెవ్వనికై నిలిచియుండునో? ఈకుందరదన సారసవదన నాచేరువ నుండి చంపకతరుమూలంబునం డాఁగె నేలనో?

క. మలయానిలచలనంబుల నలకలు చలియింప, నట్టె యలికులములు బల్కలకల మని యులియుచు రాఁ, జెలి బెగ్గిలి గంధఫలినిఁ జేరె నయారే!

ఇట్టిసౌభాగ్యావయవసుందరీమణినిం గూడనినారూపసంపద లేల? ఈచిలుకలకొల్కినిఁ బల్కరించి చూతునా? ఈకలికి కన్యగా నగుపడెడునే? పల్కరించిన నే మగునో? ఇట్లు సందేహించుచున్నఁ గార్యసాఫల్యం బెట్టు లగు? అటు లసి యేకాంతంబున మఱుఁగువడి యున్నమానినీమణినిం బల్కరింపఁ జెల్లునే? మఱి పల్కరింపకున్న నీమనోరథం బీడేరు టెట్లు? ఆసుందరి కన్య కానిచో నా కిట్టిమనం బేల గలిగెడును? పల్కరించి చూచెదం గాక. (ప్రచురముగా) ఓంచంచరీకాలకజాలక! ఓచంద్రార్ధనిటిల! ఓచారుచమూరులోచన! ఓచంపకకుసుమసమనాస! ఓచంద్రికాసమహాస! నీ వెవ్వరిదానవు? ఈచంపకతరుమూలమునం దేల డాఁగితివి?

సునం. (ప్రత్యుత్తరం బివ్వక యూరక నిలచుచున్నది.)

సుదేవుఁడు. భాస్కరవిలసితవృత్తము.

ఇత్తును నతులకు ఒంపకమా! నీ విత్తెఱవను మఱుఁగిడితి వ దేలే?
చిత్తజశర మనఁ జాలినదానిఁ, జిత్తజుసతిసమ మగుచికటారిం,
బుత్తడిప్రతిమను బోలినదానిన్, భూరిపులినరుచిఘనతరశ్రోణిం,
గుత్తపుఁజనుఁగవ గుల్కెడుదానిం, గోమలసుమతనుపరిమళహారిన్.౧౩౮

గంధఫలీ! ఆచందనగంధి యాగంధగజగామిని యాపూర్ణేందువదన నీయందు డాఁగియున్నది. ఆసుందరాంగి నాతో నొకమా టాడినం జాలును. ఆనాతినిం జూపిన నీకు నతివేలముగ నతు లొనరించెద.

సునం. (తనలో) ఇసీ! ఈపాడుసిగ్గునకుఁగ వంచనమొంగ్రించ నై, పంచదారగతిం జవులొల్కించుపల్కులయాపంచశరాకారుని, నీసంచున నుడికించుట మంచి దగునె? (అనుకొనుచుఁ జెట్టుచాటు వాసి యొక్కించుక యభిముఖముగ నిలచుచున్నది.)

సునందనీ సుదేవుల ప్రశ్నోత్తర సీసము.

సుదే. అయ్యారె! యతివరో! యెయ్యది నీపురి? యెయ్యది నీనామ? మెద్దికులము?
సునం. భూప! కళింగాఖ్యభూపాలకన్యను, ధర సునందని యనఁ దనరుదాన.
సుదే. జవ్వని! యివ్వని నెవ్వనికై నీవు నిలిచితి? వది నాకు నిజము చెపుమ.
సునం వనికేళి సల్పను వచ్చితి సఖులతో, వసుధ యెయ్యది? తమవంశ మెద్ది?
సుదే. అంగరాజ్యము నేలుమంగళాంగునికూర్మిసుతుఁడ సుదేవుఁడసూత్న్మమధ్య.

సునం గీ. ఏకతము మిముఁ దెచ్చె ని క్లేకతముగ?
సునం వేటకై వచ్చి యడవిని వేఱుపడితి.
పరిజనులు వెదకుచుందురు పరుగిడవలె
సఖియరో! నన్ను విడనాడి చనుట మేలె? ౧౩౫

సునం. రాజకుమారా! కుసుమాపచయంబునకై ప్రియాళులు వేర్వేఱం బో యిరి. ప్రొద్దయ్యె వేవేగ వారిం జేరవలె.

సునం. సుందరీమణీ! న న్నీరీతి విడచి నీవు నీవారిం జేరిన నీవియోగతాపంబున నే నావారిం జేరనే? (ప్రక్కనున్న చెరువుం జూపుచున్నాఁడు.)

మానినీవృత్తము. చంపకగంధి! కలంపకు వేడెదఁ, జక్కని తేనియపల్కులతో సొంపులు చూపక, యింపుల ముంపక, సుందరి! పోయెద నందు; మరుం డంపర నేయ, నిలింపులగుంపులకైన సహింపఁగ శక్యమె? యీ అంపులు గా, వనుకంపముఁ బూనుము, అవ్వలఁ బెట్టకు; రావె సఖీ! ౧౩౬

వనజానన! నినుం గనుగొనినది మొదలు మనమున మన రానిమనసిజు బాధలు పెనఁగొనె; తాళఁజాల. ఇఁక ననుం గరుణించి రక్షింపుము. నీకు దక్కినవాఁడ; నీపాణిగ్రహణంబు గోరెడువాఁడను. నను రక్షింపుము.

సునం. రాకుమారా! ఈగారవంపుమాటలు నావీనులకు విందులుగా నుండి నను, మనంబున కతికష్టంబులు గా నున్నవి.

సుదే. జీవితేశ్వరీ! అది యేల? నీమాటలు చిత్రంబులుగా నున్నవి!

సునం. రాజకుమార! నేను వ్యసనగ్రస్తను అఖిలసుఖానందనిరతు లగు దేవర నన్ను గోరం జనదు పుణ్యవంశంబునం బుట్టినతమయట్టిమహానుభావులు లోకోపకారార్థం [illegible]

మ. అకటా! కోరఁగ నేనె భూరితర చింతాక్రాంతమై యున్నక
న్యకను న్దాకఁగ? శక్యమే యురగపీడాయత్త మాౚదవ్యమున్?
సకలోర్వీతల మెల్ల నేలుచు, మహాసౌఖ్యంబులం గాంచి, యో
యకలంకాధికరూప! లోకనుతిచే నానందముం బొందుమా ౧౩౭

రాకుమార! ఇట్టివ్యాకులాయత్తచిత్తను ననుం గోరి దేవర యేల వ్యసన
గ్రస్తులయ్యెదరు?

సుదే. (ఆత్మగతముగ) ఈసుందరికి వ్యసనకారణం బే మయ్యుండునో! చూచిన
తోడనె నామనం బీమెయందు లీనమై యున్నది. ఇట్టిసుగుణమణికిఁ గల
వ్యసనోదంతంబుం దెలిసికొని దానిం దీర్పనినాఁడు నాపౌరుషం బేటికి?
కాల్పనే? (ప్రచురముగా)

మ. అలినీలాలకజాల! యేల? గుణశీలా! చింత నీ కేటికిం?
దెలియం బల్కవె, జాల మేల? మలక ల్దీర్పంగ నేఁ జాలుదున్;
లలనా! కాలవిలంబ మేల? వగ లేలా? తెల్పు శీఘ్రంబుగం;
గులశైలంబులు పెల్లగించుటొ? ఇఁక న్గూపార మింకించుటో? ౧౩౮

సునందనీ! నీవ్యసనంబునకుం గారణం బేమి? శంకింపక తెల్పు మా.
జా గేల చేసెదవు?

సునం. రాజపుత్ర! నావ్యసనంబు నీకును వ్యసనకారణం బగుం గావునఁ దెలుపు
టకు నోరు రా కున్నది.

సుదే. అటు లయిన నాకు వ్యసనత్రయంబు గలిగించినదాన వగుదువు. నీదుః
ఖంబుఁ గనుట మొదటిది. అందులకారణంబు తెలియమి రెండవది. న
మనోభీష్టుండ నౌట మూఁడవది. ఇట్టివ్యసనాగ్ని త్రితయమునకు శేకంబు మా
హుతి సేయుట నీకు ధర్మం బగు నేని నీవ్యసనంబుం ద్పరి గొనుచున్న వని

సునం. సుందరాంగా! అట్లయిన నీకే యత్నంబు లేకయే ము వచ్చెద. సెల విమ్ము.

సీ. వినుము రాజకుమార! విన్నవింతును నాదు వ్యసనంబునకు సునందు నీవు నా
నాతల్లిదండ్రులు నాతమ్ముఁడును నేను నడవికి వేటకుగమె రమ్ము, పొమ్ము, సో
నిద్రించుచుండంగ, నినువు తమ్ముఁడు వ్రాయెఁ గాన్ను; ధరిత్రి నీవు గు
నాతలిదండ్రులు నాకుఁ బటముఁ గటి, ఘోరా...

గీ. రక్కటా! యిట్టికష్టము లనుభవింపఁ దగిన దిది, యని వ్రాసె నాధాత నాదు
నొసట, నదికని యోర్వంగ ననదె? యిట్టి కష్టతర మగుబ్రతు కెట్లు కడపుదాన?

గీ. రాజవంశంబున న్బుట్టి తేజరిల్లి, తల్లిదండ్రుల, నెడఁబాసి తమ్ముఁ బాసి,
వనరుచును రాజ్య మేలుము వనిత! యనుచు, ఫాలమున వ్రాసె నాపాపి బ్రహ్మ.

సుందరాంగా! నాఘనతరవ్యసనవృత్తాంతం బిట్టిది [౧౮౦

సుదే. తురంగ వృత్తము. వనజనయనరో! వలదు వల దిఁక వంత మానవె మానినీ!
వనతతిని సత మరసి కనుఁగొనువాఁడ నీయనుజన్మునిన్.

సునం. కనఁగఁ దమ కెటు లవును శిశువును? గానలే కిటు రానిచో,
మనము గలఁచెడి వగలభర మెటు మానుదాన మహీవరా?

సుదే. సునందనీ! నీ కట్టిసందియంబు వలదు. ఎట్టులో కాని యీరాచపట్టి
ప్రాణంబున నుండు ననుశుభసూచన నా కగుపడుచున్నది. నెఱవేఱఁ గల
కార్యంబున కిట్టియుత్సాహంబు పుట్టుచుండును చింత వలదు.

సీ. వనజాతవదన! నీ వనవరతం బిటు వనరుటఁ జూడంగ వశమె నాకు?
నేను నీవాఁడనే, నాన యేలనె నీకు? మానినీ! వల దనుమాన మింక;
సోదరువార్త కృశోదరి! తెచ్చెద, సాదరంబునఁ బంపు సదయ వగుచు;
నాలునెలలపైన నాలుదినంబులు మీఱక నినుఁ జేరి మెలఁగువాఁడ.

గీ. అటుల గడువున రాకున్న ననుజువార్త లంబుజాక్షిరో! తేకున్న నవనిలోన,
నేను లే నని తెలియుమా నిక్కముగను హరిహరి కోమరునాన హరిహరు లాన చాన!

కన్నెరో! కన్నీ రేల మున్నీరుగాఁ దొరఁగెదవు? మానినీ! మోహంబున
నాడినయుత్సాహంపుంబలుకు లని తలంపకు. ఆమహనీయు లగునీతలిదం
డ్రులకష్టంబులు వినినతఱినుండి వారికి హర్షంబుఁ గలిగించి నే నెపుడు
నీమన్నన లందెదనా యనుకుతూహలంబు నామనంబున నిండి యున్నది.

సునం. రాకుమ వేణీ! తల యెత్తి చూడ వేలనే?
నన్ను, మనం తల యెత్తి చూడ వది యేలే? బాల! నే నీయిల

సుదే. జీవితేశ్వరి! అ మచు, నీదుసోదరుని వేగం దెత్తు సందేహము
! యేల నీకుఁ దొరుగం గన్నీరు మున్నీరుగాఁ?

సునం. రాజకుమార! నే ము వంత నీజనకులం బూజించి వేఁ దెచ్చెదన్. ౧౮౩
నన్ను గోరం జనదు మహోత్సాహసంబున కుత్సాహంబుగా నీమో మెత్తి
లోకోపకారారంబు [illegible] పాలింపంగనే!

సునం. రాజపుత్రా! యని ప్రత్యుత్తరంబు నిచ్చుటకును నోరురాకున్నది.

సుదేవుఁడు. సుందరీ! ప్రత్యుత్తరం బివ్వ నోపనికారణం బేమి యున్నదే? పోయి ర మ్మనినఁ జాలు పోయి వచ్చెద; ననునామాటకు మంచి దనినం జాలుఁ గా. మాటాడ నిష్టము లేకున్నఁ దల యూచినం బోవదే? అదియె నీసమ్మతం బని నేఁ బూనినకార్యమ్ము పండించుకొని రా నోపుదుం గాదే?

సునం. సుందరాకారా! స్త్రీలు లజ్జాళువు లని తెలిసియు న న్నేల యీరీతి బిడియపెట్టెదరు?

సుదే. సుందరీ! ఇందులో బిడియపడునంతటిమహాత్కార్యం బేమి యున్నదే?

సునందని. సుందరా! బలవంతంబున నీరీతిం బలుకు మనిన నేఁ బలుక కుండుట ధర్మంబు గాదు.

ఉ. నీదుశరీరకాంతిరుచి నీదువిలాసవిహారలీలలున్
నీదుమొగంబు లేనగవు నీదుగుణంబులు చూచి, నిక్క మా
నాదయితుండ వీ వనుచు నమ్మినదానను వాఙ్మనంబులన్,
సోదరుఁ డె మ్మనంగ మన సొప్పదు, వ ద్దనఁ జాల, నె ట్లొకో! ౧౪౪

సుదే. సతీమణీ! నీయట్టిహితయుతమతి నీక్షితిలోనఁ గాన, నినుం గనినంతనే నీగుణాతిశయంబులు చూచినంతనే, నీయనురాగపూరితవాక్కులు విని నంతనే, నే నీయిలలోఁ గలసుఖము లన్నియు నందితి నని తెలిసితి.

మణిగణనికరవృతము. అతివరో తెలిసితి నతిశయ మగునీ।
హితయుత మగుమతి, నితరులకును నీ।
మతి కలుగునె? సతి! మహి నినుఁ గని యం।
దితిఁ గలసుఖములు, దెలుపఁగ వశమే? ౧౪౫

సుందరీ! నాపై మోహాతిరేకంబు సోదరునిపైఁ బ్రేమాతిరేకంబు మాతాపితరులపై భక్త్యతిరేకంబును నీమనంబున ముప్పిరి గొనుచున్న వని యెఱుంగుదు. సునందనీ! విచారంబు వలదు. పోయి వచ్చెద. సెల విమ్ము.

సునందని. చం. గురుతరసద్గుణాకరుఁడ! కోరితిఁ జిత్తమునందు నీవు నా
వరుఁడ వ టంచుఁ, గాన నను వారక వేగమె రమ్ము, పొమ్ము, సో
దరుశుభవార్తఁ దెమ్ము; సుఖదాతవు గమ్ము; ధరిత్రి నీవు [illegible]

సుందరా! నినుం గోరినదానను, వరించినదానను, నీశుభంబుఁ గోరెడు దానను, నీకై పతీధర్మనిరతురాల నై యుండుదానను, నీరాకకై గడియ యొకయుగముగాఁ బ్రతీక్షించు చుండఁగలదానను, గాన శుభాంగా! శీఘ్రంబున మరలి వచ్చి నామనోహర్షంబు గావించెద వని నమ్మి సదా శ్రీహరి చరణారవిందములు డెందంబున సేవించుచుండెద.

సుదే. సుందరీ! విచారంబు వలదు. వైళంబె మరలి వచ్చెద. సునందనీ! నీసోదరునియాకారలక్షణంబుల దెలుప వైతివే?

సునందని. సుందరా! ఆబాలునికిఁ గుమారచక్రవర్తిచిహ్నా లెన్నియో యున్నియుం గలవు పైఁగా నాయాకారంబు మనంబున నుంచుకొనిన వానిస్వరూపచిహ్నాంబులు వేఱుగఁ జెప్పవలసి యుండవు. ఇఁక యొకవిశేష మున్నది వినుము. నాసోదరునికిఁ బాదతలంబునఁ జిన్నిపుట్టుమచ్చ యొక టున్నది.

సుదే. సుందరీ! ఇఁక జాలును నేఁ బోయి వచ్చెద.

సునం. సుందరాంగా! గడువు మఱవఁ దగదు సుమీ.

సుదేవుఁడు. నాప్రాణంబునకంటెను దానియెడ నెక్కువమక్కువ యుంచెద. ఇఁకఁ దడవు సేయకు దేవీ! నేఁ బోయివచ్చెద (అని సుదేవుండు వెళ్లిపోవు చున్నాఁడు)

సునం. గీ. బాధఁ జెందునాదుబాములు వాపినభావజోపమాను భాసమానుఁ జూపి యంతలోనె పాపె నక్కటకటా! పాడుబ్రహ్మ యేమిపాపమో యిది? హా! సుదేవా! పలుదిక్కులఁ దిరుగుచుఁ బలవరించుచుఁ బరిపరివిధములఁ బరితపించుచున్ననాబాధ లన్నియు నినుఁ గన్నతోడనె సన్నగిల్లె. పటాపంచలయ్యె. నీతోడ భాషించినతోడనె తొలఁగిపోయె. నీసరస నుండుతఱి వానియునికియే మఱచితి. సుందరా! నినుఁ బాసినతోడనె యీపాడుబాములినుమడియై మరల ననుం బెనఁగొని బాధింప సాగె, నిఁక నేమి సేయుదును? హా! మాటలసందడిని వేళ మఱచితి సఖులు నాకై వేచి యుందురు. మందిరంబులకు మరలుసమయం బయ్యె. (అనుచుఁ గొన్నిపూవులు గోసికొని చెలులఁ గలయఁ బోవుచున్నది).

జయ. కలకంఠీ! సునందనివిధ మెల్లఁ గంటివే? మంచిది. వినినవార్త లెవరికిని దెల్పకుమీ ఏమియు విననిదానివలె నుండుము. కలకంఠీ! మనము వే [illegible]

కల. జయమాలీ! మనసునందని కుసుమాపచయంబునకు చేర్వేఱం బోవలె ననినంతనకుం గారణంబు దానివిరహతాపం బని పలికితివే? ఇపుడు నీ వేల వేఱుగఁ బోఁ గోరెదవే? అనుదేవునిం జూచినతఱినుండియు నీకును విరహతాపం బగ్గలం బయ్యెం గాఁబోలు నేమి?

జయ. కాదు, కాదు. సఖీ! సునందని వచ్చునంతలో మనము నలరులం దెచ్చి యుంచవలయు నని య ట్లంటిని. ఒంటరిగా నీవు పో నేరకున్న మన మిరువురముం గుసుమంబులు గోయుదము పద. (అనుచు సుమంబులు గోసికొని సునందనిం గలయఁ బోవుచున్నారు.)

సునం. జయమాలీ! ఎంత ప్రొద్దాయెనే? కుసుమాపచయకుతూహలంబున వేళ మఱచితిమి సుమీ!

జయ. సఖీ! నీవు వలచినవరకుసుమంబు సంఘటించె నఁటే?

సునం. (తనలో) ఏ మిది! వరకుసుమ మనుచున్నది! రాజపుత్రునితోడి నా సంభాషముం జూచి యుండదు గద? మఱే! ఎట్లు చూడఁగలదు? ఏమో; కుటిలబుద్ధి గదా? చూచినను జూచి యుండును. సరి, చూచెఁబో, నన్నేమి చేయఁ గలదు? ఇసీ! నిర్నిమిత్తంబుగ నీవలవనివిచారంబు లేల? ముందుగ నే నెందునకు బైటఁ బెట్టుకొనవలె? ఇందాఁకఁ దమ్మునిది తక్కవే ఱొక్కచింత లే దంటిం గాదె? ఇపుడు నేన చెప్పికొన్న నవ్వ కేల తక్కుదురు? తెలిసి యడిగినఁ జూచెదం గాక ఒకవేళ మేటిప్పూ వని యే యడిగి యుండు నేమో? [ప్రచురముగా] చిక్కఁ జిక్కె. ఇదిగో చూడుము. జయమాలీ! సాయంకాల మాయెను. ఇఁక మనమందిరంబులకుం బోదము రారండు. (అనుచు గృహంబులకు వెళుచున్నారు.)

---

తృతీయాంకము.

తృతీయ రంగము.

(మంత్రిమందిరము) జయమాలి.

జయ. (స్వగతముగ) ఆహా! అనుదేవుం డెంతరూపసి! ఆమహోన్నుబ్బావునందు [illegible]

కాఁబోలును! సూదంటుఱాయి లోహంబునుం బలెఁ జూచినమాత్రనె నామానసంబును వానిరూపం బాకర్షించెం గదా!

ఉ. చిత్రరరూపులం బురుడు సేసెడునానవమోహనాంగుఁ, డ
చ్చిత్రజరూపుఁ, డాసతులచిత్తమనోహరమూర్తి, యెవ్వ డ
చ్ఛాత్రినరీతి నామదిని నుండ, భళీ! యని సంభ్రమించితిం;
జిత్తజచోరుఁ డట్టిలిఁ జిత్తధనంబు హరించె; నక్కటా! ౧౪౮

కం. అంగజసంగరమున నాయంగజసమరూపుఁ గూడ నధికతరేచ్ఛం
బొంగనియంగనరూపము, కొంగలసింగార, మడవికోయిలయేలల్. ౧౪౯

మాలినీవృత్తము. నెలకు నెలకు మాఱుల్ - నీరధి న్దూఱి పాఱుల్
బెళుకు నహులఁ జూడన్ - భీతిచేఁ జంద్రుఁ; డిస్సీ!
యలమొగమున కీడే? యాతనిం బొంద నెంతో
కులుకున్నపసుతల్ హా! కోరి యెట్లోర్తుఁ జూడన్? ౧౫౦

ఎటుల నాసుందరుని సునందని పొందునో నేఁ గందును. అద్వితీయబుద్ధి చాతుర్యం డగునాతండ్రి యుండ, నతులితసత్వశాలి యై యుగ్రసేనుం డుండఁ, జటులతరకుటిలోపాయనిపుణ నై నే నుండ, నెట్లు లాసుందరుండు సునందనికిం బ్రియసఖుం డగు? సునందనికిం బిచ్చికుబేరుఁడే గతి. ఆ సుదేవుండు ననుం జేపట్టునంతవఱకు నాకీహారము లేల? విహారము లేల? యాహారము లేల? వలదు, వలదు. (అనుచుఁ జింతించుచు నాభరణాదు లందీసిపారవై చికూర్చున్నది. సుమతి ప్రవేశించుచున్నాఁడు.)

సుమ. కం. అమ్మరో! యెక్కటి నీవిటు! నెమ్మది చెడి మోము వాడి నేత్రమ్ములనీర్
గ్రమ్మఁగ విన్నఁదనము వ్యస! నమ్ముం జెందంగఁ గారణ మ్మది యేమే? ౧౫౧
తల్లీ! జయమాలీ! ఏలనమ్మా! నీముఖవిలాసంబు చెడినది? నీశరీరంబు తాఱినది? తల్లీ! నీహీరహారావళు లేమాయెను? భాసురాభరణంబులు శరీరంబునకుం బలు వాయెనే? చీనీచీనాంబరంబు లుండ మాసినచీరలా తనయా నీకు భూషణాంబరములు? ఆటపాటలు విడనాడి యాకులపాటు నొందం గారణం బేమి కలిగెనే? తనయా దుఃఖింపక దుఃఖకారణంబుం దెలుపుము. చూచితివే సునందనిపై వ్యామోహమ్మున సర్వకాలంబు దాని స్మరణమే సేయుచు సర్వంబును దానిమయం బని। పేలుచుఁ గుబే

రుండు వచ్చుచున్నవాఁడు. (కుబేరుఁడు ప్రవేశము.)

కుబే. దోదకవృత్తము. చిక్కితె మారునిచిన్నికటారీ!
దక్కితె నా కిఁక దాటు మిటారీ!
యక్కునఁ జేర్పవె యాణివయారీ!
యక్కఱ తీరునె యంగజనారీ! ౧౫౨

హా! సునందనీ! ఈనాఁటికి నాకుం జిక్కితివే! ఇఁక నాకుం దక్కితివే! అక్కునం జేర్చి యక్కఱ దీర్చికొనియెద. (అనుచు సుమతిం బట్టుకొనుచున్నాఁడు.)

సుమ. కుబేరా! చాలు నీయున్మత్తకృత్యంబులు; నే నీతండ్రిని సునందనినికాను.

కుబే. స్వాగతవృత్తము. ప్రీతిఁ జూచు టది రీతి సుగాత్రీ!
నీతి కా దిఁకను నీరజనేత్రా!
భీతి యేల నిఁక భీతమృగాక్షీ!
నాతి! యేలు మిఁక నా హరిణాక్షీ. ౧౫౩

సునందనీ! నన్నీరీతి నేఁచు టేలనే? (అనుచుం జయమాలినిఁ బట్టుకొనఁ బోవ సుమతి నివారించుచున్నాఁడు).

సుమ. కుబేరా! నీ కెంతటిపిచ్చి పట్టెనురా? ఉన్మాదరసంబు తల కెక్కినది కాఁబోలును? అది సునందనియా? నీయనుంగుంజెల్లెలు జయమాలి కాదఁటరా? ఇట్లు భ్రాంతుండ వైతివిగా! ఊఱక యుండుము. సునందనిం దెచ్చి యిచ్చెద. ఇంచుక వేచి యుండుము. జయమాలీ! నీవ్యసనకారణంబు దెలిపి నాయుడు కార్ప వైతివి గద?

జయ. తండ్రీ! నీతోడ నే నే మని తెలుపుదు?

సుమ. తనయా! నాకును దెలుపఁ గూడనిరహస్య మఁటే యది?

జయ. ఔను. తండ్రీ! నీకుం దెలుపం గూడనిరహస్యమే నిజము. అయిన నది రహస్యం బని నీకుం దెలుపక నిలుపఁ జాలక మనమ్ము తత్తరించుచున్నది.

సుమ. తనయా! అది యెట్టిరహస్యం బైనను నాకు మఱుఁగువఱచుట సరి కాదు. నీవిచారం బెట్టిబెట్టిద మైనను నేఁ దీర్చెద దుఃఖింపకు. హీరహారావళులం బూని సారసాక్షులం జేరి యాటపాటలతో సుఖించుచుండుము.

జయ. నాన్నయ్యా! నా కేదియుఁ వలదు.

సీ. వలదు పాటలు నాకు, వలదు మాటలు, చాలు వల దిఁక, నాటలు వలదు తం
డ్రి! ఏల విహారము లేల నాహారము? లేల నీహారము లేల గృహము?
వనమున నే నొకవనరుహనయనునిఁ గనుఁగొంటి హరియించె మనము నతఁడు;
అన నేమి మనసునందని వాని వరియించి తనవానిగాఁ జేసికొనియె నకట!
అంగరాజ్యము నేలుమంగళాంగునికూర్మి శృంగారసుతుఁడు శుభాంగుఁ డతఁడు

గీ. బాలు జయపాలుఁ దెచ్చెద భామ యాఱునెలలపై నాఱుదినములు నిండులోన
ననెడుబాసలతోఁ బోయె నకట! యతఁడు వానిఁ గూడక మన నిఁక వశమె నాకు?

తండ్రీ! ఆసుందరునిఁ జూచినతోడనె నామనంబున వెక్కసం బగువలపుఁ బెక్కువలు పెక్కు లక్కునం బెనంగొనె. తండ్రీ! ఈవిషయంబున నింతకు నెక్కువ నీకుం దెలుపం జాల. ఆసుందరుఁడు సునందనిం బరిణయంబు కాక నన్ను వరించిననే నే జీవించెద. కాకున్న నాత్రోవ నేఁ జూచికొనియెద. సప్తసముద్రంబు లింకి పోయెనే? సప్తకులాచలంబులు క్రుంగెనే? ఘోరారణ్యంబులు నీ ఱయ్యెనే? ఘోరమృగంబు లరుదాయెనే? అహిసమూహంబు లన్నియు శాంతి వహించెనే? అగ్నికి శైత్యంబు గలిగెనే? విషం బమృతం బగునే? కత్తిధార మెత్తవడెనే? ఉఱిత్రాడు కఱు వాయెనే? వాపీకూపతటాకాదులు వట్టి పోయెనే? చూతము. తండ్రీ! తెలుపం దగిన దంతయుం దెలిపితి. ఇఁక నాయాస తక్కితిము.

కుబే. (ఘిపాలున లేచి) సుకాంతివృత్తము. ఇదే యసిఁ । మదాన్వితుఁ
సుదేవునిఁ । విదేహునిఁ ౧౫౫

చేసెదఁ జూడుము. (అనుచుఁ జేరువ నుండు నొకకత్తి చేతం బూని పరుగిడుచున్నాఁడు.)

జయ. తండ్రీ! కుబేరునిం బట్టింపుము. వాఁ డాసుదేవునిఁ జంపం బోవుచున్నవాఁడు. తండ్రి శీఘ్రమ్మున లెమ్ము. పొమ్ము. ఆసుదేవునితోడ నాప్రాణంబులుం బోవుం జుమీ

సుమ. (లేచి పోయి మఱలి వచ్చి) జయమాలీ! చింతింపకు. వానిం బట్టి తెచ్చుటకు భటుల ననేకులం బంపితి వాఁ డేలనో యున్మత్తుం డయ్యె. మంచిమందు లిప్పించెదం గాక.

జయ. తండ్రీ! మందులకుం బోయ్యెడిరోగమా యది? సునందనిపై వ్యామోహంబుచేఁ గలిగినరోగము కావున, దాని నెటు లయిన వానికిం గట్టి ప్రతికించుకొమ్ము

సుమ. జయమాలీ! ఆవిషయంబున నేఁ జేయుప్రయత్నంబు లన్నియు విఫలంబు లయ్యె ఇఁక నేమి సేయువాఁడ? కానిమ్ము మఱికొన్నియత్నంబు లాలోచించి యుంచితి అవియు నిష్ఫలంబు లైనచో, నీదాసానుదాసుం డుగ్రసేనుం డున్నవాఁడు కాఁడే.

జయ. నాన్నయ్యా! నీకు నమస్కరించెద ఇఁక నాకు రాత్మకునిపేరు నాయెదుట నుచ్చరింపకుము.

మ. అనఘా! కీలికి నాజ్యధారగతిగా, నాయుగ్రసేనాఖ్య, నా
మనముం బ్రజ్వలితంబు సేయు, నిఁక నీమాయల్ మహాజాలముల్
చన; వాపందవికారము ల్మదిరె, నే నైరింపఁగాఁ జాలఁ, బో
లనివాని న్గడుఁ బెద్దఁ జేసితివి శీలంబు న్గులంబుం జెడన్. ౧౫౬

సుమ. తనయా! తొడఁగినకార్యంబు లింకను బెక్కు లున్నవి. కార్యంబునకై గాడిదెకాళ్ళులం బట్టుకొనక వసుదేవునంతవానికిం దప్పెనే?

మ. అదె నాఁ డచ్యుతుజన్మకాలమున నాద్వారంబుకా పున్నగా
డిదె వాపోవఁగ, నన్నుఁ బ్రోవు మని పట్టె న్గాళ్లు కీడెంచ కా
యదువంశోత్తమునట్టివాఁ, డకట! నాకా యింక నీదోషముల్?
తుది ముట్టంగనె కార్య మెల్లఁ, బిదపన్ దుఃఖంబు మాన్పున్ సుతా ౧౫౭

తనయా! కార్యంబు మనది కావున నింకం గొన్నిదినంబు లాయుగ్రసేనునిసరస సరససల్లాపంబు లాడుచుఁ, బగటివేషధారులవగ వగలం గులుకుచు, వెలయాలిరీతి రిత్తమోహంబులు హెచ్చించుచు వానిమనంబునకు మెచ్చుగ నుండుము కార్యంబు తీఱినచో వానికి వచ్చుభంగంబు నీవుం గనియెదవు గాక

జయ. క. మానప్రాణధనంబులు|మానవులకు సొమ్ము, లందు మానము సొమ్మౌ
మానినులకు, నటు గావున|మానము నా కేల దానిమాయలు తండ్రీ

తండ్రీ! ఇది బహుకష్టకార్యంబు. ఆమానహీనునితో నే నీరీతి నటించుచు నా కవమానంబుగా నున్నది. పరిగాగు వినిన నగుబాటు కాదా?

సుమ. కం. మానావమానముల నభి।
మానముతోఁ జూచి కార్యమానము దెలియం।
బూనుదురు లోకు లెచ్చటఁ।
గానవె? యీనీతి హితము కార్యపరులకున్. ౧౫౯

తనయా! కార్యసాధనయందు మానావమానంబులం దభిమాన ముంచి నమానవుం డిమ్మహి నెక్కార్యంబును సాధింప నోఁపండు. కావున నీ వట్టిదురభిమానంబు వహింపక నాయాన లన్నియుఁ గొఱఁత లేక సేయుదు వేని నాకు రాజ్యప్రాప్తియు నీకు వరప్రాప్తియు నగు. నటు చేయకున్న నీరెంటికిం జెడుదుము సుమీ

జయ. తండ్రీ! నీమాటలు నిజము, ఆసుందరుని సుదేవునిం బొందుటకై నీయాన లేవి యైనం జేయుదు నమ్ముము.

సుమ. అటు లయిన నెమ్మది నుండుము. నేఁ బోయి వచ్చెద. ముందు జరుగఁదగిన దేమియో యోచింపవలసి యున్నది. (సుమతి వెళ్లుచున్నాఁడు.)

జయ. (తనలో) ఇక్కడికి నాకడుపుమంట తీరినది. కర్తవ్యమును నాన్నయ్యకు నివేదించితిం గదా? ఇఁక నారొట్టె నేతఁ బడ్డట్టే. సంశయ మేమి? సుమతి తలపెట్టినకార్యము నెఱవేర దేని, లోకము లెల్ల దిర్దిరం దిరుగవే? నాపాశములో నే యొలికినది. తనివి దీఱ నాయపరకామదేవుని సుదేవుని కౌఁగిట నులిమెదం గాక. తమ్మునిచింత దక్క వే ఱొక్కటి లేదని టక్కరికూఁతలు కూయుచు నిక్కవమ్ము డాచినటక్కులాడి యగునా సునందనమ్మగారి మిడిసిపాటిఁకఁ గనుగొందుం గాక (వెళ్లిపోవుచున్నది.)

---

## తృతీయాంకము.

### చతుర్థరంగము.

మంత్రిమందిరము - సుమతి

సుమ. (తనలో) ఏమి యిది యుగ్రసేనుం డింకను రాక యున్నవాఁడు? వాఁడ

కుబేరుఁడు సునందనిపై నుండుమోహంబుచేత నున్మాదంబు హెచ్చి పిచ్చి వానింబలెఁ బట్టువడక తిరిగెడు. వాని నెటు లయినం బట్టుకొని మంచి మందు లిప్పింపవలయును. వానికి మంచిమందు సునందనిపొందే కదా? సునందని సుదేవుం డనువాని మోహించిన దఁట. ఆసుందరుని నాసుత జయమాలి సైతము మోహించినది సుదేవుండు రాకుమారుం డఁట చక్రవర్తిచిన్నె లుండువాఁ డఁట. ఇంచుమించుగ జయపాలునిం బోలు సౌందర్యశాలి యఁట. ఇవి యన్నియు నిజ మఁట. ముందు సేయం దగిన దేమి? (ఆలోచన మభినయించి) బలే! ఈయోచన బాగుగ నున్నది. ఇది ఫలించిన రెండురాజ్యంబులు నాదండనకు లోఁబడి యుండు. ఒకరాజ్యంబు నా దనుట కిపు డేసందియంబును లేదు గదా రెండవరాజ్యము నాది యగుటకు మాత్ర మేమి సంకోచ ముండును? సుదేవుండు నాతనయను బెండ్లియాడ సమ్మతింపఁడా? నయభయము లుండఁ గారాగృహంబు లుండఁ గష్టదండన లుండ నొకబాలునిసమ్మతిఁ గొను టేమి కష్టంబు? ఇఁక సునందనివిషయమా! అది కుబేరుని మోహించునా? మోహించి వరింపవలె ననునది సిద్ధాంతమా? వేఱొకవిధ మయిన వివాహవిధి లేదా? అంతకు మీఱిన నంతకునకు మీఱఁ గలదా? ఇపుడేల యీమాటలు? ఉగ్రసేనుఁడు వచ్చుచున్న ట్లున్నాఁడు. (ప్ర. ఉగ్రసేనుఁడు.)

ఉగ్ర. మామా! వందనంబు లాచరించెద.

సుమతి. ఉగ్రసేనా! ఇటు రమ్ము.

ఉగ్ర. మామా! మనకార్యములు మనము గోరినటుల సమకూఱెను గదా! ఏమికారణంబున నను రప్పించితివి? శుభకార్యంబునకే గద?

శా. మామా! మామకబాహుదర్పమున నేమాటోటముల్ లేకయే,
మామా! సేసితి నన్నికృత్యములు సన్మాన్యంబుగా నీకు నై;
మామా! మానిని నిమ్ము వేగముగ నీమా టోటు పోనీక, యో
మామా! కాలవిళంబ మేల? శుభము ల్మాకిచ్చి వేఁ బ్రోవుమా. ౧౬౧

మామా పరిణయంబునకు తేపటిదినంబే ప్రశస్తం బని జ్యోతిష్కులావిదులు వక్కాణించిరి. కాలవిళంబము వలదు.

(మదోన్మత్త వృత్తము)※
వేచి యున్నది వెరవుఁ గానక వెతలఁ గుందుచు వెలఁది, నే
వేచినాఁడను వెలఁదిఁ గూడఁగ వెలుకఁబాఱుచు వెకలినై,
కాచినాఁడను గలఁత చాలును గలికి నివ్వర కరుణమై,
దాఁచ నేలికఁ దగని తాపముఁ దడయఁ జాలను దలఁచినన్. ౧౬౨

మత్తకోకిల. ఇందుఁ జూచిన నందుఁ జూచిన నెందుఁ జూచినఁ గాని, యా
యందగత్తెవిలాసము ల్మనమందు నిండిన; వింక నా
సుందరీమణి సౌఖ్యదంబుగ సూనచాపుని క్రీడలం
బొందువాఁడ నమేయబంధురభూరిసౌఖ్యనిమగ్నతన్. ౧౬౩

కావున మామా! కాలవిళంబము చేయక శుభప్రయోజనంబుం జరుపుము. మామా! అగ్గలం బగునావిరహతాపమున సిగ్గుమాలి నీతో వచించిన దోకన్యానతగాఁ దలంపకు అది మేర మీఱి మతిఁ గేరి నాయత్నంబు లేకయే ప్రకట మగుచున్నది.

సుమ నీ వాడుమాట లన్నియు నిజములు. నీపై జయమాలికిని, జయమాలిపై నీకును, గలతాపం బెట్టి దయినది నాకు బాగుగఁ దెలియును. నీవిష యంబున జయమాలి పలికినపలుకులు చెప్ప నలవి గాదు. ఐన నే నేమి సేయఁగలను?

గీ. అల్లుఁడా! యేమి తెల్పుదు నయ్య! వినుము
మనసునందని వనమున ఘనుని నొకనిఁ
గాంచి వరియించి తమ్మునిగాథఁ దెల్పి
వెతకఁ బంపిన దఁట వాని వేగిరమున. ౧౬౪

ఉగ్రసేనా! అంగదేశపురాజకుమారుం డగుసు దేవుం డఁట యారాపట్టి. ఆఱుమాసంబులపై నాఱుదినంబులకు జయపాలునియుదంతంబుఁ దెచ్చెద నని వాగ్దానంబు సేసి పోయినవాఁ డట. కంటివే! యుగ్రసేనా! బాలుని పోకడలు విచారింప నొకఁడు గుఱిగా నిలచెను. దేవరహస్యంబులంబలె నుంచినమనకృత్యంబులు వాఁడు తెలియుట కేయాస్పదంబు దొరకునో? అచేతనంబులు సైతము పీను లుండినవానిం బోలె విని మనకృత్యంబు లకు సాక్ష్యము లై నిలుచు నేమో యని దిగు లగుచున్నది.

ఉగ్ర. మామా! భీతిఁ జెందకుము

※ ఇది 26 వ ఛందంబునఁ బుట్టిన 103193 వ వృత్తము. ర, న, స, న, స, న, స. గణములు, దు. 12. 18 దవస్థానముల యతియు నుండవలయు.

గీ. బాపురే! చాలు చాలును, భయము వలదు,
పట్టి వాఁ డెంతవాఁ డయ్యా? పట్టి వానిఁ
గట్టి తలఁ గొట్టి దిట్టలై నట్టడవిని
ద్రోయుభటులను బంపెద దోస మనక. ౧౬౫

మామా! అప్రతిమంబగు నా దేహబలప్రతాపంబులు నిండారి యుండ నీ కే భయమును వలదు. దేహబలంబునకు మించినకార్యం బెద్దియును లేదు గాదె?

సుమ. అల్లుఁడా! నీమాటలు నిజంబులైనను బుద్ధిబలం బెద్దానికి నావశ్యకంబు. కట్టె నఱుకను గట్టె యొకటే చాలదు. ఇనుపములికి సైత మవశ్యకంబు. దేహబలంబు నీసొమ్ము గా నుండినను బుద్ధిబలంబు నాసొమ్ము నీ వాసుదేవునిం బట్టి చెఱయం దుంచుము. పిమ్మటఁ గాఁదగినకార్యంబు నే యోచించెద.

ఉగ్ర. మామా! నీ వీయోచనల కాస్పదం బివ్వ నేల? నేనే వాని తలఁ గొట్టించెద. ఆలోచనాధీనమానసు లగుజనుల కెల్లకాలంబు నీరధి నుండు నావల కలలుం బలె యోచన లొకటిపై నొకటి తగులుచునే యుండును గాని, కార్యంబు సేయుటకు వారికిఁ గాలంబు చాల కుండును.

సుమ. ఉగ్రసేనా! నీ వటు తలంపకు. ఏకార్యంబును యోచింపక చేసిన నది చెడుటయే గాక కర్తనుం గూడఁ జెఱుచు. నీ వాసుదేవునిఁ బట్టి చెఱయం దుంచినతోడనె నీకుం గళ్యాణ మొనరించెద. నీ విఁక మాఱు పలుకకు. లెమ్ము. పొమ్ము.

ఉగ్ర. మంచిది మామా! నీయానఁ గొనియెద. పోయి వచ్చెద. (అనుచుఁ బోవుచున్నాఁడు.)

సుమతి (తనలో) ఔరా! వీనియహంకారము! పరస్పరపదతారతమ్యంబులం దెలియక మాలిమి కలిగినమానిసిం బలె మామా! మామా! యని పలుమారులు కూసెను

శా. ఔరా! వీనిమదంబుఁ గోవరము మత్తాలాపముల్ హెచ్చె; "నీ
గారాపున్సుత నీర మామ" యనుచుం గాఱు ల్పండుం బ్రేలె; వీఁ
డా రాజ్యంబున నుండ నర్హుఁడు? సరే! యాకార్యమ్మొక్కింతయుం
దీరం గారగృహంబొ ప్రేతగృహమో దిక్కౌ త మీపందకున్. ౧౬౬

గుడిత్రాళ్లనుండియే గుడిని బెకలించినట్లు వీనిభటసమూహమునుండియే కొందఱినిఁ జీలఁదీసి వీనిం గ్రూరదండనకుఁ బాత్రుం జేసెదం గాక. ఇంక నెక్కడికిఁ దప్పించుకొని పోఁగలఁడు? నాకార్యంబు కొంతయుం గానిమ్ము. ఆకుబేరుండు చిక్కక పఱుగిడె నఁట. వానిం బట్టుకొన మఱికొందఱ భటులను బంపవలయు, నిఁకఁ బోవలయు (నిర్గమము)

---

## తృ తీ యాం క ము.

### పంచమ రంగము - అరణ్యము.

(ఉగ్రసేనునిభటులు—జీవాజిశింగు— రామశింగు - లక్ష్మణశింగు ప్రతాపశింగు.)

వా. కటకటా! నీచులకొలువు బలుబలువు. రామశింగూ! మన మెన్నిక్రూర కృత్యంబు లని సేయుద మోయీ!

లక్ష్మణ: లెక్క లే నన్నిక్రూరకర్మంబు లొనరించినను మఱల నిట్టిపనులకే మనల నాతఁడు నియమించెడు.

రామ. వానిదురాచారంబు లిన్ని యని లెక్కింప నగునా? వాఁ డొకఁ డేల? కలియుగంబునం గలిమి కలిగినమానవులయం దనేకు లిట్టివారే యని నాకుం దోఁచెడు.

జీవా. ఇంత చేసినను మూఁడుమాటలలో నాలుతప్పులు బట్టుదురు. కూర్చున్నఁ దప్పు. లేచినం దప్పు. వెనుకఁబోయినఁ దప్పు. ముంద ఉండినం దప్పు.

సీ. తడసి వచ్చితి వంచుఁ దప్పితి వటయంచుఁ దాఱుమాఱుగఁ బట్టి తన్నువారు,
రామ. బిడ్డ లేడ్చెద రంచు గొడ్డు లార్చెచెడి నంచుఁ గట్టిడిమాటలఁ గొట్టువారు,
లక్ష్మ. పరదారలను దెచ్చుపనులఁ జాలవ టంచుఁ బలువభాషలఁ దిట్టి పదరువారు,
జీవా. సేవకునకు నీకుఁ జెలువులచెలి యేల? నాలి ని మ్మనుచుఁ బల్లార్చువారు,
రామ. గీ. కలిమిచేఁ గన్ను గానక కఠినజనులు, కటకటా! సేవకుల కిట్టికఠినములను
జేయుచుందురు భువిలోనఁ, జెప్పనేల గలియుగంబునఁగలిగినకలుషము ?

లక్ష్మ. సీ. వలదు సేవకవృత్తి పగవాని కైనను బలుహీన మైన దీకొలువు ఘాడు.
[illegible]

జీవా. కానలఁ జేరుచుఁ గోనల నిల్చుచు మానితముగ నిట్లు మనఁగ లేమె?

ప్రతా. భళిభళిరే! యెట్టిపాడుబుద్ధులు రోరి! కలికాలమహిమ మీకరణిదె కద?

గీ. ఉండినన్నినాళ్లు కండ పెల్లుగఁ దిని, యుప్పు దిన్నవానిమెప్పుఁ బడయు
గొప్పకాలమందుఁ,దప్పించుకొన నౌనె? గొప్పవారు దీని నొప్పువారె? ౧౬౮

భళిరే! అన్నలారా! మీరు మంచినీతులు పలుకువారు సుమీ! ఈమీనీతులీవసుమతిలో మీరే ప్రకటించితిరి కాఁబోలు నేమి? కండ బలియ బరు లుబ్బునటు లిన్నిదినంబులు వానియుప్పుఁ దిని హాయిగ నుండి నేఁ డొకపని సెప్పిన నొకనికి సేవకావృత్తి వలదఁట! మఱియొకఁ డడవిం జేరెదునఁట! వేఱొకనికి మర్యాద లంటా! దురభిమాను లగునిట్టియుత్తరకుమారులు ప్రారంభముననే కొలువునకు సమ్మతింప కేల మానుకొన రైరో?

జీవా. ప్రతాపశింగూ! నీమాటలు నిజము. పోషించినవానిం బొందిలోఁ బ్రాణం బుండువఱకు సేవింపనే వలయు.

రామ. అటు లేని నిపు డేమి సేయవలయును?

ప్రతా. ఆను దేవుం డెచ్చట నున్నను వెతకి తేవలయును.

లక్ష్మ. ఆరాజకుమారుం డెక్కడ? మన మెక్కడ? దూరదేశంబులకు ఘోరారణ్యంబులకుఁ బోవు టెక్కడ? ఇది మన కశక్యము.

ప్రతా. ఇక్కడన యుండి, యెక్క డెక్క డనిన రాకుమారుండు జిక్కునే? పోవలె; వెతకవలె; కనవలెఁ; దోడితేవలెను. అటు సేయక తప్పించుకొనం జూచిన మనప్రాణంబులు దక్కం గలవే?

లక్ష్మ. ప్రతాపశింగూ! నీపలుకులు విహితంబులు. సేవకునికి ధర్మంబులు. ఆయుగ్రసేనునికొలువు సర్పసహవాసంబునట్టిది. కత్తిమీఁదిసాము, నసిధారావ్రతమునుం గాదే?

ప్రతా. ఇఁకఁ దడయ నేల? ఇద్దఱిద్దఱ మొక్కొకదిక్కునకుం బోయి యారాజకుమారునిం బట్టి తెత్తము.

రామ. ప్రతాపశింగూ! మనయొడయుం డానతిచ్చినలక్షణాకారు లెందఱీజగంబున నుండరు? వారి నందఱినిం బట్టి తేవలయునదియ కా?

ప్రతా. ఓయి రామశింగూ! ఎట్టిమాట లాడెదవు? రాజకుమారచిహ్నము లగుపడ

మఱియును వానియాకారం బానాఁడు మనము పట్టి ఘాతకుల కప్పగించిన జయపాలుని నించుమించుగఁ బోలి యుండు నఁట. ఇంతకు నట్టివారు పలువురు మనకు దొరకిరి పో, వారి నందఱినిఁ దెచ్చి చెఱయం దుంచిన మన యొడయఁడు కావలసినవానిం బట్టి మిగిలినవారిని విడచును

లక్ష్మ. నిజము నిజము. పోదము. తడసితి మని మాటలు పడ నేల? వేవేఁగ రారండు. [అనుచు భటులు దిక్కుదిక్కులకుం బోవుచున్నారు.]

---

## తురీయాంకము.

### ప్రథమరంగము — అంగరాజుమందిరము.



రాజు మంగళాంగుఁడు. మంత్రి మణికంధరుఁడు.

మంగ. మణికంధరా! వేటకుం బోయినసుదేవుం డాఱునెల లయినను రాకున్నవాఁడు. వానియునికియే తెలియక పోయెను.

చం. వినయవినీతుని న్సుతుని విశ్రుతకీర్తియుతు న్గుణాన్వితుం
గనియెడుభాగ్య మిం కెటులఁ గల్గునె? మంత్రి! విశేషకాల మా
యెను గహనంబు సేరి, యది యేలను వాఁ డిట రాకపోయె? నే
వని మృగజాలమో యహితవర్గమొ వాని హరించె; నక్కటా! ౧౬౯

సీ. విమలవిచారు నెవ్వరుఁ గానక యున్న నిమిషంబు కల్పమై నిలుచుచుండె?
చూడక యెవ్వానిసుచిరరూపంబు కట్టిన ట్టుండె నాకంటి? కకట!
నిండారఁ జూచినం దృష్టిదాఁకు నఁటంచుఁ జూడంగ వెఱచి నేఁజూడ నెవని?
జూచిచూడక యుండి చూడనిసుఖముల నందితి నెవ్వానియందముఁ గని?

గీ. యట్టిసుకుమారరూపుని నాత్మసుతుని నీతిమార్గానుసారుని న్గీర్తిపరుని
సదవనోదారు గంభీరు సత్యసారు నురుగుణాధారుఁ జూడకయుండఁ గలనే?

. అట్టిసుకుమారకుమారునిశరీరం బేక్రూరమృగావళులవాతం బడెనో, ఏ క్రూరారులశరధారలబారిం జిక్కెనో, ఏఘోరారణ్యం బాకుమారునికి మరణభూమిగ నేర్పడెనో, తెలియ రాక యున్నది రాజ్యం బిఁక నేల? నే నేలఁ జాల. నా కేల సుతుఁడు లేనిరాజ్యసామ్రాజ్యంబులు?

మణికం. ప్రభూ! విచారంబు వలదు మనము పంపినచారు లీదినంబున రావలయును గదా? వచ్చువఱకు నెమ్మదిగ నుండుఁడు. (ప్ర. చారులు.)

చారు. మహాప్రభూ వందనములు వందనములు.

మణి. చారులారా! సుదేవునిశుభసమాచారంబుం దెచ్చితిరే?

చారు. మహాప్రభూ! దేశదేశంబులె నుండుపట్టణంబులు జనపదంబులు ఘోరారణ్యంబులు వాహినీతీరంబులు గిరిగహ్వరంబులు రేయింబవళులు నిద్రాహారంబులు లేక తిరిగితిరిగి వేసరి యాబాలునివార్త యొకటి యేనిం గని, (యే మేమొ చెప్పఁ బోవుచుండ నడ్డమువచ్చి రాజు).

మంగళా. ఏ మేమీ! సుదేవుండు దొరకఁ డాయెఁగా! హా! హా!

శా. ఆబాలుం డవనీతలంబునఁ గనన్ హా! లేఁడుగా! మంత్రి? యో
బాబూ! చిన్నికుమార! ముగ్ధతనయా! భాగ్యోదయా! పోయితే?
యీబారాదివియోగవహ్ని బలమై యేర్చు, న్శరీరం బిఁకన్
నేఁ బూనంగలవాఁడనే? సుతు నయో! నేఁ బాసి జీవింతునే? ౧౭౧

చ. వనిమృగజాలము న్గెలిచినవానికి నాఁకటికూడె వాఁ? డయో!
ఘనతరవైరు లాజిఁ గొని గాసిలఁ బెట్టఁగ నర్హుఁడే సుతుం?
డనవరతంబు నాదుహృదయాంబుజమిత్రుఁడు పుత్రుఁ డక్కటా!
నను విడనాడి పోయె; నిఁక నాబ్రతు కెంతయు రిత్తగా దొకో?
మణికంధరా! నే నిఁక బ్రతుకఁ జాల. [౧౭౨

మణికం. రాజేంద్రా! ఇంచుక నిదానింపుఁడు. చారులను విచారింతము. వాం డ్రేమి చెప్పఁ బోవుచున్నారు. చారులారా! మీ రేయే దేశంబులకుం బోయి యుంటిరి. అందందుఁ గలవిశేషంబు లేమి?

చారు. ప్రభూ! అన్ని దేశంబులుం దిరిగితిమి. తిరుగుచుఁ గళింగదేశప్రాంతంబున నొకపిచ్చివానిం గంటిమి. వాఁడు చూచినవారి నెల్లరను సునందని యని పట్టుచుండెను. ఎదిరించినవారి నెల్లరను సుదేవా యని కొట్టుచుండెను. వాని నేమిపల్కరించిన నారెండుమాటలే తప్ప వేఱొకవిషయంబునఁ బల్కఁడు. ఇది యేమివిశేషంబో యని వానిం బట్టి తెచ్చితిమి.

మణికం. మంగళాంగప్రభూ! ఇఁక మీవిచారంబు వదలుఁడు. మీసుతుఁడు కళింగదేశంబున నున్నవాఁడు. కళింగదేశాధిపతి యగుప్రతాపునికూఁతురు సునందని బహుసుందరి యని నే విని యుంటిని. (చారులతో) చారులారా! ఆపిచ్చివాని నిచటికిఁ బిలిచికొని రండు.

చారు చిత్తము స్వామీ. (చారులు వెళ్లి పిచ్చివానిం దీసికొని వచ్చుచున్నారు.)

మణికం. చారులారా! వీఁడా మీరు చెప్పినపిచ్చివాఁడు?

చారు. చిత్తము, బాబూ!

కుబే. హాసునందనీ;

చిత్రపదవృత్తము. అంగన యేలనె ప్రీతిన్ । మంగళ మానుఖకేళిన్
బంగరుబొమ్మరో! నే నీ । యంగజుబారికిఁ దాళన్. ౧౭౩

(అనుచు మణికంధరునిం బట్టుకొనఁ బోఁగా భటులు నివారించుచున్నారు.)

కుబే. "సుకాంతివృత్తము" ఇదేయసీ! మదాన్వితుఁ
సుదేవునీ! వధించెదఁ. ౧౭౪

(అనుచు భటులం దన్నం బోవ వారు వానిని బంధించుచున్నారు,)

మణి. చిత్తగించితిరే! ప్రభూత్తమా! ఈపిచ్చివానికి సునందనిపై నుండు హెచ్చు మచ్చికయు సుదేవునిపై నుండు పెచ్చుమచ్చరమును? మనను దేవుం డాసుందరి సునందనిని వరించి యచ్చట నెచ్చటనో నిలచినవాఁడు. ఈపిచ్చివాఁడు సునందనిని మోహించియు నష్టమనోభీష్టుం డై యున్మాదంబునం దిరుగాడెడు.

మంగ. మంత్రివరా! దీనినిశ్చితార్థంబు నెటులు దెలియ నగును?

మణి మనమే యచటికిం బోయినఁ గలతీరు తెలిసికొన నగు.

మంగ. అటు లయిన నీదినంబుననే పయనముఁ జేయుదము. ఈపిచ్చివాని సైతము తోడ్కొని పోదము. రారమ్ము, లేలెమ్ము (వెళ్లిపోవుచున్నారు.)

---

తురీయాంకము.

ద్వితీయరంగము - అరణ్యము.

సుదేవుఁడు, భటులు.

సుదే. హా! ఆసుందరికి నే నిచ్చినగడువు నేటికిఁ గదా మీఱెడు? ఏమి సేయుదు?

కం. జడమతి నేఁ గడు విచ్చితి జడజాక్షికి నాఱునెలలు చయ్యన మీఱెం,
గడుభయ మయ్యెడు, శౌరీ! బడలుచు నే మానుముద్దుభామ భువి నిఁకఁ?

కం. గడువు నీమెఱుదాఁకను బుడమి న్నని యుండుదానఁ బురుషాగ్రమణీ!
గడవు తొలంగిన మన నని జడజాయతనేత్ర పలికె జడు పయ్యోఁ గదా!

కం. అడవి న్జిక్కితి, నయ్యో! వడి తప్పుచు నొడలు చాల వడకెడు; నాహా!
యడు గిడ లే, నకటకటా! తడసిన నే మగు నెు తన్వి తహతహపడుచుఁ?

మ. మితి మీఱె, న్గతి గానఁ, గానఁ బడితి, న్నీమెఱె న్గదా క్షోణి నా
సతిని న్నీమతి శ్రీమతి నుణవతిఁ సాంగత్యసంప తి నే

మతి నూహించి తలంచుకొల? యకటా! మాసె న్గదా హర్షముల్,
క్షితిలో రాజకుమారుఁ డిట్టియడవిన్ క్షీణించునే? దైవమా! ౧౭౮

సీ. కంటకవల్లీకకర్కశపాషాణకఠినకాననములఁ గలుగుఁ గలఁత,
తపనాతపాతతతనుతాపబహుళంబు విపరీతగతిఁ దోఁచు వితతచింత,
దవదావసమదాహదహ్యమా దేహము తహతహతను జెందుఁదగనియలఁత,
చండార్కకరతప్తసైకతాతతముష్మరాగ్నికీలలు గ్రాలి యడరు వంత,

గీ. తరళతరతారకేక్షణతరుణి తన్వి సురుచిరోదార శృంగారసుగుణహార
సారకుచభార ఘనతరచారుచికురఁ దలఁపఁ దలఁగనితలపోఁత దలఁగుచుండె ౧౭౯

ఇట్టితరుణీమణినామస్మరణ సేయుటకు సైతము బల ముడుగుచున్నది.
హా! హా! నాబల ముడిగిన నుడుగనిమ్ము నాప్రాణంబులు వ్రాయినం
బోనిమ్ము. ఆసుందరి బ్రతికి యుండినం జాలును.

కం. మురహర! గిరిధర! సురవర! కరుణాకర! దారిఁ గానఁ, గరివరదా! నీ
చరణములను నెఱనమ్మితి, బురహరసఖ! దురితదూర! బోషింపు చెలిన్.

సునందనీ! సోదరునకై పరితాప మొందుమనీకు నే నొకవిపరీతతనుతాప
మొనరించితిఁ గదా! నను మన్నింపుము. తరుణీ! విపదబ్ధితరణి యగుశ్రీ
హరి నిను రక్షించుం గాత

సీ. కావఁడే ప్రహ్లాదుఁ గంబంబునం బుట్టి ఘోరహిరణ్యకునిగుండెఁ జీల్చి?
ప్రోవఁడే బాలుర భూరిమృత్యువునుండి? యర్జునుశపథంబు నరయ లేదె?
ఇవ్వఁడే గురుదక్షిణి మ్మని వేఁడిన మృతసుతు జీవ్రాపయుతునిఁ జేసి?
కట్టఁడే సామ్రాజ్యపట్టంబు ధ్రువునకుఁ, దండ్రి పరభవింపఁ దడయ కపుడు?

గీ. అట్టియనుపముఁ డనవద్యుఁ డచ్యుతుండు
నాదిమధ్యాంతరహితుండు నఖిలలోక
పాలకుం డగుకరుణాలవాలుఁ డనఘుఁ
డొక్క చెలిఁ బ్రోవఁడే నామ్రొక్కు లంది? ౧౮౦

శంకరాభరణరాగము - ఆదితాళము.

మందయానా - కుందరదనా-యిందు గాపే-సుందరారవిందనయనా-యిందురావే॥
కోపమేల - నాపై బాలా? పాపినే నేను? ఏపార నీముద్దుమోముఁ-జూపవె రమణీ॥౧

నీరేజానన!ఘోరారణ్యముఁ జేరితి నేను-సారసాక్షిరో-దారి గానక-తాఱదేహము॥
దీనావనా!మానరక్షక!నీనామము నే-మానితం బని-పూని వేఁడెదఁ -జానఁగావరా॥

సుందరీ! సునందనీ! నుడివినగడువు గడచినను సుదేవుండు రాఁడాయె నని ప్రాణంబు విడనాడకు తరుణీ! ఈజన్మంబున లేకున్నను మఱియొకజన్మంబున నైన నినుం గూడెద ననునిర్ధారణంబు చేసికొని హరినిం గొని యాడి ప్రాణంబులు విడిచెద. నావియోగంబునకై యకటా! నాముసలి తలిదండ్రులు చింతిలి యాహారాదులు విడచి కృశించి ప్రాణంబులు విడతురు కదా! ఏమి సేయుదు? నాయట్టిపుణ్యవిహీను లగుపుత్రు లజాగళస్తనంబులంబలె వ్యర్థజన్ములు కారే? ఆయజాగళస్తనంబులు నిష్ప్రయోజకంబులై గొంతునఁ గ్రుంగఁదీయుచు నామేకకు భారమైతోఁచునట్లు నేను నుపయోగరహితుండనై తల్లిదండ్రులకు బలువైతి? ఎవ్వరికిం గొఱగాని వాఁడ నైతి. నాబ్రతుకు ప్రపంచంబునకే భారమయ్యె

ఉ. పుత్రులు పుణ్యహీను లయి పుట్టఁగ నేటికి భూమిఁ బొల్లుగా?
మాతృపితల్ వియోగమున మానసివంతఁ గృశించి వందురన్
గోత్రముపాత్రతం జెరిచి కూరిమిబంధుల క్షోభ వెట్టఁగా
మిత్రులు చింతిలంగఁ బుడమిం దమశత్రులు పొంగి నవ్వఁగా. ౧౮౩

శ్రీహరీ! ఏమిది? యీజేడులోకంబులు బొంగరంబులుంబోలె గిరగిరం దిరిగెడు! మిన్నంతయు ఘనీభవించి నాపై నెక్కమెయిం బడిన ట్లయ్యెడిని! నాదృష్టి యేలనో నిలిపినను నిలువక శింశుమారచక్రంబునుంబోలె దిర్దిరం దిరిగెడు! చరాచరసృష్టి యంతయు శూన్యంబై తోఁచుటయే గాక నాయునికి సైతము సందియంబై యగుపడెడును! ఏమిసేయుదు! నిలువం జాలకున్నాను. హా! సునందనీ! సునందనీ!! సునందనీ! (అనుచుఁ గ్రిందఁ బడి మూర్ఛపోవుచున్నాఁడు.)

ప్రతా. చూచితివే రామశింగూ! క్రూరమృగావలీభయదంబై మానవసంచారంబు లేనియీదుర్గమారణ్యంబున మనసునందనీనామంబుం గొని యెలుగెత్తి చీరెడువాఁ డెవఁ డయ్యుండును?

రామ. అదియె యచ్చెరువుగా నున్నది. చేరువం జేరి చూచెదము. వడుచుపోయెదఁడు లేనినాకునికి, దీరెడిని.   గృహంబున నిలువం జాల.

ప్రతా. మంచిది మనము పోవుదము. (అనుచు సుదేవునిఁ యొద్దికిం బోయి) ఓరీ వీఁడేరా సుదేవుఁడు; సందియంబు లేదు.

రామ. నేఁడు గదా దైవంబు మనకు ననుకూలం బయ్యె?

ప్రతా. ఆలస్యం బేల? వీనిని బంధించి వేగంబె కొనిపోయి యుగ్రసేనునియాజ్ఞానుసారంబుగ మనచెఱయందుంతము.

రామ. నిజము మెలఁకువ రాక మున్నె బంధించుట మేలు.

ప్రతా. అటులే చేయుదము (అనుచు బంధించి యెత్తికొని పోవుచున్నారు)

---

తురీయాంకము.

తృతీయరంగము— రాజమందిరము.

సునందని. (స్వగతముగ.)

ఆ. వె. సతతసదవనుండు వితతనయుం డయో! యతివిలాసయుతుఁడు మతివరుండు
క్షితిధరంబు గేరుధృతిసమేతుం డహా! సతులచిత్తజుండు చనియె రాఁడు.

తరళవృత్తము. అడవిఁ బోయినబాలుఁ డెచ్చెద నంచుఁ బోయెను దైవమా!
గడువు మీఱెను రాక తక్కెను గాఢకాననసీమలన్,
దొడరి చొచ్చెను? గాజువాఱుచు ద్రోవఁ గానక నెచ్చెనో?
చెడితి నే నిఁక నేమి సేయుదు? శ్రీహరీ! నన్నుఁ బ్రోవరా. ౧౮౫

వసంతతిలక. నారాయణా! కరుణ నాపయి జెంగలింపం
బోరామి నాథుఁ డని పొందుగఁ జూపితౌ; హా!
ఆరామతీరమున నారయ సుందరాంగున్,
బారాదిబాధలకుఁ బంపితి దోషి నైతిన్. ౧౮౬

ద్విపద. వందారుమందార! వసుధాకళత్ర!
బృందారకస్తుతి-బృందచరిత్ర!
మంధరగిరిధర! మహితపవిత్ర!
మందయానా-కుంచ బంధురభవపాశ-బంధలవిత్ర!
కోపమేల-నాపై బాలఅంధకరిపుమిత్ర! యరవిందనేత్ర!

కంధరశ్యామల! కమనీయగాత్ర!
ఇందిరాసుందరీ - హృత్కంజమిత్ర?
వందనం బిదె నీకు - వసుదేవపుత్ర!
అలనాడు వనతల - మలరి నేఁ జేరి,
చెలులతో వనకేళి - చెలరేఁగి సల్ప,
లేనివికారము - ల్లెక్కకు మీఱి,
కానఁగ వచ్చినఁ - గాఱియ పడుచు,
హా రామ! శ్రీహరీ! యని నేను జీర,
నారామసీమల - నతిసుందరాంగు,
నొకఘను నచట నీ - వొసరంగఁ జూపి,
యిఁక నేల చింత నీ - వెలమితో నుండు,
మని మతి బోధింప - నటు సేయ నైతి.
ఘనుని నేఁ బంపితి - గహనసీమలకు,
మాధవా! యలవాని - మానససీమ,
నాధవుఁ డని నేను - నమ్మితిఁ గాన,
నవివేకి యనుచు న న్ననఘ! యెంచకుము,
భువిలోన శాశ్వత - భూరిమంగళము,
లొసఁగి ప్రోవవె వాని - నోయసురారి,
మసలఁగ వల, దహా - మధుకైటభారి! ౧౮౭

హా దైవమా! ఆసురుచిరశుభగాత్రుఁ డాతారుణ్యలావణ్యాన్విత శరీరుం డాఱునెలలపై నాఱుదినంబులకు మరలి వచ్చెద నని గడు విచ్చెను. ఇపుడు మితి మీఱినది. రాక పోయెను. హా యాతఁ డడవిం జిక్కియుడలెనో? ఒడలివడి సడలి బడలి పుడమిపైఁ బడెనో? శ్రీహరీ! నను వ్యసనాబ్ధిలో ముంచినను ముంతువు గాక, ననుం జంపినం జంపుదువుగాక, యాకుసుమకోమలగాత్రునిఁ గనుగంద నీకుము. ఆరాకొమారునకు భూరిమంగళంబు లిచ్చి రక్షింతు వని నిను వేఁడెద, మిఱి కొనియాడెద. అకటా! ఆసుందరుం డడవిం బడి సంకటంబులు వడుచుండ నే నీరీతి మణిమయమందిరంబుల నుండ నగునే? ఆప్రాణేశ్వరుఁడు లేనినాయునికి, యీమనికి నిష్ప్రయోజనంబు గాదె? ఇఁక నీగృహంబున నిలువం జాల.

రాజ్యం బేలం జాల. నాసుందరు నన్వేషింపం బోయెద. వాఁడు దొరకఁ డేని యీదుర్భరశరీరంబుఁ ద్యజించెద. హా! ఈరాజ్యపట్టం బేరికిం గట్టుదు? ప్రాణంబుం ద్యజించుటకు నిశ్చయించిననా కీరాజ్యాలోచన లేల? పితృవచనోల్లంఘన సేయం దగునా, యనుబాధ యొకటి బాధించుచున్నది ఇసీ! నా కేల పాపభయము?

ఉ. తమ్మునిఁ గొలువుచ్చి, తలిదండ్రులయి మ్మగుసౌఖ్యసారముల్
వమ్ముగఁ జేసి, కాననసివాసము లేర్పఱపించి, వల్లభుఁ
నమ్మినవానిఁ గ్రూరమతి నట్టడవిం జరియింప నెట్టనే?
యిమ్మెయిపాతకాధమకు నేటికి నా కిఁక రాజ్యభోగముల్? ౧౮౮

గీ. ధరణిఁ గాననిముద్దుసోదరునిఁ దోడి
తె మ్మనుచుఁ జెప్పి నిష్కారణమ్ముగాను
నిరపరాధిని గుణఖని నిష్కరుణను
బపితింగాదె? నా కేల పాపభయము? ౧౮౯

ఇఁక క్షణమాత్రం బైన నిచట నిలువం జనదు ఘోరారణ్యంబులం జేరెద. (అనుచు మందిరంబు విడిచి వెళ్లిపోవుచున్నది.)

---

## తురీయాంకము.

### చతుర్థరంగము - మంత్రిమందిరము.

(జయమాలి - సుమతి.)

జయ. కం. తలఁచినకార్యము లెల్లను దలఁచినయటు లాయె నిఁకను దడయఁగ నేలా?
కలకాలము యోచనలోపల నుండినఁ గార్య మెటుల ఫలమౌఁ? దండ్రీ

కం. కందర్పరుచిరరూపుని సుందరు నటు బంధనమున గ్రక్కునఁ జేయం
గందు నెటు? విందు నెటు? లీ మందిరమున నుండఁ దెమ్ము మసలకు తండ్రీ

కం. దిన మొకప్రళయం బగు నో జనకా! వీను, తాళఁజాల జాలమి దేలా?
మనసిజుబాధలు పెక్కులు మనమునఁ బెనఁగొనెను నేను మనను మసలినఁ.

తండ్రీ! ఘడియ యొకయుగముభంగి, దిన మొకప్రళయంబురీతిఁ, గాలం బు గడుపుచున్నను జూచి నీకుం గరుణ రాదుగా? ఆ రాకుమారుని బంధం

బున నుంచ నేల? బాధింప నేల? మనమందిరంబున నుంచిన నే వానిం బొంది సకలానందంబు లందనే? తండ్రీ! ఏమి యోచన సేసెదవు? కల కాలంబు యోచనలలో మునింగిన, కలిగినఫల మనుభవించు టెప్పుడు?

సుమ. తనయా! ఆసుదేవుని మనమందిరంబున నుంచ నగునే? వాఁడీపట్టణంబున నున్నవాఁ డని యితరులకుం దెలుప నగునే? వానివార్త సునందని విని న మనప్రతుకు తెల్లవాఱుం గాదె? మనకార్యంబులు వ్యర్థమగుం గదా?

జయ. తండ్రీ! సునందని యెచ్చట నున్నది?

సుమ. తనయా! దానిమందిరంబుననే యున్నది

జయ. తండ్రీ! నీ వెఱుంగవా? అది యరణ్యంబుం జేరెను.

సుమ. ఎపుడు?

జయ. నిన్నటిరాత్రియే?

సుమ. తనయా! నీ కెట్లు తెలిసెను?

జయ. ఉ. పంచితిఁ జంచలాక్షులను, బంచలచాటునఁ బొంచి యోచన
ల్వించును నెప్పు డప్పటివి వీనులవిందుగఁ దెల్పుఁ డంచు, వా
రంచితప్రజ్ఞతోఁ గనిరి! యాచెలిబాళియుదంత మంత, త
ప్పించుక లేక నాకు వినిపించిరి రాత్రియె, తేటతెల్లగన్. ౧౫౩

తండ్రీ! ఆసునందని సుదేవునిన్ వరించినదినమాదిగ నాకుం దానిపై స వతిమచ్చరంబు హెచ్చె. పొంచియుండి కాచువారిని నియమించి దానిది నచర్య యెప్పటి దప్పుడు తెప్పించుకొనుచుంటిని. ఇపు డీయాఱునెలలనుం డియు దానికి నిద్రాహారంబులు లేవఁట. కలలో నైత మాచెలువునిం దలఁచుచు, వాఁడు రాక తడసె నని దినము లెన్నుకొనుచు, విరాళిం జెం దుచుఁ, గడవునాటికి రాఁడాయె నని ప్రాణంబులు విడచెద నని, యిలువే ల్పుపై బాసలు సేయు చుండె నఁట. ఇపుడు గడువు మీఱె నని కడుదుః ఖించి నిన్న నడికిరేయిట గూఢముగా నిలు వెడలి యడవిం జేరె నఁట. ఇఁక నేల నీకితరులభయము? నీవే కళింగదేశాధిపతి వైతివి. లోకు లంద ఱు నీసేవకుల కాదె?

సుమతి. తనయా! యీవార్త నిశ్చయంబ యే నిఁక నే ధన్యుండ నైతి నినుట కు సంశయం బేమి? ఈరాజ్యంబు సాధించితి; కుబేరుం డున్నాడుఁ డై,

పట్టణంబు విడిచి గ్రుమ్మరుచున్నవాఁడు, వానిగతి యే మయ్యెనో తెలియ కున్నది.

జయ. తండ్రీ! వానికై వగవ నేల? వేయుకొండఱని భటులం బంపుము. వారు వానిం బట్టి తెచ్చెదరు. దేశదేశంబులనుండియు వైద్యులను రప్పింపుము. వారు మందు లిచ్చెదరు. నీవు కళింగదేశాధిపతి వని యితరరాజులు వినినతోడన వా రందఱు నీతో వియ్య మంద నిచ్ఛయింతురు. అపుడీసునందనికన్నను సుందరి యగునొకకన్యను గుబేరుఁడు పొంది సుఖంబున నుండవచ్చును. తండ్రీ! నీబుద్ధిచాతుర్యంబువలనం గదా యింతటిపదవి నీకుం గలిగె? జనకా! ఇట్టిసమయంబున నీతనయ నగునే నీలాఁగున దపించుచుండుట నీ కొకకొఱఁత కాదా? ఆలోచింపుము.

సుమ. తనయా! ఇంచుక నెమ్మదింపుము.

కం. పంకజముఖి! యింకిను దన । బింకమ్మున నున్నవాఁడు భీతిఁ గెడపి నా యం కెకుఁ దెచ్చెద నిజ మిది । శంకింపకు ముద్దుపట్టి శాంతవు గమ్మా. ౧౯౮

జయమాలీ! సమ్మతి లేనిసుఖమ్ము లి మ్మగునే? ఈదినంబున మరల మాఱువేషమ్మున వానిం జేరి చతుర్విధోపాయమ్ముల వానిసమ్మతిఁ గొనం జూచెద.

జయ. దేశంబులు సాధింపం జాలునీ శేముషీవిశేషంబున కొకమానవుని సాధించు టేమివిశేషంబు? కాలవిళంబము సేయక కార్యసాఫల్యంబు సేయుము. తండ్రీ! మఱచితిని. ఆచండాలుని యుగ్రసేనుని విషయం బేమి సేసితివి? వానిబాధలు నాకుం బెక్కులు. వాని నీప్రపంచంబున నుంచుయత్నంబు సేయకు.

సుమ. తనయా! వాని కిఁక జడియ వలదు. తగినయుపాయంబుం బన్నినాఁడను.

జయ. ఆయుపాయం బేది?

సుమ. గీ. విగ్రహారాదగ్రు నాదుష్టు నుగ్రసేనుఁ బట్టికొని పోయి కాననినట్టిడవిని
పదవిహీనునిఁ జేయ నేఁ బన్నినాఁడ జాన! నీ విఁక వానికై జడియవలదు.
జయమాలీ! ఇఁక నీవు సుఖంబుండుము. పొమ్ము. [౧౯౯

జయ. బలే! మంచియాలోచనము చేసితివి! తండ్రీ నేఁ బోయివచ్చెద. (అనుచు వెళ్లుచున్నది.)

సుమ. స్వగతముగా.

మ. భళిరే! బుద్ధిబలంబు! దీని కెనయే బాహాబలం? బౌర! దు
ర్బలులీ ధారుణిఁ గర్త కర్త యనుచు న్బాటింప రీబుద్ధినిం,
దెలియం బూన, ర చేలనో, కటకటా ధీసత్వముల్? మాయురే!
కలసౌఖ్యంబులఁ గంటి, రాజ్యమును నేఁ గంటిన్, భళీ! శేముషీ. ౧౯౬

ఔరా! ఎంతటి దీబుద్ధిసామర్థ్యంబు! పదచలనంబు సేయక రథగజతురగపదాతిసంపదం గోరక రాజ్యపదవి నేఁ బడసితి. కళింగరాజ్యంబు నాదియనుటకు సందియం బేమున్నది? సునందనికి నరణ్యమరణం బే నిర్ణయించెద. పుత్రవియోగంబునం గృశించుప్రతాపునకుం బుత్రికామరణంబుఁ దెలిపినతోడన వాయువశంబునం బడినటుల వానిశరీరంబు వడిపోవు. ఆసమయంబునం గదా యించుక సాహసంబు మరల సేయవలయు? అది యెంతటిపని? ఒకపత్రంబు. దానిపై ప్రతాపునిలిఖితంబు. జ్ఞాతులవార్త న్నట్టిఁ గొట్టుం గదా! కళింగరాజ్యాధిపతి సుమతి యనునదిసిద్ధం బయ్యె. ఇంక వంగరాజ్యమో నాకూఁతుది యవును. సందియంబు లేదు. ఆసుదేవుఁడు దండసాధ్యుఁడుగా నున్నవాఁడు. గుణసాధ్యుఁడుగా లేఁడు ఎటు లయినను నాతలఁచినకార్యంబునకు సమ్మతిఁగొన వలయును. ఈరాత్రి యాపనిఁ జేసెద. మఱచితి, మఱచితి. ఆయుగ్రసేనుని నారామంబునకుం గొనిపోయి మతుపఱచి యుంచుం డని వానిభటుల కే నాజ్ఞ యిచ్చితి. బుద్ధికి సాధ్యంబుఁ గానికార్యం బెద్ది యున్నది? నేనుఁ బోయి వానివిషయంబున నేఁ దలఁచినకార్యం బింతయేనిఁ గొఱంత వడకయుండులాఁగు సాహసంబు సేయ వలయు. తటాలున ప్రాణంబుఁ దీసినవాఁడు నాధీసత్వంబుఁ దలపోయం దఱి యుండదు; కావున వాని నటు సేయం దగదు. పదవిహీనునిం జేసి దుర్గమారణ్యంబునం బడవేసిన నాబుద్ధిబలంబుఁ దలంచుచు ప్రాణంబు విడుచు. అటులనే సేయ వలయు. తగినయత్నంబులు సేసెద. పోయెదం గాక (నిర్గమము).

---

## తురీయాంకము.

### పంచరంగము-అరణ్యము.

యపాలుఁడు - ఆత్మగతము.

కం. అకటా! నిర్భాగ్యుఁడ నే | నొకటన్ రెండింటఁ జెడితి నోహో! శౌరీ!
వికటారణ్యంబున నా | కిఁక దిక్కెవ్వారు? శక్తిహీనుఁడ నైతిన్. ౧౯౭

ఉ. అక్కడఁ దల్లిదండ్రు లకటా! మదిఁ గుందుచు నెంత చిక్కిరో?
ఇక్కడ నన్నుఁ బెంచి సుతుఁ డే యని నమ్మినవారు స్రుక్కిరో?
చిక్కితి నన్నిబాధలకు, శ్రీహరి! యెంతకృతఘ్నుఁడం గటా!!
త్రెక్కొని యిట్లు సేసితె, విధీ! కృతకర్మఫలానుసారి వై. ౧౯౮

చం. భువి నవిధేయసేవకునిఁ బ్రోచుట చెంగటఁ బాముఁ బెంచుటే,
యవినయపుత్త్రుఁ బెంచు టది యాకొనుబెబ్బులి నింట నుంచుటే,
సవతుల నింట నుంచు టది సౌఖ్యమును న్మెడఁ బట్టి గెంటుటే,
తివిరి కృతఘ్ను సాకు టది తీ పనిహాలహలంబుఁ గ్రోలుటే. ౧౯౯

ఛీ! నాయట్టికృతఘ్ను నాయెఱుక లేల పెంచి పెద్దఁ జేసిరో తెలియకున్నది నాయట్టిపుణ్యహీనుని నామహానుభావు లయినజననీజనకు లేల కనిరో తెలియకున్నది వారిసౌఖ్యంబుపాలిటఁ బెనుమృత్యువు నైతి. నా యీపుట్టువు నాతల్లియౌవనవనంబుపాలిటికుఠారంబ కాని వేఱొకటి గాదు. అజాగళస్తనంబునుంబోలె నాయట్టినిష్ప్రయోజకపుత్త్రుండు పుడమిఁ బుట్ట నేల? నాయత్నం బేమి యున్నది. సర్వంబునకు నెన్నొసట విధి వ్రాసినవ్రాఁతయే కారణంబు గాదే?

సీ. కన్ననాతల్లికి న న్నెడఁబాపెను జిన్నిప్రాయమున న చెలఁగి విధియె,
కాననంబునఁజేర్చి కఠినదండనఁగూర్చిమరలఁబ్రోచెనుమహామహితవిధియె,
ఎఱుకలఁ బంపించి యెలమి న న్గాచినకరుణానిధానంబు కనఁగ విధియె,
కాచినవారిని ద్రోచి న న్నీరీతి నేఁచుచు నున్నది యిపుడు విధియెఁ

గీ. ఔర!విధిబలమే బల మవనియందు,బుద్ధిబల మేల?మఱి యేల భుజబలంబు?
వింత' పొగడంగ వశమె యీవిధిబలమును ఫణిపతికి నైన భారతీపతికి నైన?
ఔరా' విధిమాయ తెలియ నెవ్వరికి శక్యము? హా! బడలిక హెచ్చె. ఇఁక ముం దడుగిడఁ జాల. ఈతరుమూలంబున విశ్రమించి పేద తీర్చుకొని ప్రాణంబు లున్న మఱలఁ బ్రయాణంబు సేసెద. (అని యొకచెట్టుక్రిందఁ బండుకొని నిద్రించుచుండఁగా జీవాజీలక్ష్మణసింగులు ప్రవేశించుచున్నారు).

జీవాజి. లక్ష్మణశింగూ' మనపని సముద్రమున కేతాముఁ గట్టినట్టు లున్నది సుమీ.

లక్ష్మణ. అందునకు సందియం బేమి' వింధ్యపర్వతంబుం దల్లక్రిందు సేయఁ బూనుటయే కాదే?

జీవాజి. మేర మీఱి యున్న ధరాతలంబుం దిరిగి లెక్కకు మిక్కిలిగా నున్న జన సమూహంబునుండి తాను జెప్పినలక్షణంబులు గలవాని నొక్కని నేర్పరచి తే వలయు నఁట. అట్టివాఁడు చిక్కు టెట్టులు ? వానిఁ జిక్కించికొనఁ గలుగుట చుక్కల లెక్కింపఁ గలుగుటయె కాదే?

లక్ష్మణ. చిక్కననునది చుక్కల లెక్కిడునటు లనుట నిజ మగు.

జీవాజి. అటు లయినచో నీయడవులలో నిడుములం గుడుచుచు నడల నేల?

లక్ష్మణ. పట్టణంబుం జేరి యాక్రూరునికి మనప్రాణంబులం గోల్పో నేల?

జీవాజి రిత్త సేతులఁ బోయిన వాఁడు మనప్రాణంబులు దీయుట సిద్ధంబే కదా

లక్ష్మణ. సూర్యచంద్రుల యునికి సిద్ధంబ యే నదియు నట్టిద.

జీవాజి. ఆక్రూరుఁడు ప్రాణహింస యించు కైనను పాపం బని తలంపఁడు కదా?

లక్ష్మణ. వేటకాఁడు మృగంబులపై దయ యుంచునే ?

జీవాజి. మన మిపుడు సేయం దగినకార్యం బేమియుం దోచక యున్నది.

లక్ష్మణ. మన మాఱునెలలనుండి తిరిగి తిరిగి యలసితిమి. ఈచెట్టుక్రిందఁ గూర్చుండి యొకింత యోచింతము.

జీవాజి. మంచిది. నాకు నదే కావలయునది. (అని యొకచెట్టుక్రిందఁ గూర్చుండెను.)

లక్ష్మణ. ఓయీ జీవాజీ ! చూచితివే యీచెట్టుక్రింద నెవఁడో మానవుఁడు నిద్రించుచున్న వాఁడు ?

జీవాజి. (లేచివచ్చిచూచుచు) ఆహాహా ! ఎంతసుందర పురుషుఁడోయీ !

లక్ష్మణ. వీఁడే సుమీ మనయుగ్రసేనుండు తెలిపినలక్షణాకారుండు.

జీవాజి. నిజము నిజము. నిజము నందియంబు లేదు. నిజము.

లక్ష్మణ. (మెల్లగ) జీవాజీ. వీని నిద్రించునపుడే బంధించి యెత్తికొని పోదమా! వానికి మెలఁకువ గల్గినచో మనకును శ్రమ యగు. ఇపుడు గోటితోఁ దీరుపని కపుడు గొడ్డలి కావలసి యుండుం గాదె ?

జీవాజి. అటు లయిన నాలస్యం బేల ? బంధితము పట్టు. (అనుచు బంధించి యెత్తికొనిపోవుచున్నారు.)

---

సునందనీపరిణయము.

పంచమాంకము.

ప్రథమరంగము.



చెఱ. (జయపాలుఁడు. చండోఁడు. వెట్టోఁడు. పిచ్చోఁడు).

చండో. కేదారగౌళరాగము. ఆదితాళము.

వన్నెనుగదరా పానముసుట్టి - తెన్నెనుగదరా కీడులిట్టు - సన్నేమురా సామి మేమి
కెట్టు - తన్ననలాడిన - వన్నెను అట్టు ॥ పల్లవి.

పాపోని దునుమనిపాపము వన్నె - నాపని వల దని వాఁడు వాకున్నె - నాపాపుల,
కాను లింతకు దెన్నె - మాపాలిదేవర మాకును సన్నె. ౧

కానుకు నాసిడ మోసము లాయె - మోసము సేసిన దోసము వన్నె - మీసాల
బూసోని పీసాసి నీసోని - గాసికి దేవర మము నేఁడు దెన్నె. ౨

ఓయబ్బా! యెట్టిగా! ఓరీ పిస్సిగా! నేఁడు సన్నితి మనీ. దోసము సుట్టు
కొన్న దనీ.

వెట్టో. ఏల ననీ. ఆటు కూసేది?

చండో. కూసు కా దనీ. కాసు కాసపడినదోసముగో సిదీ.

పిచ్చోఁడు ఏమి రనీ యది?

సండో సెప్పే దే మనీ! మోసము సేసిన దోస మని జోసయ్యా సెప్పలే దంట్రనీ.

వెట్టో. మా మేమిదోసము సేసితి మనీ?

చండో. కుత్తుకకు దెన్నెడిదోస మనీ, మాము సేసుకుంది.

పిచ్చో. ఏం దనీ యది? సెప్పక పానము దీసెదవే మనీ.

సండో. సెప్పే దే మనీ. ఇపుడు సెరలో యేసినసిన్నోణ్ణి సూసితిరి కా దంట్రనీ.

వెట్టో. సూసితినసీ. ఓఁడో దొరబిడ్డోణికి మ ల్లుండోఁ డ్రనీ ఆడూ.

సండో. ఓఁడో దొరబిడ్డఁడు కాఁ డనీ. మెట్టుపై పుట్టుచున్న కామయ్యా యొడలి
సింగారము సూ డం డ్రనీ.

వెట్టో. అవు ననీ. వీఁడు మనపత్తాపయ్యబిడ్డఁడే గామో లనీ? నాఁడు మా మెఱు
కల కిస్సి నోఁడే ననీ యీాఁడూ!

పిచ్చో. అవు నసీ, ఆఁడేరా. ఆడే సుమా.

చండో. ఆబూాసికొడు కుగ్గసేనుఁడు రేపొస్సి సూసెనా మనగొంతు కోసేసు నెసీ. యింకేంది దోసము నుట్టుకొనె నసీ.

వెట్టోడు ఒరే! నా కోయుత్తి దోసిందసీ. అటు సేస్తమా?

సండో ఏ మసీ యది? అట్టుకు వురితాడా?

పిచ్చో. కా దసీ. వెన్నుకు సల్రాయి కట్టుక బావిలో మునుకుట కామోాల్న సీ?

వెట్టో. అవి కావసీ. అవి యుత్తులా?

సండో. ఏమి సేవలె నసీ మరీ?

వెట్టో. మనపత్తాపయ్యా పాపోని గాపా టిని కాడ్డేవరను తలసును కూస్సున్నా డంట కా దసీ. ఇవుడే మాాము పోయి లోని దంతయు సెప్పిన యాాయు గ్గసేనుని సంపిస్సి మనలను కాపాడుతాఁడు కా దసీ

చండో. ఔనౌనసీ! బాగా వుం దసీ నీయుత్తి బల్బా గుం దసీ యోశన స క్క సేసితివసీ యేమితిని సేసితి వసీ మాాము తినినదే తిందువుకా వసీ. మాకు దోసనియుత్తి నీ కెటుదోసె నసీ. గురు నెద్ద సది తే మసీ? బ లుబాగుం దసీ అటులే సేత మసీ. ఈడ కొందరిఁ బెట్టి మా మిపుడే పో ద మసీ. పరుగిడుద మసీ.

వెట్టో. పోదము పదుఁడసీ పదపదం డ్రసీ. (అనుచు వెళ్లుచున్నారు.)

---

పంచమాంకము.

ద్వితీయరంగము — అరణ్యము.

(మంత్రి - ఉగ్రసేనుడు).

ఉగ్ర. చం. కటకట యిట్టిసేతలకుఁ గట్టడి వెత్తె? యెటుంగ నైతి నీ
తటమట; లక్కటా! తగని ద్రోహులు ద్రొక్కినవారి కీగతుల్
దిటములు గావె యెట్టియెడఁ? దీ పని గ్రోలితిఁ గాలకూటముం
బటుతర క్రూరకృత్యములుఁ పాతకె! చేసితి నీదుసంగతిన్. ౨౦౧

దుర్మదాంధుండ నై దోర్బలగర్వంబుచే ద్రోహంబు లెన్ని యో నీకొఱ కుఁ జేసితి! ద్రోహీ! తుద కీదురరణంబునకు ననుం గుఱి సేసితివే?

ఇట్టివాఁడ వీ వని తెలిసియుండిన నిను బట్టి నిట్టనిలువునం జీల్పించు నంతటిభుజబలం బుండెను గదా ? ఇపు డేమి సేయుదు.

సుమ. ఉ. ఓరిన రాధమా ? వినర మోర్చితి నిన్న టిదాఁక నీదుదు
ర్వారకఠోరభీకరనరాదదురుక్తులసూదిపోట్లకుం ;
గారణ మంత దీతెఁ; గడకట్టెను గార్యము లెల్ల; నింక నీ
కూరిమిమృత్యుకన్యకను గూడఁగ నిచ్చితిఁ బెండ్లియాడరా. ౨౦౨

ఉగ్రసేనా ! నీవివాహంబునకుం గన్యకామణిని గదా నే నిచ్చెద నంటి ని. ఇదిగో ! మృత్యు వనియెడియుత్తమాంగన నిచ్చితి. పెండ్లియాడుము.

ఉగ్ర. హా! ద్రోహీ! ఆహా! దురాత్మకా! ఓరీ! పాతకీ!

మ. చరణంబు ల్తెగి చావఁ బోవుతఱి నీచత్వంబునన్, దుర్మదా!
సరసాలాపము లాడ నాసరసకున్ సై యంచు రాఁ బోలునే?
విరసాలాపము లేల ? చాలు నిఁక నీవిద్య, ల్వినం జాలఁ, బో
పరగన్, దోర్బల మేను నమ్మి చెడితిం, బా లైతి నీబాధకున్. ౨౦౩

చాలు చాలు; ద్రోహీ! ఇది నీవైరశుద్ధికిం దఱి కాదు. నాదోర్బలగ ర్వంబున నేఁ జెడితి.

సుమ. క్రూరా! భుజబలం బే సర్వం బని గర్వించినవెఱ్ఱివి నీవు కావే ? బుద్ధిబ లంబునకును భుజబలంబునకును గలతారతమ్యం బిపు డైన నెఱుంగుము.

సీ. కాలానలాభీలహాలాహలముఁ గ్రోలి యేలాగు మనఁ గలఁ డిలను జీవి?
శూలాగ్రదాగ్రదిమందిరభద్రాయుధోదగ్రకోద్ధృతి కెటు లోర్చు నోరి మరుఁడు?
నాకారిఁ బోకార్చుపాకారిశ్రీకారి గాకారి నెదిరింపఁగలరె రిపులు?
జంభారిగంభీరదంభోళిజృంభణా సంరంభ మెటు సైచు శైల మరయ?
గీ భూరిసాహసబుద్ధిని భువ నెదిర్చి బ్రతుక నెటు లగు నోర! యాబ్రహ్మకైన?
నింక నైనను దెలియుమా శంక వదలి బుద్ధి కెన యగుబలిమి యీభువిని లేదు.

ఓరీ నీచాధమా! ఈభువిని బుద్ధికి సాటి యగుబలిమి లే దని చక్కగా న మ్మి ప్రాణంబులు విడువుము. ఇఁక నేఁ బోయివచ్చెద. (అనుచు సుమ తి వెళ్లుచున్నాఁడు. సన్యాసి వేషముతో సునందని ప్రవేశించుచున్నది.)

సన్యా సీ. అంగనాసంగుఁ జక్రాంగమా!చపలకులింగమా! కన్నులారంగఁ గనరె ?
రంగాదువాని సారంగమా! చకితకురంగమా! కన్నులారంగఁ గనరె ?

శృంగారయుతునిఁ బ్లవంగమా! పనితపతంగమా! కన్నులారంగఁ గనరె?
భృంగమా! కుటిలభుజంగమా! గరువంపు సింగమా! కన్నులారంగఁ గనరె?

గీ. తుంగవిక్రముఁ గనరె? యేకాంగులార!
సంగరోదగ్రుఁ గనరె? నిస్సంగులార!
జంగమస్థావరములార! మంగళాంగు
బంగరుకుమారుఁ గన్నులారంగఁ గనరె? ౨౦౫

సీ. గిరులార! తరులార! హరులార! కరులార! నారసికునిఁ గని నారె మీరు?
మాదారకునిలక్షణోదారకుని జీవనాధారకుని దారి నరయఁ గాన
ఇటులాయెఁ గటకటా! యెకిమీని బ్రతుకయో! చటులదుఃఖాగ్ని నేనెటులసైతు?
భూమీశుతనయ కీభూరితరారణ్యభూమరణమె విధీ! భువినిఁ జూడ?

గీ. కటకపుటభేదనంబులీ యటవులె? కట!
యాకటను జిక్కి స్రుక్కితి; నకట! నాదు
ప్రాణనాథునిపొలఁకువ గానరాదు,
తిరుగ నేఱ నిఁ కెయ్యది దిక్కు నాకు? ౨౦౬

నేటికి నాత్రాణ యుడిగె. ముం దొకయడు గిడఁ జాల! హా! ప్రాణేశ్వరా! మితి మీఱ నను కారణంబునం బ్రతిన సాగించితివి కాఁబోలును! పరోపకారంబునకై శరీరంబుం దృణమ్ముగఁ దెంచిననీపరమోపకారంబునకుం బ్రతి దుర్భరం బగునాశరీరంబుం ద్యజించుట తప్ప వేఱొకటి కాన. జీవితేశ్వరా! వేఱొకజన్మంబుననైన నిను గూర్పు నావందారుమందారుని గోవిందునిపాదారవిందమ్ములు డెందమ్మున నిల్పి శరీరమ్ముం ద్యజించుచున్నదాన.

ఉ. మందరధారి! శౌరి! నిగమాంతవిహారి! దయాప్రచారి! స
ద్బృందమనోబ్జచారి! యరిబృందవిదారి! త్రిలోకధారి! యో
బంధురక్లేశహారి! భవబంధవిమోచనకారి! శ్రీహరీ!
యెందును దిక్కు గాన నిఁక నేమని నే మనుదాన నిత్తఱిన్. ౨౦౭

శ్రీహరీ? జన్మాంతరమునం దైన నాసుగుణోదారుని నామనోవిహారుని నాసుదేవుని నావరునిగాఁ జేయుదు వని నిను వేఁడెద; మఱి కొనియాడెద. (అనుకొన్చుండఁ జేరువ నొకచెట్టుక్రిందఁ బడియున్న యుగ్రసేనుఁడు).

ఉగ్ర. కం. ఆహా! యిడుమలఁ గెడపెడు! బాహాబలగర్వ మవని బాడరె నిటని
ట్లాహా! దాహము! దాహము! హా! హా! తాపంబుఁ దాళ హాహా! చెడితిౕ.
హా! దాహము! హా! తాపము! హా! పాపము! హా! దైవమా!

సన్యా. ఇది యేమి? యీఘోరారణ్యంబున "దాహము" "తాపము" అని వాపోవుమానవుం డెవఁడు? పోయి చూచెదం గాక.

ఉగ్ర. అయ్యో! దాహము! నీ రిచ్చి రక్షించువా రీయరణ్యంబున లేరుగా! శ్రీహరీ! అయ్యో! తాపము!

సన్యా. ఎవఁడై యుండును? దాహంబుచేఁ బరితపించెడునీతఁడు? దాహం బిచ్చి యడిగెదం గాక. (నీ రిచ్చుచున్నాఁడు).

ఉగ్ర. దైవమాయ. క. ఎంతటిక్రూరుం డైనను,
నెంతటినాస్తికుఁడు గాని, యేమఱక హరిౕ
వంతలఁ గుందెడువేళలఁ
జింతించిన, బాధ తొలఁగు; సిద్ధ మిది భువిౕ.—౨౦౮

యోగివరా! నాద్రోహంబులు ననుం ద్రెక్కొనెను. క్షణక్షణంబునకు బలంబు తగ్గుచున్నది.

సన్యా. ఓరీ! నీ వెవఁడవు? నీ కిట్టిబాధ లేల కలిగె?

ఉగ్ర. యోగివరా! నాయుదంతం బొకచరిత్రగా నున్నది. నుడువ నోటం దడి లేదు.

సన్యా. (మనంబున) వీఁ డుగ్రసేనుఁడుగా నగుపడెడు. వీని కిట్టిదుర్మరణం బేల కలిగియుండును? ఇది యెవఁడో చేసినకృత్యంబుగా నున్నది. విచారింతము (అని నీ రిచ్చుచున్నాఁడు).

ఉగ్ర. తాపసోత్తమా! నా కీదుర్మరణంబుఁ గలుగంజేసినద్రోహిని నాయంతటి దురవస్థకుం దెచ్చెదవే? వాఁ డిపుడే పోయెను. ఇట్టిసమయంబున వాఁ డాడినయేటుపోటుమాటలు నాహృద్దయపుటంబున నాటి బాధించుచున్నవి. మాట లాడం జాలను.

సన్యా. ఆద్రోహి యెవఁడు? వానికి నీ వేమి సేసితివి? వాఁ డేల నీ కిట్టికృత్యం బొనరించెను?

ఉగ్ర. యోగివరా! నాదుపాపంబులు నోట నుడువం జాల. లేఖనసామగ్రి యిచ్చిన నే నెటు లయిన శ్రమపడుచు సంగ్రహంబుగా వ్రాసి యిచ్చెద.

సన్యా. మంచిది. అటులే సేయుము (అనుచుఁ జెట్టుపట్టయు నొకపుల్లయు నివ్వ నుగ్రసేనుఁడు ప్రవహించుచున్నతననెత్తుటిలో ముంచి యేమేమొ వ్రాసి)

ఉగ్ర. తాపసోత్తమా! ఈకమ్మం జేకొని యంద్రోహిదుర్వర్తనమును దేశదేశంబులం దెలియులాఁగు సేయుము యోగివరా! నాదారుణకృత్యంబునకుం జిక్కి రాకొమారు లిరువురు కళింగరాజధానియందుఁ గారాగృహములో నున్నవారు. వైళంబె యచ్చటికి విచ్చేసి వారిని జెఱనుండి వెడలించుప్రయత్నంబు సేయుఁడు. హా! దాహము! తాపము (అనుచు హీనస్వరముతో గొణుగుచుండఁ గన్నులు మూఁతలు పడుచున్నవి.)

సన్యా. (కొంతమఱుఁగునకుఁ బోయి)

మ. ధరలో జీవి శరీరధారి, యటు తా దారాదిసంఘంబులన్
బొరయం జొచ్చిననాఁటఁ గోలె, విషయాభోగంబులం జిక్కి, ప
ల్కరు దుష్కర్మము లాచరింప నవి యెల్ల న్గూడి దృశ్యం బగున్
మరణాంతమ్మున, జీవి భీతి నడలు న్స్పందుండు నిశ్చేష్టుఁడై. ౨౦౯

మత్తిల్లి మానవులు మురియుచుం జేసినదారుణకర్మంబు లన్నియు నాకారంబులు గొని మరణావస్థయందు జీవినిం బరివేష్టించిన వానిభీకరాకృతిం జూచి తనకృత్యంబుల కాజీవి చింతించుచుఁ బ్రాణంబులు విడిచెడు ననుటకు నీక్రూరాత్మునియనుభవమే సాదృశ్యంబుగా నున్నది — ఏమీ? వీఁడు కళింగరాజధానియందుఁ జెఱలో నిద్దఱురాకొమరు లున్నవా రని పలికెను. వా రెవరై యుందురు? ఒకఁడు నాముద్దుసోదరుఁడై యుండునా? వేఱొక్కండు నామనోహరుండు సుదేవుండు కానోపునా? ఏల యీయడియాస? వారినిం జెఱ నుంచుకారణం బేమి యున్నది? అటు లుండిన నాకుం దెలియ కుండునా? ఈక్రూరుం డేమో లిఖించెను. దానిం జూతము. (అనుచుఁ గమ్మ చదువుచు) హా! జయపాలా! నాముద్దులబాలా! విధి నీనొసట నిట్టిదుర్మరణంబు వ్రాసెనే? కాలజ్ఞులపలుకు లన్నియుఁ గల్లలాయెగా?

గీ. తల్లిప్రక్క నుండి చల్లగా నిద్రించు
పిల్లవాని నిన్నుఁ బ్రీతి లేక

యల్లనాఁడు క్రూరుఁ డామంత్రి పట్టించి
భల్లమునకు నిడెనె బాలభిక్షు? ౨౧౦

జయపాలా! ఈఘోరవార్త నీజననీజనకులు వినినతోడనె స్వర్గంబున నైన నినుం జూచెద మని తక్షణంబునఁ బ్రాణంబులు విడుతురు. నే నుండి ప్రయోజనం బేమి? ఈక్రూరుండు చెఱ నుండురాకొమారులను విడిపింపు మని వేఁడెను. వా రెవరోయీ? కమ్మ యంతయుఁ జదివి చూతునా? (అనుచు మఱలఁ జదువుకొనుచు) ఏమీ! ఏమీ! సుదేవుఁడా! నాసుందరుఁడా! నామనోహరుఁడా! ఎంతటికన్నులుండినగుడ్డి నైతిని! ఒడిలో బిడ్డ నుంచుకొని యూరెల్లఁ దెగ వెదకినట్లయ్యెం గదా నాబ్రతుకు! సర్వదేశంబులుం జూచితిం గాని నాపట్టణంబే నేఁ జూడ నైతి! ఏమీ? ఇంతటిద్రోహమా! ఇంతటిక్రూరమా! దారుణకర్మంబులకుం దుదిమొదళ్లు లేవా? అఖిలునకు మేము సేసినతప్పేమి? ఆదురాత్మకునిదుష్కృత్యంబులకుం గారణం బేమి కావలయును? పట్టణంబునకు శీఘ్రంబె పోవలయును. ఇంక నీకమ్మ పూర్ణంబుగాఁ జదివెదం గాక. (చదివి చూచి) వేఱొకరాకొమారుం డెవఁడై యుండును? ఆక్రూరుం డేద్రోహంబులం దలంచి వీరిసి కారాగృహంబున నుంచినవాఁడో తెలియకున్నది. కాలవిళంబము సేసిన నేప్రాణి కేకొఱంత కలుగునో తెలియదు. ఇతరాలోచన లిపు డేల? జీవించియుండినవారిని రక్షించినపిదప యోచనలకు సమయంబున్నది. వాయువేగమనోవేగంబులకు మించినవేగంబున నేఁ బోయి పట్టణంబు సేరెదం గాక. (అనుచు వేవేగ నేగుచున్నాఁడు.)

---

## పంచమాంకము.

### తృతీయరంగము. అరణ్యము.

(ప్రతాపుఁడు జయదేవి.)

ప్రతా. తపంబున నేకాగ్రచిత్తుండై మైమఱచి కూర్చుండియున్నవాఁడు

**జయ.** సీ. చేయుడఁ జాఱెడుచెలువారునునుమేను కఠినోపలంబులఁ గందువాఱె
పంకజంబులఁ బోలుపాదతలంబులు కంటకంబులఁ జిక్కి గాజువాఱె

పటుపీలిమచ్ఛాయఁ బరగినకేశము ల్చటులారుణచ్ఛాయ జడలువాఱ
సుమదామశోభితసురుచిరకంఠంబు తులసిహారములమెత్తులకుఁ దాఱ

గీ. నహహా! దైవమ! యీఘను ననఘు
నిటుల నేఁచగా నేల? నక్కటా! యేను మున్ను
పాపకర్మంబు సేయ నాఫలము లిట్టు
లనుభవమునకుఁ దెచ్చితే హా! ముకుందా! ౨౧౧

మ. అకటా! శ్రీహరి! యచ్యుతా! యనఘ! యోయానందరూ! పావ్యయా!
యకళంకం బగునీమమంత్రజపనిష్ఠాధీనమానస్కునిఁ
సకలోర్వీతలరాజవంశతిలకు న్సాంద్రబాజ్యధౌరేయునిఁ
వికటవ్యాకులవారిపూరమున నివ్విరాగ్రణి న్ముంచితే? ౨౧౨

ఉ. రా రఘురామ! రాక్షసవిరామ! విశాలయశోభిరామ! రా
రా రవివంశసోమ! మధురాక్షరపావననామ! రావదే
రా రణరంగభీమ! సువిరాజితసుందరకామ! ప్రోవఁగా
రార త్రిలోకధామ! నతరక్షణ! నీ కిది నిండుభారమా? ౨౧౩

సీ. రామ! పరంధామ! రవికులార్ణవసోమ! రామరామా! రమారామ! రార!
నిర్వికల్పా రార, నిర్వికారా రార, నీలమేఘశ్యామ! నీవు రార;
సగుణనిర్గుణ రార, సద్గుణాంబునిధాన! రా, భవదుఃఖవిరామ! రార,
సర్వలోకాధిశ! సకలజీవోపాస్య! రామ! రక్షోగణభీమ! రార;

గీ. రార రామా! త్రిలోకాభిరామ! విజిత
రామ! శ్రీరామ రఘురామ రామచంద్ర
జానకీరామ! నృపకులసార్వభౌమ!
వినుతసుత్రామ! త్రైలోక్యవిమలనామ! ౨౧౪

కోకిలకాకలీవృత్తము. ఘన మని నీదునామమును గానము సేసితి నే,
మనమున నీదుమంత్రమును మానక యుంచితి నే,
ధన మని నీదురూపమును దాఁచితి నే నెద నే,
కనికర మేడ రా? కనవు కావర మ్రొక్కితి నే. ౨౧౫

రామా! పరంధామా! నీవు సర్వజ్ఞుండవు, సర్వకర్తవు, సర్వభర్తవు, సర్వహర్తవు, సర్వసముఁడవు, సర్వసాక్షివి, నిర్వికల్పుఁడవు, నిర్వికారుఁ

డవు, నిరంజనుఁడవు, నీమహిమానువర్ణనలు లెక్కిడ, హిరణ్యగర్భాదులకు నలవి కా దన, దిక్కుమాలిననాకు శక్య మగునే? దీనరక్షకుండ దనుజిరు దక్షురుండ వగునీ కక్షయంబుగ నున్నది. ఈభూభర్తను నాప్రాణభర్తను వ్యసనపారావారంబునుండి యెత్తి తీరంబుఁ జేర్చెద వని దీనురాలనై వేఁడెద. ప్రోవరా. కరుణించి కావరా. రామా! రామా! రామా!

ప్రతా కన్ను లరఁ తెఱచి జయదేవిదిక్కునకు మఱలుచున్నాఁడు.

* ప్రశ్నోత్తరరూపకోకనదవృత్తము.

ప్రతా చింత వల దాచిన్నికొమరుని చేడియరో కను చేతిలో.

జయ. వింత లివి మీ రెంతఘనులరో వేగ సుతుఁ గన వేడెదర్.

ప్రతా. కాంత! యిదె శ్రీకాంతు మది నిడి కంటిఁ దనయునిఁ గన్నులర్.

జయ. భ్రాంతి వల దాబాలుఁ గనుటలు పాతకుల కెటు లబ్బెదుర్. ౨౧౬

ప్రతా. దేవీ! భ్రాంతిపలుకులు గా వివి నేఁ గన్నులారఁ జూచితి

ఉ. అన్నులమిన్న! "కన్నులకు నామెత వెట్టెడువన్నెలాఁడు, నీ
చిన్నెలచిన్నవాఁడు, బలుచెన్నుఁడు, పున్నమతేనికన్న మో
మెన్నిక గన్నవాఁడు, నెఱ సెన్నుఁగ సు న్నయి యున్నవాఁడు, నీ
మన్ననవాఁడు,వీఁడె,కనుమా,కొనుమా," యనె వెన్నుఁ డిప్పుడే. ౨౧౭

జయ. ప్రాణనాథా! బాలునిపై నుండుమోహాధికంబుచే దేవర కట్టిభ్రాంతి కలిగినది.

కం. మెలఁకువ మనుజుం డెయ్యది
బలుమోహాత వలచివలచి పలుమరుఁ దలఁచుం,
గలలో నది మదిఁ బెనఁగొని
వెలి యవు, నిది భ్రాంతి యనఁగ వెలయును జగతిర్. ౨౧౮

నాథా! యిది భ్రాంతి. నిర్భాగ్యులకు మన కేల సుతునిం గనియెడు సౌభాగ్యము, కలుగు?

ప్రతా. దేవీ! కన్నకుమారునిం గన్నులారఁ గనినది యామహానుభావునింద్రజాలవిద్యాకౌశల్య మందువే? చతుర్దశలోకంబులు దృశ్యాదృశ్యంబులు సేయం జాలినమహాఘనునకు నాయట్టివాని నొకని నీరీతి భ్రాంతిలో గెడపు టేమియసాధ్యంబు?

* ౨౧౨ ౨౦ వవ చందంబున 849871 వవ్వ త్తము. భ. య. న స. న. స హలు 12 వ ది యతియు.

సీ. సర్వలోకంబులు సాదృశ్యమై యుండ సర్వశూన్యం బని సాక్షి నిలుచు,
సర్వశూన్యం బని సాధించువారికి సర్వలోకంబులు చాటి చూపు;
ఇందు లేఁ డందు లేఁ డెందు లేఁ డనువారి కం దందు నగుపడు నధికముగను;
చిట్టడుగులపట్టి పొట్టి పేఁ డనువారి కట్టె విరాడ్రూపుఁ గొట్టి చూపు;
గీ. రూపహీనుండు వీఁ డన రూపు సూపు, నంబుచరుఁ డని చూచిన నవని నిలుచు;
నవనిచరుఁ డన నగుపడు నంబరమున, నౌర! హరిమాయ లెఱుఁగఁగ నగునె తరుణి;
కం. హరి యన హరి నరుఁ డగు ధర, నరుఁ డన నే నరుఁడఁ గాను నరహరి నెయనున్;
నరహరి యనఁ గా దని, తా నరరక్షణబిరుదుఁ దాల్చు నాతిరొ వినవే. ౨౨౦

ఇట్టిమహేంద్రజాలంబులు కరతలామలకంబులుగాఁ గలమహానుభావున కు నెకబాలుని నాకుఁ జూపి మఱలఁ జూపక మఱుఁగిడు టేమి యశక్యం బు. తరుణీ! నాపుత్రుని, శుభగాత్రుని నేఁ గన్నులారఁ జూచితి. నా సుతుండు లేనిది యీజీవనం బేల?

ఉ. పుత్త్రుడి లేనిభాగ్యమును, బుత్రుఁడు లేనినివాససౌఖ్యమున్,
విత్తము లేనికార్యము, వివేకము మానినవానివైద్యమున్,
జిత్తము లేనినాతిరతి, చిత్తజవైరివిహీనగ్రామమున్,
రిత్తగు, లోభికల్మి బలె, రెక్కలు వ్రాయినపక్షికైవడిన్. ౨౨౧

ఉ. శీతకఫాదిరోగములఁ జిక్కుచు నుండఁగ వచ్చు; శ్రీహరీ!
భీతజరాదికష్టముల పెక్కుదినంబుల నోఁపవచ్చు, ఘో
రాతపనిర్ధనాదివిపదబ్ధిని మున్గఁగ వచ్చుఁ; గేశవా!
భూతలమం దఘోర మహా! పుత్రవియోగము గోం నేరికిన్. ౨౨౨

హా! ప్రాణంబుం ద్యజించుటకై ఘోరోపవాసంబు లెన్ని యొనరించిన ను బొందిలో మొండివడి ప్రాణంబు వెడల కున్నదె. ఆయుఃపరిమితి ప్రాణికి నూఱేం డ్లయినం "బాపీచిరాయు" వను వచనప్రమాణమునఁ బ పికిఁ బదినూఱేండ్లు కాఁబోలు. ఇట్టిది కదా యాబ్రహ్మసంకల్పము?

ఉ. జోగికి నిచ్చుఁ బుత్రులను జొప్పడ, శ్రీదున కివ్వఁ డొక్కనిన్;
యోగికిఁ గూర్చు సుందరిని నొప్పఁ, గురూపిని భోగి కిచ్చుఁ బో;
రాగిని రోగిఁ జేయును, విరాగికి దేహపటుత్వ మిచ్చెడుం,
ద్యాగిని జోగిఁ జేయు, బెడిద మ్మగునంపద లిచ్చు లోభికిన్. ౨౨౩

ఈరీతి బ్రహ్మ యకటావికటములు సేయుచు జనుల ననేకబాధలం బెట్టె డు. ఏమి సేయుదు. నా కేల పుత్రసుఖంబు? వాని న్మఱచెద నన్నం శాడుమనస్సున కేలనో మఱపు రాదు హా! దైవమా! (పొంచి కాంచికొని యుండినచెఱగావలివాండ్రు ప్రవేశించుచున్నారు.)

చండోడు. వెట్టోడా అబ్బా యమ్మా పాపోనిక్లై పానాలి డిసెరంట్రసీ .సూ్తిణ్నసీ. అబ్బ తాప సయ్యాఁడసీ. ఇపు డూఱ కుండాఁడు పోదాం పదం డ్రసీ.

వెట్టోడు. అవు నసీ యమ్మ సూడు. సివికిసివికి గాలికి పోలా గున్నది కన్నీళ్లు సూ డసీ కాలువలై పాఱుసున్న యి? మా మసీ యింత సేసినవాండ్లమ్. నాఁ డెఱుక లేకపోయె నసీ నేఁ డయినను బిరాల్న సెప్పుదా మసీ: (అనుచు నందఱు బోయిం జోహారు లిడుచున్నారు).

చండోడు. బాబోరూ! నీబిడ్డలము మాము. దండం, దండం. జయమ్, జయమ్.

ప్రతా. ఓరీ! కాఱడవులు సేరి యిడుములు వడునాయెడ కేల వచ్చితిరిరా?

వెట్టోడు. యబ్బా! నీసిన్నోఁడు నీయూరిసెఱలో నుండోఁడు. బాబయ్యా!

ప్రతా. ఓరీ! ఏమీ! నాచిన్నికొమారుఁడు నాపట్టణంబునఁ జెఱలో నున్న వాఁడా? నాపుత్రునిం జెఱం బెట్టినధూర్తుం డెవ్వండు?

చండో. యబ్బా! మాలను మన్నిస్సెద నన్న సెప్పెదము బాబా

ప్రతా. ఓరీ! మిము మన్నించెద. యదార్థంబు పలుకుఁడు.

చండో. యబ్బా! యుగ్గసేనప్ప యాకందును దోపిస్సి మాకిస్సి తల నెట్టు మని సెప్పె. మా మాసిన్నోణ్ణి సూసి తల నెట్ట సెయిర్రాక (వ్రేళులు చూపుచు) యెఱుకల కిస్సి వాఱల కిస్సితిమి ఆసిన్నోఁ డెట్టో యిపుడు మఱల మనసెఱలో కొస్సె బాబోరూ.

ప్రతా. హా దైవమా! రాజాధిరాజకుమారునకుఁ గారాగృహవాసం బయ్యె నే? ఇది దైవమాయ. ఉగ్రసేనుం డేల యీదారుణకర్మం బొనరించి యుండును? ఓరీ! యుగ్రసేనా! దురాత్మకా! దుర్మదాంధా! దుర్మతీ, ఇట్టిదురాచారంబులు దుర్వర్తనలు దుష్టకృత్యంబులు ద్రోహంబులు సేయం జేయింపం జేతు లెటు లాడెరా?

గీ. ఎట్టినేరంబు సేయ నే నెన్నఁ డేని
నిట్టిద్రోహంబు నీ కెట్టు పుట్టె నకట!

పట్టి వలపులపుట్టినిఁ బట్టి శిరముఁ
గొట్టఁ దలఁ పెట్టు పుట్టెరా? ఘోరపాపి ౨౨౮

హా హా, నీచాధముఁ డగువాని కీర్తి ద్రోహగుణంబే నైజంబు కాఁబోలు. పామునకుం బాలు వోసి పెంచినరీతి నీకృతఘ్నునిం బోషించితి.

తరళవృత్తము. పరగఁ బ్రీతిని బాలు వోయుచుఁ బాముఁ బెంచినభాతిగా
ధరణి మాంసము వెట్టి వ్యాఘ్రము దండ నుంచినరీతిగా,
నిరపరాధిని నెయ్యుఁడై కడునీచుఁ డేఁచుటనైజమే,
యరయ శర్కరఁ బోయ వే మెటు లందునో మధురత్వమున్ ?

ఆసుకుమారబాలుం డటఁ జెఱయం దిడుమ లందు చుండ నే నిట ని మిషం బైన నిలువం జనదు దేవి వేగంబె పట్టణంబునకుం జని మన పుత్రుని మనములారఁ గందము రమ్ము శ్రీహరి నేడు మనపాలిటివాఁ డాయె. శీఘ్రపటిదినంబే మనము పురంబు సేరవలయు.

జయ ప్రాణనాథా! మనంబునకంతెను వేగం బగుగమనసాధనం బొకటి యుం డిన మన మిప్పుడే పురిం జేరి పుత్రునిం జూచుచుందుము కదా! కాలవి ళంబ మింక వలదు. ప్రయాణం బయి పోదము రండు కారాగృహపాల కులారా! మననగరంబునకుఁ దోవ తీయుఁడు.

చండా. సిత్తంబాబోరూ! దై సేయండి ఇటు, ఇటు. (అందఱును వెళ్లుచున్నారు.)

---

## పంచమాంకము.

### చతుర్థరంగము - మంత్రిమందిరము.

సుమతి (ఆత్మగతము).

విభూతివృత్తము. బుద్ధి యున్నవానికే కద్దు భూరిసౌఖ్యమున్,
బుద్ధి లేనివానికే పెద్దదుఃఖ మిద్ధరన్,
బుద్ధి కిమ్మహిన్ భలా సిద్ధి కాని దెద్దిరా?
బుద్ధి లేనివాఁ డిలన్ గద్ది యెద్దు మొద్దురా. ౨౨౯

ఉ. మే లగుబుద్ధి లేనియెడ మేదిని సంపద లందఁ గోరుటల్,
గాలము లేక జాలరులు గాఢపుమీలనుఁ బట్టఁ గోరుటల్,
తాలిమి లేక మోక్షమును దాపసి పొందుగ నందఁ గోరుటల్,
వాలము లేక ఘోర మగువాలముల న్వైస జంపఁ గోరుటల్. ౨౩౦

ఇంతగాఁ జెప్ప నేల? బుద్ధి లేనివాఁడు పశుతుల్యుఁడు రాజ్యంబునకు నే స్వతంత్రుండ నైతిని. ఇఁక నేఁ జేయుకార్యం బేమి యున్నది? రాజ్యంబులోనిజను లందరు శ్రీమంతు లై ధనగర్వంబుచే విఱ్ఱవీఁగుచున్నవారు. భాండాగారంబు సిరి తఱిగి యున్నది. ఆపిచ్చిప్రతాపునిచేత నెట్టిసన యుండెనో గాని యెంతద్రవ్యము వచ్చినను భూసురులపాఁతం బెట్టుచుండెను. బ్రాహ్మణుం డని పేరు వెట్టుకొనినం జాలును వానికి మిక్కుటం బగుహిరణ్యదానం బేమి, పెక్కు లగుగృహభూదానంబు లేమి, సేయుచుండెను. వల దనినఁ గోపంబున నెగిరిపడుచు వచ్చె. రాజ్యసంపద హెచ్చింప నిఁక నాశక్తిం జూపెద.

ఉ. రాఁబడి యెంత ప్రస్తుతపురాజ్యములో నిరుపద్మము ల్కదా?
యేఁబదిపద్మము ల్కనఁగ నింతనె సేసెద, వెఱ్ఱిభూధవుం
డాఁబసి బాపనయ్యలకు నర్పణసేసెను భూమితోడ, నిం
కేఁ బనిమాని పన్నుల ననేకముల న్దనివోక కట్టెదన్. ౧౨౮

సీ. ఉప్పున కేలనో తప్పించెఁ గప్పంబు? సిప్పు డేఁ గట్టెద నినుమడించి;
కట్టెకంపల కేల పుట్టుచావుల కేల కిట్టఁ డయెను బన్ను గరుణ వదలి?
పంటకాపులు భూమి పన్నులొక్కటె కాని పంటలోఁ గో రేల పతికి నిడరు?
భూషణాదుల కేమి, భోజనాదుల కేమి, భూపతికిని లేదె భూరిధనము?

గీ. తండ్రి పరలోకగతుఁ డైనఁ దనయుఁ డెటుల
నధిపతికిఁ జాలధన మీక యతనిసొమ్ము
లందఁ గోరెడుఁ? దండ్రికి నౌరసుండె
తా నఁ లంచును బుజు వె ట్లతండు సేయు? ౧౨౯

క. జగడము లాడెడువారికిఁ। దగవులు దెల్పెద నటంచుఁ దగవరి నై నేఁ
బగతు రగువారియనుమతి। మిగులధనంబులను గొంచు మించెద సిరిచే.

ఈరీతి ననేకవిధమ్ము లగుపన్నులు గల్పించి జనులసంపద లాకర్షించి సిరితోఁ దులఁదూఁగుచుండెద. మఱచితి! అరణ్యంబు సేరినసుదందనిప్రాణంబులు నడవి నుండుప్రతాపునిప్రాణంబులును నాహస్తగతంబులు గావలయుం గదా? మొదటిది యొక టయిన రెండవది తోడ్తోడఁ దానె యయ్యెడిని. పిమ్మట రాజ్యదానపత్రంబున కేమి నాచేత నుండుపనియ

కదా. ఱేపటిదినంబే యాపనిం బూనెదం గాక ప్రొద్దు చాల పోయిన
ది నిదుర వచ్చుచున్నయది? నిద్రించెద. (అనుచుమంచముపై నిద్రవ్రా
వుచు నిట్లు కలవరించుచున్నాఁడు.) ఓరీ! యుగ్రసేనా! చూచితివే!
హీనం బగుభుజబలంబు ని న్నెంతటిమర్దకుం దించె! అహీనం బగు
బుద్ధిబలంబు న న్నెంతటిమహార్దశకుంబెంచె? ఓరీ! నిజ మాడితి నని
గు డ్డెట్టఁజేసెద వేలరా? క త్తి యేల వఱ దీసెదవురా? వలదు. వలదు.
నాగొంతుఁ దఱుగ వలదు (అనుచుఁ ద్రుళ్లిపడి లేచి) ఏమియిది! ఇట్టి
దుస్స్వప్నంబుఁ గంటిని. మఱలఁ శయనించెద (పండుకొని) జయపాలా!
బాలగ్రహంబుమాడ్కి నీ వేల వచ్చెదవు? చాలు-చాలు ఆమాట
లేల? నీవు బ్రతికియుండిన రాజ్యంబు నా కెటులు లభింపం గలదు?
ఏమీ? మ్రింగ వచ్చెదవు? వలదు. వలదు. మ్రింగవలదు. (అనుచు
మఱలఁ ద్రుళ్లిపడి లేచి) ఇది యేమి? చెడుకల లొకటిపై నొకటి నాని
ద్రాభంగంబుఁ గావించుచున్నవి? చేసినకార్యంబులు మనంబున నుండి
బాహ్యేంద్రియంబు లామనంబునకుం బని పెట్టి సుషుప్తిసమయంబునఁ
దా మామానసేంద్రియంబునకుం బని యిచ్చును. ఇట్టిదికదా స్వప్న
లక్షణంబు వెఱవ నేల? (అనుకొని మఱల నిద్రించుచు) హా! సుదే
వా! ఆమంత్రిసుతి బలుచక్కనిది నిను మోహించినది. నీవుదాని
వివాహంబునం జేకొంటి వేని నీచెఱ దప్పు అది కా దనినఁ గారా
గృహమరణంబే శరణంబు. సందియంబు లేదు. విదువు మిఁక సునందని
పై మోహంబు. అది మరణంబు నొందినది. ఏమిరా నరక నుద్యుక్తుఁ
డ వయ్యెదవు? వలదు. వలదు. నరక వలదు (అనుచు మఱల లేచి) చా
లుం జాలు! ఈరాత్రి నాకు నిద్ర వలదు. కనుఱెప్ప లింత వాల్చినతోడనే
చెడుకలలు వచ్చుచున్నవి. మఱల నాకారాగారంబువకె పోయి సామా
ద్యుపాయమ్ము లచే నాసు దేవునిఁ ద్రోవకుఁ దేఁ జూచెదం గాక. (అను
చుం బడకటిల్లు విడిచి వెళ్లి పోవుచున్నాఁడు).

---

## పంచమాంకము.

పంచమరంగము — కళింగదేశాధీశ్వరునిసభామందిరము.

ప్రతాపుఁడు — జయదేవి — సుమతి.

ప్రతా. సుమతీ! మనరాజ్యంబునం దెట్టియద్భుతంబులు గలిగెను చూచితివే?

సుమ. అద్భుతం బేమి? ఏవిషయమున?

ప్రతా. మనజయపాలునివిషయముననే.

సుమతి. జయపాలునివిషయంబున బ్రహ్మలోకపర్యంతం బాలోచించినను బ్రహ్మభేద్యం బై యున్నది.

ప్రతా. సుమతీ! నిజము. తెలియనపు డంతియే కదా? వాఁడు మనపట్టణంబునం జెఱసాలలో నున్నవాఁ డట. దేశదేశంబుల నీ కెట్లు గాన్పించెడిని?

సుమ. ఏ. ఏ. ఏ. ఏ. ఏమీ? జయపాలుఁడు! మనజయపాలుఁడు! మా రాజపుత్రుఁడు! మనచెఱలోనున్నవాఁడా? ఎటులు?

ప్రతా. ఎటు లయినది నీ కెట్లు దెలియును? ఇంటిదొంగను బ్రహ్మయుం బట్టఁ నేఁ డుగా దే? ఆబాలుండు చావుం దప్పించికొని చెఱలోఁ బడ్డవాఁ డఁట.

ఉ. నచ్చినసేవకుండు దను నమ్మినవానికి ద్రోహ మెంచినన్,
మె చ్చుగుముచ్చిక న్నగనిమెచ్చులు నచ్చికి లెచ్చఁ జేసి తాఁ
దచ్చన లాడి భార్య కడుఁ దప్పుడుద్రోవలు ద్రొక్కఁ జూచినన్,
జొచ్చుచు వారిచిత్తములు సూడఁగ బ్రహ్మకు నైన శక్యమే? ౨౩౧

సుమ. (గడగడవడఁకుచుం దనలో) అయ్యయ్యో! దైవమా! నాద్రోహం బెవ్వఁడో తెలిపి యుండుం గాఁబోలును! (ప్రచురముగా) రాజేంద్రా! నే నేపాపకర్మంబు నెఱుంగనే? నే దేవరవిషయంబున నట్టిది తలపెట్టుదునే? (ఆలోచనము నభినయించుచుఁ దనలో) నిజ మాతని వలనఁ గనుగొననిది యీ యుత్తరంబు నాకేల? ఇందువలన నది నేఁ జేసినద్రోహం బని యాతండు విని యుండకున్న ననుమానము గల్గించినవాఁడ నగుదుం గాదే? (ప్రచురముగా) మహాప్రభూ! అట్టిద్రోహులు సైతము ప్రపంచంబునం గలరా? అంతటిపాపమా? ఆపాపి యెవఁడో? వానిపే రేమో?

స్రగ్ధరావృత్తము.

భూపాలా! యిట్టిద్రోహంబులు భువి నెపటం బోలునే? ఘోర మయ్యో!
పాపాత్ముం డెవ్వఁ డాహా! పతి కహితముగ న్బాలునిం జంపఁ బూనెన్?
కోపాటోపంబు మీఱ న్గలిశసమమహాఘోరశాతాసిధారన్
వాపోవం బట్టి వాని న్వడి శిరము దెగ నైవ్వచెదం బేరుకొమ్మా. ౨౩౨

మ. లలితాకారుని బాలు నెవ్వఁ డిట నిర్లజ్జంబుగా నట్లు గా
సిలఁజేయం బనిఁబూనె? నెట్టు తలఁచెం? జే యాడె నేరీతి? నా
కులవిధ్వంసిఁ గృతఘ్నుఁ గ్రూరుఁ గుజను న్గ్రోధంబున న్బట్టి, నేఁ
దలఁ గొట్టించెదఁ, బేరుఁ దెల్పుఁ డిఁక నేఁ దాళన్ నృపా! యోపఁగన్.

ప్రతా. సుమతీ! ఇంచుక నెమ్మదింపుము నిదానంబున విచారించి నిజంబు దెలియ వలయును. కోపంబునం జేసినపని పాపంబునకుం గారణం బగును.

గీ. ఓపికను బాపు, బుద్ధిని నూఁపు, సుఖము
నాఁపు, నురుపాపములఁ గూర్చి నూఁపు, నయము
ప్రాపుఁ బెడఁబాపు, మాపును మాపు, నౌర!
కోప మనురోగతాపంబు డాఁప వలదె? ౨౩౮

సుమతీ! యిట్టిపాపకూపం బగుకోపంబుం బూన వలదు.

సుమ. ప్రభువర్య! దేవరవాక్యామృతధారలు వీనులారం గ్రోలి యెంతకాలం బయ్యె! ఇట్టిశాంతగుణంబు ప్రపంచంబున నెం దేనియుం గలదే? భళిరే! యెట్టిమహానుభావులరు!

ప్రతా. సుమతీ! మనసునందని యిచటికి రాక యున్న దేల? ఉగ్రసేనుం డేల రాక యున్నవాఁడు? నారాక వారికిం దెలియదు గాఁబోలును. వేవేగ రప్పింపుము

సుమ. (ఇంచుకయోచించి) మహాప్రభూ! నే నే మని తెలుపుదు?

ప్రతా. అ ట్లందు వేమి?

సుమ. స్వామీ! ఇప్పుడు కొన్ని దినంబులుగ వా రిరువురును మనపట్టణంబున లేరు.

జయ. నాథా! నామనంబున కేమియో భీతిగా నున్నది

ప్రతా. (చింతించుచు) సుమతీ! ఇది యేమి యద్భుతంబు? సునందని రాజ్యంబు విడచి పోవుటకుం గారణం బేమి? ఏదియుం దోఁచకయున్న దే!

సుమ. మహాప్రభూ! మనపట్టణంబున నుండుచారుల నందఱను సునందనిసమాచారంబుఁ దెం బంపినాఁడను. విచారంబు వలదు వా రింతలో వచ్చెదరు. దానింగూర్చి నెమ్మదిమీఁద మనవి చేయుదుం గాని, మనబాలుఁడు చెఱయందు నున్నవాఁ డన్న నద్భుతంబుగ నున్నది. చూచి యిటకుంగొనివచ్చెద (రాజదంపతులును వెంట వచ్చుచుండుటచేత వారు చెఱలోనికిను దే

వుని: జూతు రనుదిగులున బిఱబిఱం జని జయపాలుని: జూచి భగ్నమ
నోరథుండై చేయునది లేక) మానాన్న! మాతండ్రి! నాబంగారుకొండ!
నిన్నీచెఱయం దెవ్వ రుంచి రోయీ! (యనుచు జయపాలుని భూషించు
చు: బ్రతాపునిచేఁబ్రవకుం దెచ్చి యొప్పించుచున్నాఁడు.)

(ప్రేమతోఁదలిదండ్రులు జయపాలుని నామంత్రణంబు సేయు) సీసపద్యము

జయదే. రార రాజకుమార! రాజితసుకుమార! రా సుగుణోదార! రారతండ్రి!
ప్రతా. రా రాజవంశపారావారహిమకర! రా మంగళాకార! రార తండ్రి!
జయదే. రా లాలితాకార! రా లక్షణశరీర! రా సుతశేఖర! రార తండ్రి!
ప్రతా. రా పటుతరశూర! రారా మనోహర! రా మేరుసమధీర! రార తండ్రి!
జయదే. రార ముద్దుతనయ! రార నానాయనా!
ప్రతా. రారి చిన్నిచిఱుత! రార తండ్రి!
జయదే. రారయడవి నెంత రారాపు వడితివో,
ప్రతా. రారి యింతకష్ట మేరి నీకు? ౨౩౫

ప్రతా. కం. రెయ్యిం బవలును పదలక! నెయ్యంబున నెత్తి పెంచి నిను నా డడవిం
గయ్యాలఁ బడవైచితి నే!నయ్యో! నాయన్న! యెంతయడలితివొ కటా.

జయదే సీ మెత్తనిపఱుపులె యెత్తెడు ననునీకు నెట్టులు గులకఱాలితవు లయ్యె?
నీరెండకాకకు నెడ రగునీ కయో! బీఱెండవడి యెటు ప్రీతి యయ్యె?
పాయసాన్నముఁ దినుపాలపాపఁడ! యెటు లాకలములుతింటివయ్య! తనయ?
చలిగాలి దవిలిన శైత్య మయ్యెడినీకు వర్షధారల వెట్టు వంటె తనయ?
గీ. అహహా! విధివ్రాఁత యెంతటియబ్బురంబొ!
వంత లోనగూర్చు నెంతశ్రీమంతునికిని;
భూరినిర్భాగ్యునకు నిచ్చు భోగవితతి;
రాజరాజును మిగుల రారాపు వెట్టు. ౨౩౭

హా! హా! తనయా! ఇది విధిమాయ. దీని మీఱ నెవ్వరివశ మగును?

జయపా. క. తొల్లిటిపాపఫలంబుల! నెల్లను భుజియించితి నిటు లేఁ బాపిని; నిఁక
దల్లీ! యెంతటివంతలఁ! దల్లడిలం జేసినాఁడఁ దనయుఁడనై హా! ౨౩౮

అమ్మా! దుఃఖింపకు జననీజనకులసుఖదమనుం డగుతనయుఁడు తనయుం

డనం దగునే? ఈ ప్రపంచమునం బుత్రులవలనఁ దల్లిదండ్రులకు నెల్లకాలం
బెడతెగనిదుఃఖంబు గాక సుఖంబు లేశమాత్రం బైనను లేదు కదా!

సీ. తనువులు తఱుఁగఁగఁ దల్లడిల్లుచు ఘోరతరముగఁ దపములఁ దలరితలరి,
ఆపన్నసత్త్వకు నాపద కలుగునో? యని యహరహముల నడలియడలి,
బాలగ్రహముల బాధలు గలుగునో బాలున కని చాల బడలి బడలి,
వినయంబు విద్యయు వితతవివేకంబు గలుగు టెప్పుడో యని కలఁగి కలఁగి,

గీ. తల్లిదండ్రులు కలకాల మెల్ల నిటులె
యుల్లమున భీతి నొందుచు నుండువారు
సుతులమేలునకై యిట్లు చూచుచుండు
కన్నతలిదండ్రులసుఖంబు సున్న కాదె. ౨౩౯

జన. అది యేలనో గాని ప్రపంచంబునం దల్లిదండ్రులకుఁ బుత్రవాంఛ యిం
చుక మనంబునం దవిలినతోడన వ్యసనం బనుబీజంబు దానియందు నా
టుకొని దినదినంబు వర్ధిల్లుచు వారిహృదయంబునం దొక భూరివృక్షం బై
యుండుఁ సంతసం బనుసస్యంబు ఫలింపకుండు తల్లీ! కన్నీ రేల విడిచెదవు?

సుమ. తలపైఁ గొట్టికొనుచు జయపాలునిఁ గౌఁగిలించికొని

గీ. దండధరునికూరదండంబు ఖండించి
చావుఁ జంపి తౌర! జగ మెఱుంగ
వీర! శూర! ధీర! స్థైర! నీసరి యేరు?
రార రాకుమార రార తండ్రి! ౨౪౦

సుకుమార రాకుమారా! ఏ ద్రోహి యనుకంపారహితుండై నీయసు
వులు వెస నార్పం దలంచె? ఎంతటియున్మాదుండో గాక యిట్టిద్రోహం
బు సేయఁ బాల్పడు నే?

మేఘవిస్ఫూర్జితవృత్తము.

ఉమాదంబున్ హెచ్చె యురగమును దా నూఁచి పై నుంచికొన్నన్,
క్షమానాథా! బాధన్ గలవక క్షమం గాచునే మత్తుఁ డన్నన్?
కుమారా! యారీతిన్ గుజనుఁడు నినున్ గ్రూరతన్ గొంతుఁ గోయన్,
సుమాళిన్ దాఁ బూనెన్ సుమతి బలముం జూడఁడా యింక నైనన్? ౨౪౧

జయపా. అమాత్యవరా నావిధి కెవ రేమి సేయుదురు? కోపంబు వలదు.

పద్మనాభవృత్తము.

కోపంబు నీ కేల పాపాత్ముఁ డీభూమిఁ గ్రొవ్వారి మున్కృత్యము ల్సేయ నెంతే
నాపాపి నేవేళ నేదిక్కు నెన్నఁటి యాకర్మ ఘోరాహిగాఁ గుట్టుచుండుఁగా,
దాసంబున న్వాఁడు దార్హ్మాణి యీతీరు తాఁఉ స్తపించుం దలంచు న్మనంబం
దేహాఖిజీవచ్ఛవుం జంపఁగా నేల? నెవ్వానిపాపంబు లవ్వాని గ్రింగుఁగా ౨౮౨

మంత్రివర్య! నాగాదిలియక్కయ్య యెక్కడ? రప్పింపుము చూడఁ గోరెద.

సుమ. జయపాలా నాఁడు నీ నడవి మము నెడఁబాసిననాఁటనుండి నీతలిదండ్రులు గాఁఉడవులఁ గడునిడుమలు పడుచు నాసునందనిని రాజ్యంబేల నియమించిరి. ఆమానినికి నీపై నుండినప్రేమాధికంబున నీవియోగంబు సైపఁ జాలక రాత్రింబవళుల నినుం దలంచుచు, నీగుణంబు లుగ్గడించుచు, నిపుడు గొన్నిదినంబులుగా రాజ్యంబు విడిచి పోయినది. నినుం గనినసంతసం బెంతిగా నుండెన నామానిని పోయినవ్యసనంబు నామానసంబుం బాధించుచున్నయది. ఏమి సేయుదు.

జయపా. హా! హా! సునందని నాకుఁగా నీ కిన్నియిడుమలు సంభవించెనే? నా బ్రతు కిఁక వ్యర్థము, వ్యర్థము.

సీ. ఈడగుపోఁడిమి నూడిగంపుంజెలు ల్తోడు వీడఁగ నేఁడ వాడు నొక్కొ?
కడుపిన్నగాడ్పుల వడిఁ దడయఁగ లేనియుడుపాస్య సుడిగాలిఁ దడయు నొక్కొ?
నడయాడ గడగడ వడఁకెడుపడఁతి యే యడవుల నిడుముల నడలు నొక్కొ?
అడియలజడిఁ బడి జడజాక్షి వడివీడి పుడమిపైఁ బడిపడి బడలు నొక్కొ?

గీ. పుడమి నేఁ బుట్టి నాతోడఁబుట్టువునకు
దోష మడరఁగఁ దొడవులు దొడఁగఁగాని,
గోడు లెన్నియొ కుడిపితి ఘోర మకట!
పాతకుల నేల పుట్టించుఁ బాపి బ్రహ్మ? ౨౮౩

(భటుఁడు ప్రవేశించుచున్నాఁడు).

భటుఁడు. ప్రతాపమహీపాలా! దేవరకు జయమగుంగాక, జయ మగుం గాక. ప్రభూ! అంగదేశపురాజు మంగళాంగుఁడు వచ్చి వాకిద్వారంబునఁ గాచియున్నవాఁడు.

పతా. మంగళాంగుఁడా! నాబాల్యస్నేహితుఁడా! నేనె పోయి కొనివచ్చెద.
(అనుచు వెళ్లి మంగళాంగునిఁ గుచ్చి కౌఁగలించికొని కొనివచ్చి).

ఉ. పిన్నటినాటిమిత్రమును బ్రీతి యెలర్పఁగఁ గన్ను లారఁ గ
న్గొన్నసుఖమ్ము కన్న మదిఁ గోరఁగ వేఱొకసౌఖ్య మున్న దే?
మన్నన మానినీసుఖము మానితసూనుసుఖంబు భూరిభా
గ్యోన్నతసౌఖ్యము న్సురవరోన్నతసౌఖ్యము దానిఁ బోలునే? ౨౮౮

నెచ్చెలి! మంగళాగా! ఎన్నిదినంబులకు నినుఁ గంటిని? మిత్రమా! అం
దఱును క్షేమమా? రాజ్యంబు విడిచి వచ్చినకారణం బేమి?

మంగళాం. మిత్రహృదయానువర్తి? ప్రతాపచక్రవర్తి! నాదురాకకుఁ గారణం
బు వ్యసనకరం బైన, నీకుఁ గా దని యుం కెవ్వరికిఁ జెప్పదు. వినుము.

ద్విపద వసుధేశ! నాదగు - వంతలు నీవు?
వినువక వినవయ్య - విన్నవించెదను?
నా కొకపుత్రుండు - నయగుణశాలి?
లోకైకనుతుఁ డయో! లోకమోహనుఁడు
ఆతఁడు వేఁటకై - యడవికిఁ బోయి,
నెల లేఁడు మించెను - నేఁటికిఁ దాను,
రాకున్న వాఁ డట్టి - రాకుమారుండు.
నా కేమొ భయ మయ్యె - నయవిశారదుఁడ!
చారులఁ బంపి వి - చారణ సేయ,
ధారణీస్థలిలోన - తఁడు గానరాఁడు.
ఇటు లుండ నీపురి - యీబరి నొకని
భటులు దెచ్చిరి పట్టి - ప్రశ్నింప వాఁడు
ఇదె సునందని యని - యెంతయుఁ బ్రుల్లు,
అరె! సుదేవుఁడ యంచు - నార్చుచు దుముకు.
ఇందునకుం గత - మిచట నీవలన
విస్పష్ట మా నంచు - విశదంబుగాను,
మణికంధరుండు నా - మంత్రివరుండు,
వినయంబుగాఁ దెల్ప - వెడలి వచ్చితిని,

తెలియఁగఁ బల్కుమా - తెఱ వెద్ది నాకు?
నిలువఁగ లే నిల - నిమిషార్థ మైన,
తల్లడించు మనమ్ము - తనయునిఁ జూడ,
తల్లిదుఃఖం బిఁకఁ - దడవంగఁ జాల. ౨౮౫

ప్రతా. మంగళాంగా! ఈవృత్తాంతం బతిదుఃఖకరంబు. పుత్రవియోగంబు దుఃఖతమం బనుటకు సందియంబు లేదు.

చం. మది పదిలంబుఁ జేసి యరిమార్గణకోటి సహింపవచ్చుఁ బో,
పద నగుసూదిపోటులకుఁ బ్రాణము గట్టిగ నిల్ప వచ్చు, నె
మ్మదిఁ గొని కీలికీలములమధ్యను నిల్చి సహింపవచ్చుఁ బో,
కుదురుగ నోర్వ శక్య మెటు కూర్మికుమారవియోగబాధలన్. ౨౮౬

మంగళాంగా! ఇన్నిదినంబులవఱకుఁ బుత్రవియోగంబువలన నేఁ బడిన పాటు లన్నియు నీవు విని యుందువు. ఈవియోగం బెట్టి దైనది నాకుం దెలియును. ఇంచుక యూఱడి యుండుము. నే నన్నియు విచారించెద (మంత్రివంకకుఁ దిరిగి) సుమతీ! ఈయంగదేశాధీశ్వరుఁడు నుడివినపిచ్చివాఁడు మనపట్టణంబునం దెవఁడు?

సుమ. (మాటలు తడబడ) మహాప్రభూ! వాఁడు, వాఁడా? వాఁడు, ఎవ్వఁ డయినది నాకుం దెలియదు. అట్టివాఁడు మనపట్టణంబున లేఁడు. (ప్ర. ద్వారపాలకుఁడు)

ద్వార మహాప్రభూ! దేవరకు జయ మగుం గాక; జయమిగుం గాక. ద్వారంబున నొకసన్యాసి వచ్చి కాచికొని యున్నవాఁడు.

ప్రతా సన్యాసి వచ్చి ద్వారంబున నిలుచు టేల? అతిసియతు లయినయతు లెచ్చటికి వచ్చుటకు స్వతంత్రులు గారు? త్వరలో నేఁ బోయి పిలిచికొని వచ్చెద. (అనుచుఁ బ్రతాపరాజు పోయి సన్యాసిని వెంటఁబెట్టుకొని వచ్చి) మహాత్మా యీపీఠంబున విచ్చేయుఁడు.

సన్యా. "లయగ్రాహి"

నీకులవిభూషణుని నీకులయశోనిధిని నేకుజనుఁడో యకట తేఁకువ నిశీథిన్
నీకుసుమగంధి కడు జోక లిడి తా నిదురవేఁకమున నుండఁ గని, భీకరమతిన్ హా!
చేకొని చన న్సుతుఁడు వ్యాకులముచే నడవి, నాకు నలముం దిని వితాకువడి నేఁ డే

సాకున నొవచ్చెనఁట! యాకొడుకుఁ గంటివఁట నీకుశలము ల్వినఁ గమాకుముద మయ్యెన్.

రాజో త్తమా! ఈముద్దులసుకుమారుని నీ కుమారుని నెట్లు కంటివి? వాని నేద్రోహి పట్టి కొనిపోయెను? అది నీ కెటులఁ దెలిసెను?

ప్రతా. "లయవిభాతి"

తపసివర! మీరువిన, నపరిమితఘోర మిది, విపినతలమందు సుతుఁ గపటభటుఁడుగ్రుండ పహృతునిఁ జేసి, గురుశపథమున హింసకును గృపణుఁడై యుండఁగ నికృపనెఱుక లెంతేను పకృతిఁ దలంచి, ధనము పదముగ నిచ్చి సుతు నపనయము దీర్చి వడి నపటువును వేదామెపు డెటులొ వీని మన యుపవసథ నుండుచెఱను పహతికి దార్చిరని యిపుడె వినికంటిన్.

యోగివరా! ఆద్రోహి యీబాలు నేల గొనిపోయినది, యేల చంపఁ బూనినది, ప్రాణం బిచ్చి కాపాడినయెఱుకు లేల మఱల వీని మనపట్టణంబునఁ జెఱ నుంచినది తెలియకున్నది.

జయపా. "లయహారి"

> నను గొనుచు నెఱుకు లటు చనిరి తమగృహమునకు-
> ననవరత మును విడని కనికరము చేతన్ ।
> మనిచి, ముదమునను దమతనయుఁ బలె ననుఁ గనుచు-
> ననుదినము మమతఁ గడు మన మనుగమింపం ।
> గనిరి సుఖములు మిగుల మనమునను నొకదినము-
> ఘనుల మిముఁ గనుగొనఁగఁ గను మొఱఁగి వారిన్ ।
> ఘనవిపినమునుఁ గదిసి వనపథము లెఱుఁగమిని-
> దను వలయు నిలఁ బడితిఁ గన నవలివార్తల్ । ౨౮౯

తండ్రీ! వనమధ్యంబునం బడిననన్నుం జెఱ నుంచినవా రెవరో నాకుం దెలియదు.

జీవా. ఉ. చిన్నెలు దెల్పి యట్టిచిఱుచిన్నెలవానినిఁ బట్టి యాచెఱన్
> గన్నన బెట్టుఁ డంచుఁ గరినం బగునానతి నిచ్చె నుగ్రుఁ డా
> సన్నలఁ బట్టి యీశిశువుఁ జక్కఁగఁ బట్టితిఁ బెట్టితిం జెఱన్
> మన్నన మానవేంద్రుసుకుమారుఁ డితం డని నే నెఱుంగమిన్! ౨౯౦

మహాప్రభూ! ఈసుకుమారునిఁ జెఱ నుంచినతప్పితంబు నాది. దేవరసుతుం డని తెలియక చేసితి. కావున మన్నింప వేడెద.

సన్యా. ప్రభూత్తమ! ఈయుగ్రుం డనువాఁ డెవండు?

ప్రతా. తాపసోత్తమా! వాఁడు నే నమ్మినసేనానాయకుఁడు. ఉగ్రసేనుం డని వానిపేరు.

సన్యా. వాఁ డిపు డెచ్చట నున్నవాఁడు ?

ప్రతా ఇపుడు కొన్నిదినంబులనుండి రాజ్యంబు విడచి పోయినాఁ డని నామంత్రి వచించెను.

సన్యా. రాజేంద్రా ! నీమంత్రి యెక్కడ ?

ప్రతా. ఇతఁడే రాజ్యతంత్రనిపుణుం డగునామంత్రివరుండు. ఏలిక క్షేమమునం దెడతెగనిజాగరూకత గలప్రజ్ఞాశాలి. పైఁగా నాకు బాల్యస్నేహితుఁడు నాప్రాణమిత్రము

సన్యా. సరిసరి. ఇట్టితంత్రనిధి నీమంత్రిగను, నచ్చినమిత్రముగ నుండుటంబట్టియే నీరాజ్యం బింతగ శోభిల్లుచుండె యుండు. (సుమతి వంకఁదిరిగి) మంత్రివరా ! ఈసుకుమారరాకొమారునిఁ గారాగృహంబునం దుంచిన కారణం బే మయ్యుండును ?

మంత్రి. యోగివర్యా ! ఆయుగ్రుండు సహజవిషధరుండు గాన విషమబుద్ధి వానికి నైజము.

సన్యా. అటు లయిన నీరాకొమారునిం బలె నితరరాజకుమారుల నెందఱిని వాఁడు చెఱయం దుంచినవాఁడో నీకుం దెలియునా ?

మంత్రి. నాకుఁ దెలియదు. రాజ్యంబు క్షేమంబున నుండుకతంబునఁ గారాగృహంబులజోలికి నేఁ బోయి యుండ నైతి.

సన్యా. అటు లయిన నిపుడే కొందఱినిం బంపి చూచుట మేలు కాదే ?

ప్రతా. తాపసోత్తమా ! నిజము నిజము. ఈమహానుభావుండు తనపుత్రునింగానక దేశదేశంబులుం దిరిగెడు. ఇదె దానినిజముం గందము జీవాజీ ! చెఱయం దుండువారి నందఱ నిటకుం గొని తెమ్ము.

జీవాజి. బుద్ధి ! బుద్ధి ! దేవర యాజ్ఞాపించినట్లు చేసెద (అని కారాగృహమునకుఁ బోవుచున్నాఁడు.)

సన్యా. (మంగళాంగునిఁ వ్రేలితోఁ జూపుచు) ప్రతాపప్రభూ ! ఈతం డెవ్వఁడు ?

ప్రతా. తాపసోత్తమా ! ఇతఁ డంగదేశపురాజు మంగళాంగుం డందురు వేఁటకుం బోయినను దేవుం డనుసుతుఁడు తిరిగి రానికతంబున వెతఁ జెంది యుం

డ, నితనిభటులు కొందఱు, సునందనీ యనిమోహంబునను, సుదేవా యనికోపంబునను, త్రుళ్లుచు నెగిరిపడుచుండు వెఱ్ఱివాని నొక్కనిం గొని పోయి యాతఁడు నాపురజనుఁ డని చెప్పిరఁట. సునందని యనుసుందరి నాసుత, కావున నాదేశంబునకు వచ్చిన సుదేవునివార్త లెఱుంగ నగు నని యిపుడే వచ్చిన వాఁడు.

సన్యా. మంగళాంగప్రభూ! ఆపిచ్చివాఁ డిచ్చట నుండిన రప్పించెదరా?

మంగ. చిత్తముఁగురూత్తమా! మణికంధరా! వానిం దెప్పింపుదే?

మణి. దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను. (అని వెళ్లి కుబేరునిఁ దోడ్కొని వచ్చుచున్నాఁడు.)

కుబే. సన్యాసినిం జూచి పట్టుకొనం బోవుచు.

"స్రగ్విణీవృత్తము" భామినీ! చాలునే, బాధ నే నోర్వనే;
కామినీ! యేలనే? కాలము న్బ్రోవునే;
రా మనోహారిణీ! రావె నారీమణీ!
యే మనం జాలనే, నే మనం జాలనే. ౨౫౧

(మంగళాంగుఁడు నివారింపం బోయిన నాతని మార్కొనం బోవుచు)

"నారాచవృత్తము" ఏరా! నిను న్గన, న్భళీ!
యీరేడులోకము ల్వెదక్,
బోరాడి తిర్గితి న్నరే,
రారా నిను న్వధింతు నే. ౨౫౨

(మణికంధరుఁడు నివారింపం బోవఁ బిచ్చివాఁ డాతనిం జూచి.)

"పాదపవృత్తము" కొమ్మరో! మారునికమ్ములు తాళక్,
రమ్మని ప్రీతి నురమ్మున గాడక్
గమ్మనికామసుఖమ్ముల నందక్
సమ్మతి వేఁడెద సంతస మొందక్. ౨౫౩

(భటుఁడు నివారింపం బోయిన బిచ్చివాఁ డాతనిం జూచి.)

"సమానీవృత్తము" రారి నీను జీవ మిలక్,
జేరి వైచెదం గను నా
వీరఘోరబల్మి యిదె
పోరుఁ గోరి తేర సరే. ౨౫౪

(మఱియొక భటుఁడుం బోయినఁ బిచ్చివాఁడు వానిం గౌఁగలించికొని,)

"ఉపేంద్రవజ్రావృత్తము" సునందనీ! భాగ్యమె? చూడ వేమే?
మనంబున న్గోపము మాన వేమే?
దినంబు గల్పం బగు దిక్కుఁ గానక.
ఘనం బఁటే నన్నిటు గాసి వెట్టక? ౨౫౫

(భటులు మఱికొందఱు వచ్చి పిచ్చివానిం బట్టి కట్టుచున్నారు)

సన్యా. మంత్రివరా! ఈపిచ్చివాఁ డెవ్వఁడు?

సుమ. తాపసోత్తమా! వీని నే నెఱుఁగ. ఆ! యెఱుఁగుదు. రూపు మాఱినది కాఁబోలును. వీఁ డెవఁ డయినది తెలియకున్నయది.

పిచ్చి తండ్రీ! తండ్రీ! నీవే కా? సునందనిం దెచ్చి యిచ్చెద నంటివే? ఎదీ? (భటులు మఱల నాపిచ్చివానిని వారించిన వానికిఁ బిచ్చి దొర్లుకొని.)

✻ "ఉన్మాదవృత్తము." ఎలనాగా! । చలమేలే
యలయింపక । ఫలమేమే? ౨౫౬

(అనుచు నున్మాదాధిక్యంబుచేఁ గ్రిందఁ బడుచున్నాఁడు.)

సన్యా. మంత్రీ! వీఁడు తండ్రీ యని నినుం బిలిచెనే? నీకుమారుండు కాఁడుగద? అయినచో వీని కీయున్మాదం బేల కలిగెనో తెల్పుదువా?

సుమ. యోగివరా! వీఁడు నాకుమారుఁడే కాని రాజనందిని యగుసునందనిం గని కామపమోహితుం డైనకారణంబున రాజ్యంబునుండి వెడలఁగొట్టించితి.

ప్రతా. కంటిరే తాపసోత్తమా! రాజద్రోహంబున కోర్వక, యేకపుత్రుం డైనను యోచింపక తనతనయునిం దృజించినమహనీయుం డీయమాత్యమణి.

సన్యా. నిజముకా నృపోత్తమా! ధర్మరాజుం బలె ధర్మైకనిష్ఠాగరిష్ఠుం డగుటంబట్టి యీ యితఁడు సుమతి యని పే రందినది? (భటులు సుదేవునితోఁ బ్రవేశించుచున్నారు.)

మంగ. (కొడుకును గౌఁగిలించికొని)

కం. రారా ముద్దులతనయా! । రారానాతండ్రి! యిన్నిరారాపులు నీ
కేరా! సుకుమారా! పటు! ధీరా! యెటు సైచి తీవిధిం గఠినంబుల్?

---

✻ ఇది నాల్గవఛందంబున 4 గవవృత్తము.

ప్రతా. కం. రమ్మా రాజకుమారా! కమ్మవిలుతుఁ బోనినీకుఁ గారాగృహావా
సమ్మున్విధియించుట విధి। యిమ్మాడ్కిని నైజబుద్ధిహీనతఁ దెల్పేఁ.—౨౫౮
కుబే. కం. గారాముస నేఁ గోరిన। యారామామాణిని నీవు నారామమునన్
గూర్తా! కోరితె స్సిగ్గరి?। పోరాడర? నారి యేల? పోరా పురికిన్. ౨౫౯
(భటులు వచ్చి కుబేరునిం బట్టుకొని యడఁచిపెట్టుచున్నారు).
ప్రతా. రాకుమారా' ఈకారాగృహంబున ని న్నెవ రుంచి రోయీ?
సన్యా. రాజచూడామమణీ! ఈరాకొమారుం డలసి సొలసినలా గున్నది. ఇన్ని యిడుములు వడినయీసుకుమారునియుదంతంబు ఘోరంబుగనే యుండును వాని వ్యసనకరంబుగా నిపుడె చెప్పఁ గోర నేల? ప్రతాపభూపాలా!
చం. పంచపాది. నిలుకడ నీఁగి నీరధులు నిట్టలు గట్టులు గుట్ట లెక్కుచుం,
జలినెల నీతు వెంచక ప్రచండకరాతపభీతి మాని, యా
జలధరఘోరధారలకు జంకక, కొంకక యించుకేని, ని
శ్చల మగుమానసంబునను జయ్యనఁ గ్రుమ్మరుచుండి, కంటి నే
నిలనొకజీవి, వాఁ డిదిగొ యిచ్చెను నాకొకకమ్మ చూడుమా.—౨౬౦
(అని యుగ్రసేనుఁ డిచ్చినకమ్మను బ్రతాపుని కొసఁగుచున్నాఁడు.)
ప్రతా. (కమ్మ చేత నందుకొని) సుమతీ; ఈజాబుం జదువుము.
సుమ. మహాప్రభూ, చిత్తము (అనుచు జాబు నందుకొని లోలోనఁ జదువుకొన్నకొలఁదిని ముఖము వెలవెలంబోవ బిక్కమొగము వైచి చేతులు గడగడ వడక నోటఁ దడి యార నాకమ్మనే మఱలమఱలఁ గ్రిందుమీఁదులు సేసియుం ద్రిప్పిత్రిప్పియుం జూచుచున్నాఁడు).
ప్రతా. సుమతీ! ఎట్టిచిక్కక్కరంబు లయినను ధారాళంబుగాఁ జదువునీ వేల నేఁ డీరీతి మతివిభ్రమతఁ బొందుచున్నావు?
సుమ. (చేతులు వడకించుచు గ్రుడ్ల నీళ్లుగ్రుక్కుకొనుచు నోటఁ దడి యారి మాట రాక చప్పరించుచు ప్ర.... ప్ర.. ప్ర.... అనుచు మ్రింగుచు ముఖము తేల వైచి ఊచ్చవడి తూలుచున్నాఁడు.)
ప్రతా. ఏమి' మంత్రివరా! ఈయచ్చెరువు? మననునందనిషేమమున నేమి యుంగొఱంత వడదు గద?
మణి. మహాప్రభూ! ఆకమ్మయం దీమంత్రిదుష్కృత్యం బేదియో వ్రాయఁబడి

యుండు నని యే నెన్నెద. కానసే భీతిల్లి నోరు తెఱవ నేఱకున్నాఁడు. అందునకు సందియంబు లేదు.

ప్రతా. అమాత్యవర్యా! మణికంధరా! అటు లయిన దయచేసి మీరు చదివెదరా?

మణి. మహాప్రభూ! చిత్తము, దేవరయానతి శిరసా వహించి చేసెద. (అనుచు సుమతిచేత నున్నకమ్మఁ దీసికొనుచున్నాఁడు)

సుమ. (బిక్కమొగము వైచి మణికంధగునికాళులమీఁదఁ బడుచు, నమస్కరించుచుఁ, జేయి త్రిప్పి చదువ వల దని సైఁగ చేయుచు, నుదురు కొట్టుకొనుచు, గ్రుడ్ల నీళ్లు గార్చుచున్నాఁడు.)

ప్రతా. సుమతీ! ఏల నీ కీభయము. మణికంధరామాత్యా పుత్రుని వెఱ్ఱి చూచి యామంత్రివరునిమనస్సు చలించి యున్నట్టు కన్పట్టెడు. మీ రాతనిం బాటింపక యాకమ్మ నిమ్ముగఁ జదువుఁడు.

సుమ. [పెడమొగము వెట్టి తల వేలవైచి కన్నులు చేతితో మూసికొని కూరుచున్నాఁడు.]

మణి [జాబు విచ్చి యిట్లు చదువుచున్నాఁడు.]

చం. పురజనులార! భూరితరపుణ్యమహీసురవర్యులార! యో
నరవరులార! సత్య మిది నమ్ముఁడి, ప్రాణసమీరవారముల్
పురముఁ దొలంగి పోవుతఱి, భూతము లైదును సాక్షి గాఁగ, నే
హరిహరవిశ్వసృడ్వరులయానగ వ్రాసెద నామకృత్యముల్. ౨౬౧

ఉ. భూరియశోవిశాలుఁ డిల భూతదయాహృదయుండు సద్గుణో
దారుఁడు నొకళింగుని ప్రతాపునిదండున నాయకుండ నై,
యారిపుభీముమన్ననల నందినవాఁడ, సుఖింప లేక యో!
కోరితి నేను ద్రోహములఁ గ్రొవ్వునఁ జేసితి దోషకర్మముల్. ౨౬౨

ఉ. మాటలు తేనియ, ల్కనము మానసభీకరకాలకూటముం,
బైట మృదుత్వ, మంతరము బంధురవజ్రమహీధరంబు, తా
టోటులయొజ్జమిన్న, కపటుండు, సుమంత్ర్యభిధాయి మంత్రి, యా
బూటకపున్దురాత్మకునిపుత్రికఁ గాంచి, విరాళిఁ జెందితిన్. ౨౬౩

మ. మదనోన్మాదపరీతమానసుఁడ నై, మాయావి యానాసతీ
పదనం బెప్పుడు చూడ కున్న మనుట వ్యర్థం బటం, చక్కటా!

మదిలో వంమరి కుంది, మందగమనా! మాటాడవే రావె! నీ
మదిఁ బ్రేమ న్నను జూడవే యనుచుఁ బల్మా ఱాసతో వేడితిన్. ౨౬౪

కం. ఇవ్విధమున వాపోవుచు । నవ్విభుదుర్మంత్రిఁ జూచి యంతఃకరణం
బివ్విధమున సుడివడియెడి । జవ్వని నీపుత్రి నిచ్చి సాకవె యనుచున్. ౨౬౫

ఉ. వేఁడిన వాఁడు వల్లె యలివేణి నొసంగెద, నాదు సేఁతలం
దోడయి, కూడ దం చనక, తోడన చేయు, మ టన్న, మంచి దం
చాడితిఁ బాపము న్దెలియ, కంతట భూపతి యొక్క నాఁడు దా
వేఁడుక భార్యపుత్రులను వేఁటకుఁ గాఁ గొనిపోయి యున్నెడన్. ౨౬౬

శా. ఆహా! క్రూరదురాత్ముఁ డాసుమతి న న్నారేయిటం జేరి, "యే
ద్రోహం బెన్నక రాజపుత్రు నిపుడే దోఁపించి ఖండించి నీ
బాహాసత్త్వము సూపు, మన్న, నపుడే బాలు న్వెసం దోఁచి, యే
యూహా లేయక, చంపహంతలకు నే నొప్పించితిం బాపినై. ౨౬౭

అంతట నారాజదంపతులు తమగాదిలిపుత్త్రినిజూడ గానక.

చ. ఘనతరపుత్త్రిశోకమునఁ గాసిలి, పోవఁగఁ గాళు లాడ, క
వ్వనతలమందె స్రుక్కి, కడు వంతలఁ గుందుచు, రాజ్య మానునం
దని యనుపుత్రి కిచ్చిరి, పదంపడి మంత్రియు నానునందనిన్
దనస్నుషగా గ్రహించుటకుఁ దప్పడుమార్గము లెన్నొ పన్నుచున్. ౨౬౮

గీ. ఇటులు గొన్ని నాళ్లు తలమటంపడుచుండఁ
గుటిల దుష్టబుద్ధికూఁతు రకట!
"అంగవిభునిపుత్రు నానునందని కోరి
యనుజుఁ బట్టి తేర నంపె" ననుచు: ౨౬౯

మ. తెలియం బల్కిన దూర్తుఁ డాసుమతి యెంతేఁ జింత తా నొంది, యా
ఖలునిం దెమ్మని పల్క, నే నపుడె వీఁక న్బంపితి న్బంటులన్,
వెలయ న్గ్రిమ్మరి వారు తెచ్చి రెలమి న్వేశ్వేఱుగా నిర్వురన్;
జల మొప్పారఁగ వాఁడు వారిఁ జెఱవెట్టం బంచె దుర్వంచనన్. ౨౭౦

"మత్తకోకిల" ఉన్నతోరుపదంబు లందితి, హాహహా! నీసరి, యేరు లే,
రన్నికార్యము లయ్యె లగ్గుగ, నంగనామణి నిమ్ము, నా

కిన్ని బాధలు గాధ లేటికి? నింక సైపఁగ లే, నహా!
వన్నెలాడిని గూఁతు నీఁ గదె? వాసి నందెద నేటితోఁ. ౨౨౧

మ. అనుచు న్వేఁడిన, మంచి దంచు ననుఁ దా నారాత్రి బంధించి, కా
ననమధ్యంబునఁ బాదము ల్దటిగి, న న్గాసిల్లఁ జేసె న్ఖలుం,
డనఘా! శ్రీహరి! యేమి సేయుదును? గామార్తిం గడుం గ్రూరముల్
ఘనపాపంబులు సేసితి న్మనులకుం, గాపాడవే వారి వేఁ. ౨౨౨

(ఉగ్రసేనుఁడు)

సుదే. సుమతిం జూపుచు హా! హా! వీఁడే యా ద్రోహి. ఈదుష్టుండు నాచె ఱ దూరి మంత్రిసుతను వరింపు మని కారించుచు వచ్చెను దాని వరించి నం గళింగరాజ్యాధిపత్యం బిప్పింతు ననుచు నాస గొల్పుచు వచ్చె. వరింపకున్నం గారాగృహమరణంబే శరణం బని బెదిరింపుచుండెను. ప్రతాప మహీపాలా! వీఁడు కట్టుబట్టలో నుండి కుట్టు తేలు సుమీ.

ఉత్సాహ. కంటిలోనినెరసు, పాదకంటకంబు లట్టివాఁ,
డింట నుండుభుజగ మట్టిఁ, డీటు లేనిపోటును,
మ్మింటిలోనిపోరు, పంట నిరికియుండు పుర్వు, హా!
మంట లేనియనల, మగార! మంత్రి కాఁడు భూవరా! ౨౨౩

ప్రతా. "శిఖరిణి" కులధ్వంసీ! క్రూరా! కుమతి! యకటా! కూర్మి నిటు నా
కిల న్బాల్యస్నేహం బినుమడిగఁ జెల్లించితె? కటా!
బలా! రాజద్రోహీ! పడకఫణివై బాధలిడితే?
చలం బెట్లబ్బెఁ? హా! చపలమతి! నే శాత్రవుఁడనే. ౨౨౪

కం. పా లిచ్చినయుపకారికి। మే లనుచు విషాన్న మిడుదె? మేల్! మేలు! భళా!
వేలకొలఁది వెల యిడినే। గాలపుటురి త్రాడు గొంటిఁ గంఠంబునకుఁ. ౨౨౫

ఛీదుష్టబుద్ధీ! అంకుటాలికిఁ గ్రొత్తడెసుద్దులు మెం డన్న ట్లాయరణ్యంబున నా కెన్ని వేదాంతము లుపదేశించితివి! ఎట్టినక్కవినయంబులు నటించితివి! ఇంతదనుక నెన్ని నీతులు వర్ణించితివి! ఓరీకృతఘ్నా! తిన్నయిల్లె గుద్దలింపఁ జొచ్చితి కాదే? మేలు చేయువానికి మెడచుట్టు వ్రాఁత పెట్టువాఁడిం కెట్టివాఁడు.

క్రౌంచపదవృత్తము

జయదే. అన్నము లిచ్చె, న్వస్త్రము లిచ్చెన్,హారుసములను గని,యధిపతి యెంతో
మన్నన చేసె,న్మాన్యము లిచ్చెన్,మనమునఁ జెలి యని మమతను బెంచెన్;
సన్నుతితో ని న్నెన్నుచు మెచ్చెన్, సచివుఁడు సఖుఁడని సకలము నిచ్చెం,
జిన్నికుమారుం జెన్నటి వౌచున్, శిరము దఱుగఁ దలఁచితి గద! భళిరా!
నరేంద్రద్రోహీ కృతఘ్నా! విశ్వాసఘాతకా నీయట్టివాని మొగంబుం జూ
డం దగు నఁటరా పాపిష్ఠా!

జయపా మదరేఖావృత్తము నా కేలా యిటు ద్రోహం
బాకాంక్షించితి? క్రూరా!
యేకాలంబున నేనిన్
నీ కేనేరము సేయన్. ౨౭౭

సన్యా. ప్రతాపప్రభూ! హా! నీమంత్రిప్రభావంబుం గంటివే? ఎంతటిపుణ్యంబు
సేసిన నిట్టిగుణఖని చేకురం గలఁడు? ఇంకను వీనిపై శాంతి వహించెదవే?

చం. కుటిలఫణి న్వధింపరటె? కుట్టెడువృశ్చిక మంటఁ జూతురే?
కుటమునఁ బ్రోతురే మకరిఁ? గుత్తుక నుంతురె కత్తివాదరన్?
గుటపముఁ జేరుబెబ్బులినిఁ గూరిమిఁ గాతురె? కుంభినీవరా!
కుటిలునిఁ జేరఁదీయుదురె? కోరుదురే విషభోజనాదులన్? ౨౭౮

అట్లు గాన నీకుటిలుని నటవిం జేర్చి యాయుగ్రునిసరసం ద్రోయింపుమా.

ప్రతా. వీరభటులారా! ఈక్రూరునిఁ బట్టికొని పోయి మోకాళులవఱకుం దెగ
నఱికి యాయుగ్రసేను డుండెడియరణ్యంబున వానిప్రక్కనుం ద్రోసి
రండు. వేవేఁగఁ బొండు. ఇఁక వీని నాయెదుట నుండ నీకుఁడు.

భటు. మహాప్రభూ! చిత్తము (అనుచు సుమతిం బట్టుకొని పోవుచున్నారు.)

సన్యా. (కుబేరునిం జూపుచు) ప్రతాపభూమిపా! ఈయున్మాదుని నౌషదశాలకుం
బంపి, పాపము, తగినచికిత్స సేయింప నాన తిచ్చెదవే?

ప్రతా. చిత్తము. భటులారా! వీనిం గొనిపోయి మనయున్మాదౌషధశాలలో
విడచి క్రమ మైనయౌషధసేవ సేయింపు మనుఁడు.

భటు. చిత్తము మహాప్రభూ! (అనుచుఁ గుబేరునిం గట్టం బోయిన)

కుబే. కాంతివృత్తము. భామామణి న న్నిటు బాధలకున్
రామామణి న న్నిటు రాపులకున్

హేమాంగిరో! యుంపఁగ నేటి కొ్కొ్ ?
యీమాయలు చాలునె యిందుముఖీ! ౨౭౯

(అనుచు భటులపైఁ బోవ వారు వానిం గట్టం బోవుచుండ.)

కుబే. కం. గరగరిక లాడి కరకరి। సరి కా దిఁకఁ దరమె తరుణి సైపఁగ నరతం
గరిగమనరో! మరుఁ డురువడి। నరవిరిశరధారఁ గురియు, నరమర యేలే?

(అనుచుఁ బ్రేలుచుండ వాని నెత్తికొని పోవుచున్నారు.)

మంగ. సుదేవా! నాఁ డడవికి వేటకుం జని నీపరివారంబు నెడబాసితి వని విని యుంటిని. పిదప నీ వెట్టు లీద్రోహి దుష్టబుద్ధిబారిని బడి చెఱఁ జేరితివి?

సుదే. తండ్రీ! సేనకు దూరస్థుండనై

మ. అడవిం జేరితిఁ, ద్రోవ దప్పితిఁ, బిపాసాయత్తతం జిక్కితిన్,
నుడువం జాలని వేసటంబడలితి, న్ధ్యాపించితిం దైవమున్,
బుడమి న్వ్రాలితి, నట్టె లేచి మఱల న్వ్యోఁ జూచితిం, బోయి నా
యడిదప్పు ల్వడి వీడఁ, గాంచితిని నే నారామకాసారమున్. ౨౮౧

శా. నీరుం ద్రావి సుఖంబున న్నిమరలో నే నుండ, నారామముం
జేరన్ వచ్చినరాజనందినిని రాజీవాక్షినిన్, లేచి క
న్నారం గంటిని, బల్కరించితిని, మోహంబు ల్వేసం దెల్పితిన్,
రా రంభోరు, మదీయదారవయి వేరం, మ్మంచు నే వేఁడితిన్. ౨౮౨

ఉ. నే నటు వేఁడఁ జింతిలుచు నీరజనేత్ర వచించె, నక్కటా!
మానవనాథ యే మనుచు మానితసౌఖ్యము లందుదాన; న
య్యో! నవమన్మథు న్సుతు మహోగ్రవనంబునఁ గోలుపోయి, యా
కానఁ గృశించుతండ్రులకుఁ గా మది వందురుకష్టజీవి నేన్. ౨౮౩

కం. కుటిలాలక యటు లాడినఁ। గటకటపడె నాదుమనము, "కలికీ! యనుజుం
దటుకునఁ దెచ్చెద, వ్యసనము।నిటు పొందకు, నన్ను నమ్ముమింతీ" యనుచున్.

గీ. గడువు పెట్టి యల్ల గడువున రాకున్నఁ। మృతుఁడఁ గాఁ దలంపు మెలఁత! నన్ను;
జడజనయన దీని సత్యంబుగా నమ్ము నుడివి సేయకున్న నడరుఁ గీడు. ౨౮౫

మ. అని పైనంబయి దేశదేశములు సర్వారణ్యము ల్సూచి, చూ
చినవారిం "బసిపాప నిట్టి నిట మీసీమం గనుంగొంటిరే?"

యని వేర్వేరుగ వేడి, కాన కేచటర్, హా యంచుఁ జింతిల్లుచుర్
వనమధ్యంబునఁ జిక్కి, చెట్టుమొదలం బన్నుండి నిద్రించితిర్. ౨౮౬

తండ్రీ! పిమ్మటఁ గను విచ్చి చూతుం గదా చెఱఁ దగిలి యుంటి. నన్నె వరు పట్టినది, యెవరు చెఱ నిడినది, నాకుం దెలియదు. ఈదురాత్మకుం డు వచ్చి జయమాలి యనుదాని వివాహం బాడు మని నను బాధించు చుండెను, గావున వీనిదియే యీకృత్యం బని నే నూహించెద. ఆసుంద రి తనసోదరునకుం దనతల్లిదండ్రులకుం బడువిచారంబుం జూడ నోపక, వి నినవృత్తాంతంబుపై నాబాలుండు బ్రతికియుండు నని నేఁ దలంచి, య క్కామినికై యీప్రయత్నంబుం బూనితి.

జయ. తండ్రీ! నాకు నై సంతతసంతాపభారంబుచేఁ గ్రాఁగి, రాజ్యసుఖంబులు దూఱి, కాఱడవులు చేరిననాసోదరిం గానక, నిఁక నొకనిమిషం బయిన నిలువం జాల. అనుజ్ఞ యిచ్చిన దాని వెతకం బోయెద.

సుదే. ఏమీ జయపాలా నీసోదరి మందిరంబున లేదా? రాజ్యంబు విడనాడి పోయెనా? హా! హా! సునందనీ! నా కేమో భయ మయ్యెడు.

కం. అతివరో! ఖతి మీఱితి నని! వెతఁ జెందుచు నన్ను నరయ విపినంబులకే
గితివో? యలసితివో? తలఁచితివో? పిలచితివో? సతిరో! చెఱఁ బడిననుర్.

చం. తరుణిరో! నీదుసోదరునిఁ దప్పక తెచ్చెద నంచుఁ బల్కితిర్,
గురుతరకాననంబులును ఘోరధరాధరతీరభూములుం
దిరిగితిఁ, గానఁ జిక్కితని, దిక్కులు గానక నేల వ్రాలితిర్,
హరిహరి! నాదువాంఛితము లన్నియు వ్యర్థము లయ్యె నిత్తతిర్. ౨౮౮

సీ. అనుచరులను వీడి, వనభూములను గూడి, వనరుహానన వాడువాఱు నొక్కొ?
అతనునిలతకూన మతి చెడి, స్మృతి వీడి, కాఱుఁగోనలఁ గందువాఱు నొక్కొ?
చిన్నారిపొన్నారియన్నులమిన్న యేబన్నములకుఁ జిక్కఁబోఱు నొక్కొ?
తనుపారుతనుభోగతను వొంది తనరారుతనుమధ్య తపమునఁ దాఱు నొక్కొ?

గీ. అనుగలముఁ దప్పి యనుదిన మడలు నొక్కొ?
తనువు దగ దని పోనాడఁ దలఁచు నొక్కొ?
ముదితమునుకులకును నేను మూల మైతి;
ననుఁగుఁగ త్రియ లేనినామనువు రిత్త. ౨౮౯

పంచచామరము. ధరాధరా! పరాత్పరా సదాసదాళిసన్నుతా!
సురారిసూదనా! సురేశ! సూరిలోకవందితా!
పురాణపుణ్యపూరుషా! యపూర్వపూర్ణసుందరా!
పురారిపూజ్య! నిన్భజింతుఁ బ్రోవరా సునందనిన్. ౨౯౦

జయపాలా! ఆసుందరి లేనినాబ్రతు కేల? ఇఁక నే నిల నుండఁజాల, వెత కుచుం బోయి యానాపాణిపదంబుం గొని తెచ్చెదం గాక.

సన్యా. రాజపుత్రా! ఏల నీ కీవెఱ్ఱి? అబలలు సహజభీరువులు కారే? ఆకన్యక యే బెబ్బులిని జూచి యావులించి యుండునో? కుడిచి కూర్చుండ నేఱకలేని పోనియవధి యేల తెచ్చి పెట్టికొందువు?

సుదే. ఆ! ఋషివర్యా! ఏమంటిరి? హా! సునందినీ (మూర్ఛపోయి పడఁగా సన్యాసి మేను నిమురుచున్నాఁడు. అంతట స్పర్శసుఖమునభినయించుచుఁ ద్రుళ్లి పడి లేచి) చెలి! సునందనీ (నలుదిక్కులం గలయం జూచి) ఇపుడు మృత్యు వుకోఱలనుండి నన్ను బ్రతికించిన ప్రాణధనం బెచ్చట? ఇంతలో నెచ్చటి కేఁ బఱచినది? ఒక్కరును తెలియఁ జెప్పరు గా?

సన్యా. ఏమి యీకలవరము? రాజపుత్రా యిందఱము మేమిచట నుండ నిపుడు నీచెంత కేకాంత వచ్చినది? కలువరించుచుంటివా యేమి! ఆకన్య యెంతి టిధన్యయొ కాని యొకకుబేరునికిఁ బిచ్చి పుట్టించి వైద్యశాలం బెట్టించె, నిపుడు రాజరాజును నిన్నిట్లు మోహనిద్ర పుచ్చుచున్నది. రాజకుమారా! ఏల యిట్టివట్టిభ్రమలు? కాటికిఁ బోయినవారు మఱల వత్తురటోయీ?

సుదే. ఋషివర్యా! అట్లు సెల వీకుఁడు హా! సునందనీ! (అని మూర్ఛపోయి సన్యాసి తాకఁగా మఱలఁ ద్రుళ్లిపడి లేచి) ప్రాణేశ్వరీ! నన్నేల పరిహాసపాత్రునిఁ జేసెదవే? కరుణింపవే! పొడ సూపవే?

సన్యా. రాజపుత్రా! నీ వేల దుఃఖించెదవు? మీయిరువురిమనంబులన్యోన్య స్నేహసూత్రంబున నిల్లు గ్రుచ్చంబడి యుండ, మీకు వియోగం బేల కలుగు? ఒకతఱి గలిగిన నది చక్రవియోగసామ్యం బై యుండుం గాని లాఁతి కాదు. వెఱవకుము.

సుదే. తాపసోత్తమా! భగవానులు [illegible] లవేదులు. అఘటనఘటనాసమర్థులు. మీయట్టిమహనీయులవాక్యములు పొల్లువోవునవి కావు. అట్లు లయిన నావియోగం బనురాత్రి యెపుడు సమాప్తి నొందును?

సన్యా. ఇపు డది సమాప్తి నొంద కున్న దన నేల?

సుదే. బలే! ఋషిసత్తమా! నావీనులకు విందు సేసితిరి? నేను నామెస్పర్శసౌఖ్యము ననుభవించి నాచెంగట నున్నట్లె నిశ్చయించితి. కాని కన్నులకట్టి పు దీఱ నామెదివ్యదర్శన మెపు డబ్బునా యని నిరీక్షించు చుంటి. ఏదీ? ఎచ్చట నాయమ?

సన్యా. రాకన్నియలు రాణివాసంబు విడచి వత్తురఁటోయీ? ఆసుందరి తనమందిరంబున నగుపడును. పిలువఁబడక రాజసభలకు వచ్చుట రాజసుతలకుం గౌఱఁత గాదే?

ప్రతా. తాపసోత్తమా! ఆదుష్టబుద్ధి సునందని రాజ్యంబు విడచి పోయె నని వచించెనే, ఆదుర్మార్గునికూఁత యదియు నబద్ధంబకా?

సన్యా. అది యథార్థమే యయి యుండును. ఇపుడు తనమందిరంబున నగుపడునది సైతము యథార్థమే యగును. ఇవి యన్నియు దైవమాయలు.

ప్రతా తాపసోత్తమా! ఇది తమయోగమహిమంబ కావలయు. ఇంతకు నా యిందుముఖి మందిరంబున నుండునది సత్యంబే కద?

సన్యా. నే నిచట నుండునది సత్యంబ యే నందునకును సందియం బుండదు.

ప్రతా ఆమోహనాంగిం జూడ కున్నఁ బ్రాణంబుల భరియింప నోప. భృత్యునిఁ గరుణించి యానాపట్టిని, తాపసోత్తమా! రప్పించెదరే?

సన్యా. ప్రతాపభూపాలా! ఆసునందని యోగధారణమున నున్నది. వలయు నన్న నేనిపుడే పంపెద. పంపు మందువే?

ప్రతా. అంతటిభాగ్యమా తాపసోత్తమా? దేవరకు విన్నవించుకొన నేఱక శంకించుచున్నాఁడను నను క్షమించి నాప్రాణపదవి యగుపుత్రికారత్నమ్ముం గనుపఱుపుఁడు

సన్యా. రాజేంద్రా! చింతిల్లకు. నీపుత్రిక నిపుడె పంపెద (అనుచు సన్యాసివెళ్లి పోవుచున్నాఁడు.)

ప్రతా. ప్రియమిత్రమ! మంగళాంగా! ఆసుందరి సునందని నాకు జనించినతఱి నుండ నీపుత్రున కిచ్చి నీవియ్యం బంద వలె నని తలఁచుచుంటిని. కాని నాకు సంభవించినదుఃఖంబులచే నేదియుం దోచక యామాటయె మఱచితిని. దైవసూత్రమున వా రిరువురిమనంబులు నిపు డన్యోన్యప్రేమపాశంబులచేఁ గట్టువడి పోయెను.

ఉ. మిత్రమ ! నాదుపుత్రి, జిగిమించుల మించునుగాత్రిఁ, బుణ్యచా
రిత్రఁ, బయోజనేత్ర, సుఖరీతులు సూత్రవడంగఁ జేకొనం
బాత్రుఁడు గాఁడె? రాజకులపావనుఁ, డంచితలక్షణుండు, నీ
పుత్రుఁడు, పూర్ణచంద్రనిభమూర్తి,పవిత్రచరిత్రుఁ డిద్ధరన్. ౨౯

మంగ. ఉ. అంతటిభాగ్యమే? రిపుకులాంతక! భవ్యము నీదువియ్యమున్,
సంతస మయ్యె నాకు, నిఁక సంపద కట్టనిమాఁట గాదె? యా
యింతిని నాసునందనునియింతిగఁ గన్గొను టెంతభాగ్యమో!
వంతలు దీఱె నిన్నుఁ గన, వాసిని జెందనె వియ్య మందినన్? ౨౯

(సునందని ప్రవేశించుచున్నది.)

ప్రతా. తల్లీ! సునందనీ! ఉభయకులాభినందనీ! మన్మనఃపూర్ణానందనీ! ఇ
రమ్మా! ఇటురా. అమ్మా! ఆయోగిపరు లెచటనే?

సునం. తండ్రీ! నిజంబు నింకను దాఁప నేల? నేనే యాయోగివేషంబున నడవు
దిరుగుచు దైవవశంబున మఱల సిట్లు మి మ్మిటఁ గనఁ గలిగితి. (
వినఁగనే సభికులెల్ల నత్యద్భుతంబుగఁ జూచుచున్నారు.)

ప్రతా. ఎంతటియద్భుతమే యిది! అమ్మా యింతటిసాహసము తగునటమ్మా? 
యీవిధిమాయ! విధిమాయ.

జయదే. క. అమ్మా! సునందనీ! రా! వమ్మా? వనతలము జేల వలచితి వమ్మ
నెమ్మోము వాడె నమ్మా! కొమ్మా! యిటు సాహసమ్ము గూడునె సతికి

జయపా. క. అక్కా! యెక్కుడువంతలఁ! జిక్కులఁ గెడపితి నిఁ కేమి సేయుదు నకఁ
యక్కటికము తక్కక నను! మక్కువ మన్నింపవమ్మ మానవిదయతో
(అని కాళులపైఁ బడుచున్నాఁడు.)

సునం. (తమ్ముని నెత్తిముద్దాడుచు) తండ్రీ! నీ వేమి చేయఁగలవు? విధిమా
మీఱ నెవరితరము. ఇంతకును మీకన్నులయెదుటం బడి మమ్మెల్లర 
కించితి వద్దియే పదివేలు.

ప్రతా. కం. లలనా! కులభూషణ! రా,! లలితాంగిరో! రావె,భాగ్యలక్ష్మీ! రా
కులతోషణ! రాఁవే,యా! కులశోషణ! రావె,ముద్దుగుమ్మరో! రా
సునందనీ! కనుగందనినీసుకుమారసౌందర్యం బడవిం గాచినవెన్నెలం
వ్యర్థంబు సేయుటకు, వనతలంబులం జేరి మునిలీల లేటికి నవలంబిక

వే? రాజ్యపరిపాలనము సేయుచు సుఖంబున నుండక పరివ్రాజకత్వం
బేల గోర వలసి వచ్చె నమ్మా?

సునం తండ్రీ! నే నే మని పలుకుదు?

సీ. అలనాఁడు జయపాలుఁ డడవినిఁ బోయినఁ గడు దుఃఖపడుచు మీ రడవిఁ జేరి,
పుడమి నేలు మ టంచు వడిఁ బంప, వచ్చి నే నడలుచు మనమున ననుజవార్త
లెఱుఁగఁగఁ గోరుచు నెల్ల వేగులఁ బంపఁ, దే రైరి శుభవార్త వార లేరు,
ఇటు లుండ నొకదిన మట నుపవనమున గరుణాలవాలు నీఘనునిఁ గాంచి,

గీ. యెవరొకో యంచు మదిని నూహించుచుంటి;
కులముఁ దెల్పుచుఁ బెండ్లాడఁ గోరెఁ నితఁడు,
పట్టరానిదుఃఖమున మీవ్యసనవార్త
దెల్పఁ దా నేఁగె బాలునిఁ దెత్తు ననుచు. ౨౯౬

ఉ. పోయెను బెట్టినట్టిమితి, పోయెను గాకొమరుండు, తానురా
డాయెను, మోస మాయె, నని యాకులపాటును జెంది, దైవమా!
హాయిగ నుండువాని నిటు హా! వెత పెట్టితి వంచు నెంచి, నే
నాయతివేషము న్గొనుచు, నక్కట! కాననసీమఁ జేరితిన్. ౨౯౭

కం. చేరి యరణ్యంబులు వెస దూఁగుచుఁ బాడగంటి నుసురు, దొరగెడునుగ్రున్,
గ్రూర ఖవ్వార్త వింటిని, జేరితి నీపట్టణంబు క్షేమము గంటిన్. ౨౯౮

తండ్రి నీయానతి లేక రాజ్యంబు విడచినతప్పు క్షమింప మిము వేఁడుచు
న్నాను [సాష్టాంగపడుచున్నది]

ప్రతా. (కూతును లేవఁదీసి యొడలు దులిపి తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని
ముద్దాడి) తల్లీ! సునందనీ! ఒప్పులకుప్ప వగునీయందుఁ దప్పు కలుగు నఁటే?
రాజ్యభారము వహించినదానవు కావున, నట్లు ప్రచ్ఛన్నవేషంబునం బో
యి, రాష్ట్రపాలనంబునందలిదోషంబులం గనిపెట్టి, యాగుట్టు బైటపెట్టి,
యంగకళింగరాష్ట్రంబుల రెండింటిని రక్షించితివి. దోషుల యథాయు
క్తముగ శిక్షించితివి. తమ్మునిఁ దెప్పించితివి. తలిదండ్రులముప్పు దప్పించి
తివి. ఇందు మన్నింపఁ గోరున దేమున్నది? కాని సునందనీ! వేఱొక మా
ట. ఈసుదేవునకు ని న్నిచ్చి నేటిదినమున పెండ్లి సేయ నిశ్చయించి నా,
రము. నీకు సమ్మతంబే కదా?

(సునందని సిగుతోఁ దల వంచుకొని తల్లియొద్దికిఁ బోవుచున్నది.)

అంగదేశప్రభూ! మంగళాంగా! ఈసుందరి, ఈలావణ్యలహరి, నాహృదయానందకరి, ఈ నందిని, నామనోనందని, నామంబున సునందని; నీపుత్రుని వరించియున్నది. కంటివే?

మంగ. ప్రతాపప్రభూ నీవియ్యంబు నాకు లభించుట బంగరునకుం బరిమళంబుపాత్రినవిధంబు గాదే? ఈచపలావలోకన చేసిన యుపకారంబు నే. మఱతునే? ఈపాటలాధరి నాపాలిటిదైవంబు కాని లోకసామాన్య మగుకోడ లనఁ జెల్లు నెట్లు? ఈయమ నాసంచితసుకృతఫలము నాదివ్యఫలపరిపాకసౌభాగ్యలక్ష్మి. ఇట్టిది నాకోడ లై యుండుట కల్పవృక్షంబు నాయింటిముంగిట నాటుకొనుటయె గాదె? ఏల కాలవిళంబనము? ఇట్టిశుభముహూర్తంబు మఱియొకటి దొరకదు వైళంబ కులగురుల రప్పింపుము.

ప్రతా. సేవకా! పెండ్లికి సర్వంబు సిద్ధంబు చేయించి మనపురోహితుం డగువామనాచార్యులను, బట్టణంబున నుండుభూసురులను, సకుటుంబపరివారంబుగా వచ్చునటుల వేఁడి రమ్ము.

సేవకు. మహాప్రభూ చిత్తము. (అని వెళ్లుచున్నాఁడు.)

భటుఁ. ప్రతాపమహాప్రభూ ఆదురాత్మకుఁడు మంత్రి మార్గంమధ్యంబున నొకచో నీ పత్రిక వ్రాసి, ఇది రాజసన్నిధానంబునకుం గొనిపోయి దీనిని రాజ్యంబున నెల్లెడ వెల్లడిసేయునటుల వేఁడుకొంటి నని మనవిచేయు మని నాచేతికి నిచ్చి న న్నతివేలముగ బ్రతిమాలెను ఇదిగో పత్రిక. ప్రభువర్య! (అని చూపుచున్నాఁడు.)

ప్రతా. మణికంధరామాత్యా! ఆపత్రిక యేమిటో చదువుదురా?

మణికం చిత్తము. మహాప్రభూ (అనుచు నిట్లు చదువుచున్నాఁడు)

"ద్విపద" పురవరులార! యో-పుణ్యాత్ములార
ధర ధాతగీతకుఁ - ద ప్పెందు లేదు
దయఁ గని దైవంబు - దన కిడినట్టి
నయ మగుపదవిని - నరుఁ డుండ లేక,
యున్నతపదవి తా - నుబ్బుచుఁ గోరి,
మిన్ను మ న్నెఱుఁగక మీఱినపనులు
సేయఁబూనిన, వాఁడు- సెడు, నది నిజము,
న్యాయముఁ దప్పిన- నరకము ధృవము;

తా నొకటి తలంప - దైవంబు వేఱు
పూనికతోఁ బూను - భూజనులార!
ఇందులతార్క్యాణ - మిలలోనఁ జూడ
నెందునులేదని - యెన్న నేమిటికి?
సందియంపడ నేల - సద్గుణులార!
వందురుననుఁ గని వాస్తవమనుఁడి.
ఇలపైన బుద్ధికి - నీఁ డగునట్టి
బల మెద్ది లే దని - బలుగరువించి,
తలపోయ లే నైతి - దైవబలంబు,
భళిభళీ! విధి బలు - బలవంత మిలను
సకలశాస్త్రజ్ఞుఁడ - సరివారిలోన
నకళంకుఁడ నటంచు - నలరెడునేను
నున్నంత పదవిలో - నుండక యకట!
యున్నతదేశాధి - పోన్నతపదవిఁ
గోరినందునఁ గదా - గురుతరఘోర
కారణంబులు నాకుఁ - గలిగెను దుదకు
కూరిమి గలిగిన - కూఁతురు గొడుకు,
భూరిగుణోదార - భూనుత దార,
ధనధాన్యవస్తుసా - ధనములకలిమి,
తనరార నుండియుఁ - దనివోక నాదు
మట్టుమీఱుదురాశ - మది నాదఁగొలిపె,
రట్టడేపా లాయె - రామ! నాబ్రతుకు,
రాజ్యంబు నెటులైన - రాఁ జూచికొన్నఁ,
బూజ్యుండ నయ్యెద - భువిలోన ననుచు,
నన్ను మిచ్చినదాత - యనునది మఱచి,
కన్నులు గానక - గర్వించి మిగుల,
చిన్నవానిని ముద్దు - చిన్నెలవానిఁ,
జెన్నలరారెడు - చెలువులవానిఁ,
గన్నవారికిఁ గంటి - కలిమియై చెలఁగి,

యున్నవానినిఁ గటా! - యుండఁగ నీక,
జననికిఁ దప్పించి - చయ్యనఁ దెచ్చి,
ఘనతరం బగుఘోర - కాంతారసీమ,
కటికవాఁడును బోలెఁ - గంఠంబు ద్రుంపఁ,
గటకటా! యాజ్ఞ న - క్కటికము లేక
యొసఁగితి నాకన్న - నుర్వరఁ గటిక
కసిహెచ్చునా? దీనిఁ - గన హేయ మయ్యో!
ఇంతలు నిలువక - యిం తంత గాని
వంతలఁ గుందెడు - వసుధేశ్వరునకు,
మచ్చువేదాంతము - ల్మది నాటఁ బలికి,
తెచ్చుకోల్మాతములు - దెలిపి కలంచి,
సచ్చరిత్రునిఁ గటా! - సన్యాసిరీతి,
మెచ్చుతపంబుల - మెలయించి, వాని
సుతకుఁ బట్టముఁ గట్టి - చూపోపు లేక,
మతకరిమతములు - మఱికొన్ని పన్ని,
దాని నేఁ గూడంగఁ - దలఁచి తలంచి,
కాని దీపని యని - కామిని నాదు,
కోడలిఁ జేయంగఁ - గోరితి నయ్యో,
యాడికలను విడ - నాడితి నయ్యో!
ఎబ్బెఱికము లేక - యెలమిఁ బుత్రునకు,
సెబ్బరశాస్త్రముల్ - సెప్పితి నయ్యో!
భూమీశుతనయను - భువనమోహినినిఁ,
గామించి కాంత గాఁ - గైకొమ్ము తనయ!
యని పల్కి వాని నే - నపవేకిఁ జేసి,
ఘన మగువ్యసనాగ్నిఁ - గ్రాలితి నయ్యో!
"వనవిహారంబున - వనితలఁ గూడి,
మన మలరారంగ - మహిమోపయుతుని,
వలరాజుఁ దెగడెడు - వలపులవాని,
నలను దేవునిఁ గని - యతనికి ననుజు

కలరూపులును దన - కలంతలు దెలిపి,
కలికి సునందని - గడు విచ్చి పంచె"
నని జయమాలినా - యనుఁగులతనయ
విస్ఫిపింప నపుడె నే - వీరులఁ బంపి.
యలసుదేవునిఁ బట్టి - యనలంఘ్యు మగుచు,
నిలజను లెవ్వరు - నెఱుఁగంగరాని
చెఱ నుంచి, "జయమాలి - చెలిమిఁ జేకొనుచు,
నఱ లేక జయపాలుఁ - డని నామ మొంది,
మెలఁగిన మేదిని - మేలుగ నేలఁ,
గలిగింతు" నని వానిఁ - గష్టపెట్టితిని,
రాజ్యము నా దని - రాజ నే ననుచు,
పూజ్యుఁడ నే నని - పుణ్యుండ ననుచు,
హెచ్చగుసంపద - హెచ్చితి ననుచు,
మెచ్చుచు నను నేన - మెచ్చితి; నకట!
గురుభీకరుఁడు బలు - క్రూరకర్ముండు,
నురుతరపాతకి - యుగ్రసేనుండు,
దలఁపక నాముద్దు - తనయఁ గామింప,
వెలయఁగాఁ బెండిలి - వెసఁ జేయఁ బల్కి,
యాసలు గల్పించి - యన రానియట్టి,
బాసలు సేసితి - బలుకరినముగ -
బిసరుహాక్షికిఁ బసి - బిడ్డకు నేను,
వ్యసనకరం బగు - వర్తన దెలిపి,
మోసపుమోహాన - మోదముఁ గఱపి,
భాసురాంగిని వెల - భామగాఁ జేసి,
యాయుగ్రసేనుని - యంకెలోఁ గొనుచుఁ,
జేయించితిని, జెడు - సేఁతలు మిగులఁ,
"గార్యంబు లన్నియుఁ - గడచె నీమాఁట
మర్యాదనూపరా - మాము వైళంబె,
యారామ ని"మ్మని - యడుగ నేఁ గినుక,

నారామమును జేర్చి - యడుగులు దఱిగి,
నరు లేరు దిరుగని - నగమునఁ ద్రోచి.
హరుసించితిని మొన్న, - నక్కటా! నేను.
ఇంతఁ జేసినవారు - నేమి ఫలించెఁ?
జింతయొక్కటి తక్క - శివశివా! నేఁడు?
పుత్రశోకముఁ గంటిఁ - బుణ్యంబు సెడితి
ధాత్రిని నాపేరు - దలఁచినంతటనె,
కుటిలుఁడు, కష్టి బల్ - క్రూరకర్ముండు,
కటికడెందమువాఁడు, - కల్మషుఁ, డనుచు,
గేడించి కందురు - కీడును బోలె.
పోడిమి పోయెను - బోదు ప్రాణంబు.
ఏమిసేయుదు నయో - యెవ్వరు దిక్కు?
ఏమిపాపములు నే - నెన్ని చేసితిను?
చేలరేఁగి నేను జే - సినపని యేమి?
ఇల దైవవశమున - నెటులాయెఁ దుదకు.
ఇన్నికష్టంబుల - కిన్నిక్రూరముల,
కిన్నిపాతకముల, - కిన్నిఘాతలకుఁ,
గారణం బేమని - కనుఁగొన వలదె?
వారు పీ రన కెల్ల - వారును దీని,
సందియింపకుఁడయో - సజ్జనులార!
ఇందులకారణ - మిది యె దురాశ.
పాపరూపము గదా - పాడుదురాశ.
యోపికఁ బోకార్ప - నోపు దురాశ.
చెడుగులలోఁ జెడు - చెడుగు దురాశ.
ఇడుమలకును బుట్టి - నిల్లు దురాశ.
మిత్రుల నెడఁబాపు - మిత్తి దురాశ.
పుత్రులఁ జంపించుఁ - బుడమి దురాశ.
తల్లిదండ్రులఁ ద్రెంచుఁ - దగనిదురాశ.
కల్లలు పలికించుఁ - గడిమిదురాశ.

మానవసుఖముల - మారి దురాశ.
హీనతఁ గావించు - నిదిర దురాశ.
న్యాయము లమ్మించు - నదిర దురాశ
క్యాయము లమ్మించుఁ - గదర దురాశ.
మానము నమ్మించు - మహిని దురాశ.
ప్రాణము నమ్మించు - భళిరె దురాశ.
కామము హెచ్చించుఁ - గదర దురాశ.
నేమముఁ దప్పించు - నేర్చు దురాశ.
కులశీలముల నెల్లఁ - గూల్చు దురాశ.
కలసుఖముల నెల్లఁ - గాల్చు దురాశ.
దుర్యశఃఖని యగు - దుష్ట దురాశ.
దుర్యోధనునిఁ గుల - దూషణుఁ జేసె.
ఆతతావిలకారి - యగునీదురాశ,
ఆతతాయిగఁ జేసె - నానహుషేంద్రుఁ,
ఘాతకపాథోధి - పాడుదురాశ,
వీతాసుఁ జేసె నా - వీరు రావణునిఁ,
గలుషాలవాల మీ - కటిక దురాశ,
బలశాలి బలిని బ - ల్బాధలఁ బెట్టె.
కులకుఠారం బగు - కుటిలదురాశ,
తలవంపుఁ దెచ్చు నెం - తటివాని కైన.
వినరోరిజనులార - విడుఁడి దురాశ,
అనుభవసిద్ధాంత - మైనదురాశ,
వినిపించితిని మీకు - విడుఁడి దురాశ.
మనుఁడి మాన్యము గాను - మాని దురాశ.
తలలు మార్పించును - దగదు దురాశ.
వలదు మీకెన్నఁడు - వలదు దురాశ.

"సుమతి"

సునం. తండ్రీ! పాపము వీనిపరితాపమ్ముం గన్న జాలి యయ్యెడు. చేసినదోసమ్ములకు మోసమ్ములకును బశ్చాత్తాపమ్ము నొందుచున్న వాఁడు. వీనిప్రాణంబుఁ

దీసిన మన కేమి లాభంబు లభించెడిని? మనదేశమ్మునుండి వెడల నడచి
నం జాలదే? మఱియొక్క చిన్నివిన్నపం బాలకింప నవధరింపుము. వీని
నాయుగ్రసేనునొద్దికిం గొనిపోయి, వాఁడు బ్రతికియుండు నేని వానికి వీ
నిం జూపి, యీభంగంబుం దెలిపి విడిపింప న్గాన తిమ్ము ఈద్రోహి తన
పాపఫలంబుం దాన యనుభవించుం గాక.

ప్రతా. తల్లీ! ఎంతటిదయావతివే నీవు? కానిమ్ము నీయిచ్చయె జరుగుం గాక.

(ప్ర సేవకుఁడు.)

సేవ. మహాప్రభూ! వివాహంబునకు సర్వంబును సన్నాహం బయ్యె ఆచార్యు
లాదిగాఁ గలభూసురులు విచ్చేసి దేవరరాకకై కాచి యున్నవారు తమ
కీయుదంతంబుం దెల్పు మన్న నేనిట వచ్చితి

ప్రతా. అటు లయినఁ బ్రియమిత్రమ! మంగళాంగా! మనము వేవేగ శుభము
హూర్తంబుం జరిపింతము, విచ్చేయుఁడు (అందఱును వెళ్లుచున్నారు)

---

## సునందనీ పరిణయము

### ఉత్తరరంగము - వివాహమంటపము.

(సునందనను దేవుఁడు పెండ్లిపీటపైఁ గూర్చుండి యుండఁగా యుక్తప్రదేశ
ములయందు రాజులును మంత్రియు బ్రాహ్మణులును బరివేష్టించి సభ
విడిసి యున్నారు.)

పురోహితుఁ డగువామనాచార్యులు.

మ. అతికారుణ్యము పూని, చిత్ర మగుమీనై పుట్టి, భూలోక మా
తతవారాశిని మున్గుచుండుతఱిఁ బోతంబు న్నిరూపించి, యా
క్షితిపు న్గాచె; సురారిఁ ద్రుంచె; విధి కక్షీణత్వము న్గూర్చె; నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతమున్.

ఒకానొకవిప్రుడు 300

మ. అతికోపోద్ధతమానిశప్తుఁ డయి, సర్వైశ్వర్యము ల్వాసి, సం
తతచింతాయుతుఁ డైనయింద్రునెడఁ, బూర్ణానుగ్రహంబూని, స
మ్మతిఁ గూర్మాకృతిఁ దాల్చి యిచ్చెను సిరు; ల్మన్నించి పోషించె, నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతమున్. 300

మఱి యొకబ్రాహ్మణుఁడు

మ. క్షితిఁ జాప వ్వలెఁ జుట్టి భోగితలము న్జేర్చె హిరణ్యాక్షుఁ, డు
చతిరోషంబునఁ గ్రోడి యై, ఖలు నిరాయాసంబుగాఁ జంపి, భూ

సతిని న్దేర్చి యనంగసంగరమున, న్సమ్మోదము న్గూర్చె; నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్. ౩౦౨

ఇం కొకభూసురుఁడు.

మ అతిభక్తి న్స్మరి కర్త భర్త, మఱి లేఁ డన్యుం, డఁ టంచు న్సుతుం
డతిమోదమ్మున నాడఁ, హేమకశిపుం డత్యుగ్రుఁ డై, "చూపు మ
ర్త్యతి! కంబమ్మున" నంచుఁ దన్న, నరసింహం బై ఖలున్గూల్చె, నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్. ౩౦౩

వే ఱొకపాలుఁడు.

మ దితిజారాతిపదంబు నొంద, బలి దైతేయుండు, జన్నంబుఁ దా
నతిహర్షంబునఁ జేయ, నత్తఱి వటుండై, మూఁడుపాదంబు లీ
క్షితి దానం బని వేఁడి, మూఁడుజగముల్ క్షిప్రంబున న్నిండె నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్ ౩౦౪

ఒం డొకమహీసురుఁడు

మ. తతనీతి న్పితృవాక్యపాలనమతిం దల్లి న్వెస న్జంపి, యా
తతభక్తిం దనతండ్రి వేఁడి, మరలం దల్లి న్సహర్షంబుగా
బ్రతికించెం, దనతండ్రివైరికుల మాబాల్యంబుగాఁ ద్రుంచె; నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్. ౩౦౫

ఇఁక నొకబాపఁడు.

మ. అతికష్టుం డతిక్రూరుఁ డా దశముఖుం, డత్యుగ్రుఁ డై లోక మా
తతభీతి న్బెగడొందఁ జేయ, నతిచింతం దైవమా! యంచు ది
క్పతు లెల్ల న్వడి వేఁడ, దాశరథి యై పాపాత్ముని న్గూల్చె, నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్. ౩౦౬

ఇంక నొకమహీదేవుఁడు

మ. క్షితిలో దానవు లుగ్రు లై జనుల హింసింప, న్సురాధ్యక్షు లా
తతభక్తి న్దను వేఁడఁ, బుట్టె నవని న్దా దేవకీపుత్రుఁ డై;
ధృతిఁ గంసుం బరిమార్చెఁ; బాపులను మిత్తిం జేర్చె నీక్షోణి; నా
నతరక్షారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముల్. ౩౦౭

వే ఱొక్క భూదేవుఁడు.

మ దితిజు ల్కామపురత్రయంబున మహాదివ్యాంగన ల్గూడ ని
క్కితి మంచు న్ద్విజగంబు నేఁపఁ, ద్రిదశు ల్గెడెంచి వేఁడంగ, నా

సతుల న్బ్రౌఢతఁ గూడెఁ; బట్టణముల న్సౌకర్యత న్గూర్చెఁ; నా
నతరత్నారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముఁ. ౩౦౮

ఒం డొక్కపుడమివేల్పు.

మ. క్షితి వర్ణాశ్రమధర్మము ల్సెడి యఘూత్క్షీణంబుచే ధర్మదే
వత క్రుంగ, న్గలి హెచ్చ, శంబళపురిఁ వర్ధిల్లువిప్రాంగనా
సుతుఁ డై, కల్కి యన న్భువి న్వెలసి, యాత్మోద్రాత్మ శిక్షించునా
నతరత్నారతుఁ డెవ్వఁ, డాహరి, మిము న్రక్షించు నశ్రాంతముఁ. ౩౦౯

ముత్తైదువులు మంగళారతు లిచ్చుచున్నారు.

సీ. మహనీయసుకుమార! మంజులాకార! యో మానితగుణ! జయ మంగళంబు,
జితమారశుభకాయ! సీమంతినీప్రియ! మతిహితగుణ! శుభమంగళంబు,
దానగుణాధీన! దీనజనావన! మానినీసుమబాణ! మంగళంబు,
విహితజనాధార! యహితజీవనహార! మహితయశోహార! మంగళంబు.

గీ. అంగదేశాధిపకుమార! మంగళంబు,
రంగదభిరామశృంగార! మంగళంబు,
భంగరిపుసంఘ! యిదె దివ్యమంగళంబు,
మంగళము నీకు నక్షయమంగళంబు. ౩౧౦

"మంగళమహాశ్రీవృత్తము"

అంగజసమానరుచిరాంగ! ముద మారఁగ ననంగజనకుం డొసఁగు మీకుఁ,
మంగళమహోదయము మానితచిరాయువును మాననిమహాయశము నంచుఁ,
రంగదరిభంగ! యభిరామ మొనరంగఁ గడు రాజిలెడు వేడుకల నెంతే,
నంగనల మెల్లనిటు లారతులు పాడెదము నాడెదము మంగళమహాశ్రీ. ౩౧౧

వామనా! ప్రతాపచక్రవర్తీ! ఇపు డింక నేమి కావలయు నందువు?

ప్రతా. గురూత్తమ! నే నింతకంటెఁ గోరునది యే మున్నది? చూఁడుడు:—

మ. సికపూవాడక యుండఁ బుత్రకుఁడు వచ్చెఁ; వానికై చన్నరా
జకుమారుం డరుదెంచి వాసిఁ గనెఁ గష్టం బొక్కఁడు న్లేక, పు
త్రికయుం జెక్కు చెమర్పకుండ నిటు సేరెఁ; వంచకు ల్పోయి, రొ
ద్దిక వియ్యమ్ము ఘటించె; నేమిగలదర్థి న్వేడ విప్రోత్తమా?

అయిన నాచార్యోత్తంసులరు మీరలు ప్రసన్నులరై తిరి గావున ని ట్లగుం గాక

# భరతవాక్యము.

మానిని. ఈతుల బాధల నొందక లోకము వృద్ధి నెసంగుత, మర్త్యులు నిర్ణీతశతాబ్దము లాతతసౌఖ్యసమృద్ధి సుఖించుత, రాజవరుల్
నీతిని లోకహితం బొనగూర్చుచు, నిస్తులభూరిశుభంకరులై,
ఖ్యాతిని బ్రోచుతఁ గాశ్యపి, నెల్లెడఁ గల్గుత భూతదయాహృదయుల్.

వామనా. తథాస్తు. (అందఱును నిష్క్రమించు చున్నారు.)



కృతికర్తకావ్యాంతమునఁజేయు దేవతాప్రార్థనము.

పుష్పమాలికా బంధము.

చం. పురహర ! నారదాదిముని ముఖ్యముదావహా! సాహసా! హరీ!
హారికరిసీరిసారహయహస్తిహరాభ ! యశోయదాయకా !
ధరపరసారనీలతను! తధ్యతపోధనమానసానతా
ఖరమురసారసాబ్జకవికల్పకపద్మపదాపదాపహా!. ౩౧౮

| | | | | | |
|---|---|---|---|---|---|
| హ | ని | సా | క | య | శో |
| పురదా | దిముదా | వహరీ, | హరిసా | రహరా | భయకా, |
| నా | ఖ్య | సా | సీ | స్తి | దా |
| ప | ను | మా | ము | వి | దా |
| ధరనీ | లతపో | ధనతా, | ఖరసా | బ్జకప | ద్మపహా. |
| సా | ధ్య | సా | సా | ల్ప | దా |

చిత్రము గోపురబంధము.

కం. శ్రీశ! నిగమాంతవార్త! సు
రేశాశ్మసమానదేహ! కృష్ణ! మురారీ!
యీశ! నినుఁ గొలుతు నయగతిఁ;
గేశవ! దయ దలఁచి తేని కృతి రహిఁ గాంచున్. 3౧—౨

చిత్రము.—(దయ దలఁచి తేని శ్రీనివాసరాయనికృతి రహి గాంచున్.)



# శుద్ధపత్రిక.



గీ. తప్పు లొప్పులపట్టిక తనరఁ గూర్చి
వ్రాసినాఁడను మీ రిది వాసిగఁ గని
చదువుఁ డీకృతి మఱికొన్ని కొదవ లున్న
నగుపఱచి నాదువినతుల నందుఁ డీరు.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 10 | గస్టార్థంచన | పరపదార్థవంచన |
| | 11 | సులభంబని | స్వార్థకంబని |
| 11 | 5 | ప్రపంచంబున నల | ప్రపంచంబునంగల |
| 13 | 12 | నేనాని | సేనాని |
| 15 | 3 | ఆంభోరుహ | అంభోరుహ |
| | 5 | నెఱి | నెరి |
| | 16 | చిఱు | సిరి |
| | 23 | యురగపుఫణులని | యురగఫణములని |
| 12 | 7 | వాల్మికాది | వాల్మీక్యాది |
| 18 | 1 | బోనోడంగ | బోనాడంగ |
| | 17 | నర్థ్యంబు | వ్యర్థంబు |
| 19 | 9 | దుర్వ్రజము | |
| 22 | 11 | త్రయీపంణంబు | త్రయీషణంబు |
| 23 | 3 | బాపమును | బాపములు |
| | 28 | గోరిచుట్టు | గోరుచుట్టు |
| 24 | 20 | పలుకులిచ్చు | పలుకుఁజిచ్చు |
| 25 | 6 | ముఱువగుచిఱుతలపలుకులె ఘరయాం | మురువగుచిఱుతలపలుకులనరయాం |
| 26 | 8 | నోము నోవ మైతిమి | నోము నోచ మైతిమి |
| | 28 | తొలఁగ కుండ | తొలఁగనీక |
| 28 | 12 | మీనముఁ బట్టచూచి | మీనముఁబట్టఁ జూచి |
| 29 | 12 | గాఁగల్లకార్య | గాఁగలకార్య |
| 31 | 10 | తృతీయరంగము | తురీయరంగము |
| 33 | 2 | చతుర్థరంగము | పంచమరంగము |
| | 14 | గతపితి | గఱపితి |
| | 23 | కార్యవిఘ్నంబను | కార్యవిఘ్నంబను |
| 34 | 9 | వికసనము | వికసనము |
| 35 | 1 | గొందరో | గొందురో |
| 36 | 4 | నతులు | సతులు |
| 37 | 21 | సుంనందని | సునందని |
| 38 | 4 | చతురమతితో | చతురమతిని |
| | 6 | యితురుని | యితగుని |
| 40 | 15 | బలువుగల | బలువగల |

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 50 | 23 | దురాశాపాశంబు | దురాశాపిశాచంబు |
| 51 | 16 | సంక్రందనుసతుఁడుండునె | సంక్రందనసుతుఁడుండునె |
| 55 | 12 | ధిక్కరిత | ధిక్కారిత |
| | 13 | ధృతశమనుని | హృతశమనుని |
| 56 | 3 | యేల | నేల |
| 22 | 8 | నగుపడెడు నే కిస | నగుపడెడు నేఁ బ |
| 28 | 6 | సూక్ష్మ మధ్య | సూక్ష్మమధ్య |
| 29 | 2 | కన్యకనుండాఁకఁగ ! | కన్యకను ? ద్రాఁకఁ గ |
| 80 | 29 | పాలియింపవె | పాలయింపవె |
| 83 | 13 | యుండఁడు | యుండదు |
| 82 | 19 | తుదిముట్టంగనె | తుదిముట్టంగదె |
| | 26 | దానిమాయలు | సానిమాయలు |
| 88 | 12 | నభిమానముతో | బలుమానవముగ |
| 90 | 2 | సౌఖ్యదంబుగ | నారజంబుగ |
| 91 | 26 | గాలుల్కొండుం | గాలుల్కొడుం |
| 92 | 19 | గొడ్డులార్చెచెడి | గొడ్డులార్చెడి |
| 96 | 14 | కళిందేశ | కళింగదేశ |
| 98 | 18 | నరయతేదె | నరయఁజూచి |
| 101 | 26 | మిటి | మటి |
| 102 | 13 | బపితి | బ పితి |
| | 21 | ప్రసకుఁగ | ప్రసుక్కుఁగ |
| 104 | 16 | శేముషి | శేముషీ |
| 106 | 22 | శవ్యము | శక్యము |
| 107 | 24 | బంధితము | బంధింతము |
| 111 | 9 | ఎకిమీని | ఎటులాయె ? |
| 112 | 12 | బాడరెనిన్నిట్లాహా | బలుహీనంబౌనాహా |
| 113 | 12 | యటు | యయి |
| | 15 | న్మందుండునిశ్చేష్టుఁడై | న్మల్లాడుదుఃఖంబున |
| 115 | 16 | ముకుందా | ముకుంద |
| | 26 | కనికరమేడ | కనికరమేల |
| 112 | 19 | ఘోరాతప | ఘోరాతత |
| 120 | 25 | సుదందని | సునందని |
| 121 | 26 | పంచమాకము | పంచమాంకము |
| 127 | 15 | అతఁడు | అలవాఁడు |
| | 24 | అరె ' సుదేవుఁడ ' యంచు | అదె ; సుదేవుఁ డిటంచు |
| | 26 | విస్పష్టమానంగు | విందురు మీ రని |
| 131 | 12 | మికానీ | కామినీ |
| 136 | 24 | వేదాంము | వేదాంతము |
| 142 | 28 | నవలంబికచితివే | నవలంబించితివే |
| 143 | 29 | సిగుతో | సిగ్గుతో |
| 144 | 15 | మార్గంమధ్యంబున | మార్గమధ్యంబున |
| 147 | 27 | మాఁట | మాట |